## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి,అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్(డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా http://www.new.dli.ernet.in),ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071249

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

జగన్నాథ పండితరాయల

# భామినీ విలాసము

తెలుగు వివరణ

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు 4

BHAMINI VILASA

By "Panditaraja" Jagannatha (17th century A. D.) rendered into Telugu prose by Dr. Puttaparthi Narayanacharyulu, Cuddapah.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాద్ - 500 004.

ప్రచురణ : 303

ప్రథమ ముద్రణ : 1980

ప్రతులు : 1000

వెల రూ : 5-00

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్ - 500 004.

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాద్ — 500 001.

---

Paper Used for the printing of the book was made available by the Government of India at concessional rate.

# తొలిపలుకు

సాహిత్యశాస్త్ర రచనలో అతివేలమైన ప్రతిభా వైదుష్యాలను ప్రదర్శిం చిన జగన్నాథపండితరాయలు ఉదాత్తమైన కవితాసృష్టిచేసిన రసమూర్తికూడ. ఆయన విశృంఖల జీవితవృత్తం, సాహిత్యవిమర్శనాధోరణి విద్వల్లోకానికి చిర పరిచితాలు. పండితరాజు 'గంగాలహరి', 'లక్ష్మీలహరి' వంటి రసవత్కవితా పాథోధులతోపాటు, వ్యాకరణ విమర్శనలను, రసగంగాధరంవంటి అలంకారశాస్త్ర గ్రంథాలను అందించాడు. ఆయన వ్రాసిన 'భామినీ విలాసం' కవితల రత్నా కరం. మౌక్తిక ముక్తకాల పేటిక, 'అన్యోక్తి సముల్లాసం', 'శృంగార సము ల్లాసం' 'కరుణ సముల్లాసం' 'శాంత సముల్లాసం' 'ప్రక్షిప్తాలు' అనే ఈ సంపు టిలో ఐదు విభాగాలున్నవి. ఈ శ్లోకాలన్నీ కావ్యరసికులకు ఆమెతలు. అచ్చమైన కవితకు లక్ష్యాలు. కవితా సౌందర్యం ఈ 'భామినీ విలాసా'దర్శంలో తన నీడను చూసుకున్నదనవచ్చు.

శతాధికంగా ఉన్న ఈ సంస్కృత శ్లోకాలలో నిక్షిప్తమై ఉన్న కవితా సౌందర్యాన్ని చక్కని తెలుగు వచనంలో సాక్షాత్కరింపజేసినారు శ్రీ పుట్ట పర్తి నారాయణాచార్యులుగారు. శ్రీ ఆచార్యులుగారి కవితాప్రాగల్భ్యం, బహుభాషా భినివేశం, వైదుష్యం వ్యుత్పన్నులైన వారికందరికీ తెలిసినదే. ఈ 'భామినీ విలాసాని'కి ఆచార్యులుగారు విలువైన పీఠికను వ్రాసినారు. ఇందులో జగన్నాథ పండితులగురించేకాక యావద్భారత ప్రశస్తినందిన దార్శనికుడు, కవి, సాహిత్య శాస్త్రవేత్త, పూర్వమీమాంసాప్రవర్తకుడు, మానవోత్తముడు అయిన అప్పయ్య దీక్షితులను గూర్చి చక్కగా వివరించినారు. అప్పయదీక్షితులను గూర్చి విశే షాలను తెలుపడానికి శ్రీ ఆచార్యులుగారు ఈ అవకాశాన్ని చక్కగా వినియో గించుకొని, తమదైన, అరుదైన విమర్శనాఫణితిని ప్రదర్శించినారు. 'భామినీ విలాసం' తెలుగులో ఈ రూపంలో అవతరించడానికి బాధ్యులైన డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులుగారికి సాహిత్యఅకాడమి ధన్యవాదాలు. ముద్రణ సందర్భంగా ఎదురైన చిక్కులను ఎదుర్కొనడంలో మాకు అండగా నిలిచి అచ్చటచ్చట టిప్పణుల (Foot Notes)ను సవదరించిన డా. పుల్లెల శ్రీ రామచంద్రుడు గారికి మా నమస్సులు.

ఆరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

తేది. 24-5-1980

# పీఠిక

కిం నిశ్శంకం శేషే
శేషే వయసి త్వ మాగతే మృత్యౌ।
అథవా సుఖం శయీథాః
సవిధే జాగర్తి జాహ్నవీ గంగా॥

అది కాశీ నగరం. ఆనాడు పండితులకందరికీ కూడలి అదే. అట్టివే నవద్వీపాలున్నూ. తర్కకర్కశ పాషాణాలకు నిలయాలు. మొన్న మొన్నటి వరకూ నవద్వీపాలకు పోయి వచ్చిన వానిని గొప్ప పండితునిగా జనులు లెక్కకట్టేవారు. అప్పయ్య దీక్షితులు దాక్షిణాత్యులు. అరవ దేశంలో వాసం చేస్తూన్న తెలుగు వాడంటారు. ''ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ నాల్పస్య తపసః ఫలం'' అనే మాట ఆయనదే. దీక్షితులు అరవీటి వెంకటపతి రాయలూ రాయవేలూరు రాజులూ మొదలైన వాళ్ళ దగ్గర కాలక్షేపం చేస్తూ వుండేవారు. ''జింజి'' కోటలోగూడా ఆయనకు చక్కని గౌరవం వుండేది. జింజి ఆస్థానంలో 'రత్నఖేట' దీక్షితులుండేవారు. ఆయన అసలు పేరు శ్రీనివాసదీక్షితులు. అస్తమిస్తూన్న సూర్యుణ్ణి 'రత్నఖేటం'తో ఉత్ప్రేక్షించటంతో ఆయనకు ఆ బిరుదమే పేరుగా ప్రచారంలోకి వచ్చింది. ఆ కాలంలో ఒక మంచి శ్లోకం చెబితే - ఆయన కాపేరే ప్రచారంలో పడిపోయేది. కృష్ణరాయల కాలంలో - వక్షస్థలాచార్యుడని ఒకాయన ఉండే వాడట ! రాయల వారు కంచి వరదుల దర్శనానికి పోయినారు. వారి వెంట తిరుమల దేవిన్నీ వుండింది. వారు దర్శనం చేసుకుంటున్నారు. అప్పుడా కవి యిలా ఉత్ప్రేక్షించాడు :

''కాంచిత్కాంచనగౌరాంగీం
వీక్ష్య తస్వీం పుర స్థ్సితాం.
వరద స్సంశయాపన్నో
వక్షఃస్థల మవైక్షత''

తిరుమలాంబ కాంచన గౌరాంగి. ఆమెను చూస్తూనే వరద రాజులకు 'లక్ష్మీదేవి' అనే సందేహం కలిగించటట! తన వక్షఃస్థలం మందున్న లక్ష్మి యెదుట నిలిచిందేమని ఆతురంగా తన యెదను చూసుకున్నాడట! ఆనాటినుండీ ఆ కవికి అదే పేరు పడిపోయింది.

మాఘకవికి వచ్చిన 'ఘంటామాఘుడ'నే పేరు కూడా యిలాంటిదే. ఇటువంటి కథలు కోకొల్లలున్నాయి. ఆనాడు కళల్ని అనుభవించే రసికత్వం జనులకు గొప్పగా వుండేది. ఇది విషయాంతరం. ప్రకృతానికి వత్తాం.

దీక్షితులు జింజి కోటకు వాదానికి వెళ్లాడు. "అప్పయ్య దీక్షితులను జయించి నేనాతనితో నమస్కారం పెట్టించుకుంటాను. చూడండి" అని రత్నఖేటుడు ప్రగల్భాలు పలికాడట. వాదం ఆరంభమయింది. దీక్షితులను జయించటానికి సాధ్యం కాలేదు. ఎలాగో బ్రతిమాలి తన కూతురిని అప్పయ్య దీక్షితులకిచ్చి వివాహం చేశాడు. శ్రీనివాస దీక్షితులు-మామ అయినాడుగదా! 'ఇక నాకు దండం పెట్టమ'న్నాడు, మామకు అల్లుడు నమస్కరించాడు. అలాగ తన మాట సార్థకం చేసుకున్నాడట! శ్రీనివాసదీక్షితులు; ముఖ్యంగా దీక్షితులు రాయవేలూరు చంద్రగిరులలోనే వుండేవాడని తోస్తుంది. ఆయన పాండిత్యం ప్రతిభా పవిత్రమైన జీవితమూ ఒకదాని కొకటి మెఱుగు పెడు తుండేవి.

భట్టోజీ దీక్షితులు గొప్ప వైయ్యాకరణుడు. ఆయన పూర్వ మీమాంసా వ్యాసంగానికి ఆర్యావర్తంనుండి చంద్రగిరికి తరలి వచ్చినాడట.

దీక్షితులు శిష్యుడైనాడు. అది శంకరుల తరువాత దీక్షితులకు గొప్ప గౌరవ ముండేది. సకల శాస్త్రాలున్నూ ఆయనకు కరతలామలకాలు. పాండిత్య మెంత కర్కశమో శివభక్తి అంత ఆర్ద్రము. శివభక్తి యెంత శరీర మనో దఘ్నమో, విష్ణువుపై గూడా అంతే ప్రేమ. కంచి వరద రాజులంటే ప్రాణం. కానీ కొద్దిగా శివునివైపే మొగ్గుచూపుతాడా అనిపిస్తుంది. విష్ణు సహస్ర నామాల కన్నిటికీ ఆయన శివపరంగా వ్యాఖ్యానం చేశాడట! నారాయణ శబ్దాన్ని మార్చటానికి సాధ్యంకాలేదు. అయన శబ్దంలోని 'ణ' త్వం ఆయన గొంతు పట్టు కుంది. మరణకాలంలో యెవరో అడిగారట- మీకోర్కెయేమిటి ? అని. ఆయన

'ణత్వం బాధతే' అన్నాడట, అంటే నారాయణ శబ్దంలోని 'ణ' త్వం నన్ను పీడిస్తూంది అని అర్థం. యేవో యిటువంటి కథలు.

విజయీంద్రులు దీక్షితుల సమకాలికుడు. విజయీంద్రులు రాఘవేంద్ర స్వామి పరమగురువు. విజయీంద్రులూ- దీక్షితులూ పిన్నమ్మ పెద్దమ్మ బిడ్డలు. విజయీంద్రులు మధ్వమతం పుచ్చుకున్నారు. ఆ కాలంలో మతం మార్చుకునే స్వాతంత్ర్యం వుండేది. త్రిమతాచార్యులలో యెవరివాదం నచ్చితే వారిమతాన్ని జనులు అవలంబించేవారు. విజయీంద్రులు బ్రహ్మాండమైన పండితులు, తపస్వి. శాస్త్రాలలో వారి స్వైరవిహారం. ఆయన నూటనాలుగు గ్రంథాలు వ్రాసినాడు. ఆయనపైన కక్షతో దీక్షితులుకూడా అన్నిపుస్తకాలు వ్రాసినాడు. ''వీరిద్దరి సంభాషణల్లో దొర్లిన" వని కొన్ని అసహ్యపు శ్లోకాలు చెబుతూంటారు. విజయీంద్రులు కుంభకోణ పీఠాధిపతి. దీక్షితులు పరమభక్తులు. వారిద్దరి సంభాషణమూ అలా బూతుల్లోకి దిగి వుంటుందని నేను పోల్చుకోలేను. మత ద్వేషాలతో - యెవరో వ్రాసి - ప్రచారానికి వాళ్ళ పేరు అంటించి వుంటారు.

కృష్ణరాయల గురువైన తిరుమల తాతాచార్యులు ప్రసిద్ధుడు గదా!, ఆయనకు పంచమత భంజన అనే బిరుదు వుండేది. రాయల సభలో ఆయన కున్న గౌరవం అనన్య సామాన్యం. తిరుమల తాతయ్యకూ, తెనాలి రామ లింగనికీ సంబంధం కూర్చి యెన్నో అల్లరి కథలు చెబుతారు. తెనాలి రామ కృష్ణుడు గొప్ప కవే కావచ్చు. కానీ పాండిత్యంలో తాతయ్యతో ఆతనికి పోలిక యేమున్నది?. ఆనాడు తిరుమల తాతయ్యగారిని యే చిన్న మాట అనివున్నా తెనాలి రామలింగని బ్రతుకు పీధినబడివుండేది. ఆతని మనుమడే కుమార తాతాచార్యులు. ఆయన చంద్రగిరిలో వుండేవాడు. కోటి కన్యాదానం తాతాచార్యులని ఆయనకు మారుపేరు. ఆయన డబ్బు ఖర్చు పెట్టి కోటి వివాహాలు చేయించాడట! ఆయనకూ అప్పయ్య దీక్షితులకూ యేవేవో చెత్త శ్లోకాలు చెబుతారు. ఇవన్నీ తోక తెగిన గాలిపటాలు.

అప్పయ్య దీక్షితులకు స్వమతాభినివేశం యెంతో గుణ గ్రహణ మున్నూ అంతగొప్పగా వుండేది. వేదాంత దేశికులు శాస్త్రాల్లో యెంత కఠినుడో, కవిత్వంలో అంత లలితుడు. అప్పయ్య దీక్షితులు దేశికుల కవిత్వాల కన్నిటికీ వ్యాఖ్యానాలు చేశాడు. నా చిన్నతనంలో అటువంటి

వాళ్ళను నేను చూచినాను. మొన్న మొన్నటి బాలసరస్వతి శ్రీనివాసాచార్యులు మా బంధువు. ఆయన శాస్త్రిలకు 'కాణాచి'. అయినా వారు
చదవని వానికి సంస్కృతం వస్తుందేమిరా ?' అనడం నేను విన్నాను. అప్పయ్య దీక్షితుల శివభక్తిని గూర్చి యెన్నో విచిత్రములైన కథలు ప్రచారంలో వున్నాయి. తాను మరణించినపుడు తన చితా భస్మాన్ని చిదంబరం వీధుల్లో చల్ల పలెనని కోరుకున్నాడట' పరమ శైవులయిన భక్తులా వీధుల్లో తిరుగుతుంటారు. వారి పాద స్పర్శతో తనకు కైలాసప్రాప్తి అవుతుందని ఆయన విశ్వాసం.

ఒకసారి ఆయన ఉమ్మెత్తకాయలు తిన్నాడట ! తింటూ శిష్యులతో అన్నాడు. "నాకు మతి చలించినపుడు నేనేమి అంటానో అవన్నీ వ్రాసి పెట్టండి," శిష్యులట్లే చేసినారు. ఆసమయంలో వారు శివ నామమును తప్ప వేరుమాటల నుచ్చరింపనే లేదట! వారి శివ భక్తిని గూర్చి యిట్టి కథలెన్నో వ్యాప్తిలో వున్నాయి.

అప్పయ్య దీక్షితులు తమ గ్రంథాల్లో యెదుటి వారి మతాన్ని ఖండించేటప్పుడు యెంతో ఉదారంగా ప్రవర్తిస్తారు. "తత్ చింత్యం"— "తత్ అవిచార రమణీయం" ఇట్టి మర్యాద గలిగిన మాటలే తప్ప 'తత్తుచ్ఛం'-'తన్నీచం'— యిట్టి చిల్లర మాటల్లోకి దిగరు. ప్రాచీన గ్రంథకారులంతా అంతే. త్రిమతాచార్యులు భాష్యాల్లో గూడా యీ పద్ధతే కనిపిస్తుంది. వారి సంప్రదాయమే అలాంటిది. ఇతరులను అవమానించడం, వారితో ప్రత్యవమానం పొందడం వారి కసహ్యం. తరువాతి వారు ఆ సంయమనాన్ని రక్షించుకోలేకపోయినారు. ఎంతటి ఉదాత్త పండితుడైనా పండితరాయలీ కోవకు చెందిన వాడే ననిపిస్తుంది. దీక్షితులు 'కువలయానందము', 'చిత్ర మీమాంస' అనే రెండు గ్రంథాలను వ్రాశాడు. ఇవి రెండున్నూ ఆలంకారిక గ్రంథాలు. ప్రాచీన ఆలంకారికుల్లో వాదానికంటే నా దృష్టిలో హృదయ ధర్మ మెక్కువ. రాగ రాగ ఆలంకారికులు తర్క శాస్త్రానికి వాకిళ్ల బోరగిల తెరచినారు. ఇంకేముంది ? పెద్ద కోలాహలం ప్రబలింది. ఆ శాస్త్రం యెందులో ప్రవేశించినా అంతే. గందరగోళం; బూకరింపు; నందిని పందీ-పందిని నందీ చేయడం. తార్కికులను జూచినప్పుడు నాకు సాధారణంగా 'వీళ్ళకు పోరు తప్ప యింకే అంగమయినా వుందా'? అనిపిస్తుంది. దీక్షితుల రెండు గ్రంథాలూ పండిత రాయల కంట బడ్డాయి. ఇంకేముంది ? ఆయనకు పండుగ దొరికి

నట్లయింది. "ద్రావిడశిశువ" నీ, "స్తనంధయుక" - నీ దీక్షితులను కసిదీర తిట్టినాడు. ఒకరీతిగా చూస్తే-'జగన్నాథుడు – ఉత్తర హిందూస్థానంలో చేరి బ్రదికిపోయినాడా ? అనిపిస్తుంది. అతడేగనుక దక్షిణాదిలో వుండి,తర్కతాండవం వ్రాసిన వ్యాసరాయలవంటి వారిచేతికి చిక్కివుంటే, ఆ కథ తెలిసేది. పైగా-అలంకారాలంటే తక్కిన శాస్త్రకర్తలకు పెద్ద గౌరవం లేదు. మొన్ననే యినుపకుతిక శంకరశాస్త్రిగారు వ్రాసిన - 'ధ్వనివాద'- మనే సంస్కృత గ్రంథాన్ని చూశాను. అందులో పండితరాయల "నిశ్శేష చ్యుతచందనం" - అనే శ్లోక వ్యాఖ్యానాన్ని ఒక పట్టుపట్టి దీక్షితులను సమర్థించారు. తిరుపతిలో వున్న ప్రసిద్ధపండితులు 'నీలకంఠశాస్త్రిగారు' 'రస గంగాధర ఖండనం' వ్రాసి వుండిరని విన్నాను. ఆ గ్రంథాన్ని నేను చూడలేదు. ముఖ్యంగా - వాదాలు వాగ్మిత్వం పైన ఆధార పడతాయి. మాటల చమత్కారంతో యెదుటి వాణ్ణి అదర గొట్టేవాడు పండితుడనిపించుకుంటాడు. పండితునికి కావలిసిన గుణాల్లో అదిన్నీ ఒకటే. కాని ఆదే సర్వమూ కాదు. అంతకంటే హృదయ ధర్మం గొప్పది.

ఏది యెట్లున్నా-దీక్షితుల వ్యక్తిత్వాన్ని మనం గమనించినపుడు, జగన్నాథు డాయనను చిల్లర మాటలతో సంబోధించి వుండకూడదని తోచడంలో ఆశ్చర్యమేమీలేదు. దీక్షితులవంటివాడు-ఒక చిన్న దౌర్బల్యంతో, పండితరాయల చేతికి చిక్కడం, నిజంగా ఆయన దురదృష్టమని భావించాలి. కేవలం పాండితీ వైమనస్యమే, పండితరాయల యింత పటాటోపానికి కారణమై వుండదని నా వూహ. వేరే ద్వేషం కూడా వుండి వుంటుంది. నాకు తోచేది-'జగన్నాథుడు కాశీలో విద్యాభ్యాసం ముగించుకొని, చంద్రగిరికి, రాయవేలూరికీ వచ్చివుంటాడు. ఆ నాళ్ళలో, పండితులను గౌరవించి పోషించే స్తోమత గలిగినవి కొన్ని సంస్థానాలు మాత్రమే. చంద్రగిరి, వేలూరు, జింజి,తంజావూరు మొదలైనవి. ఈ చోట్లలో అంతా అప్పయ్య దీక్షితులంటే పెద్ద గౌరవం. పరమ గుణగ్రాహియైన దీక్షితులకు పండిత రాయలపై అనాదరం యెందుకేర్పడి వుంటుంది? నాకు తోచేది యిది-దీక్షితులకు ఉత్తర మీమాంసకంటె పూర్వమీమాంసపై ఆసక్తి యెక్కువ. మహాకర్మనిష్ఠుడు, యజ్ఞాలు తాను చేసి-చేయించిన వాడు, జగన్నాథుడు జన్మతోనే కొంత స్వేచ్ఛాచారి. విశంకటుడు. ఇతని ప్రవర్తన దీక్షితుల కంత నచ్చి వుండదు. "షోకీలా"గా, కనిపించి వుంటాడు. "శ్విత్రేణైకేన దుర్భగం"

అని ఆయన భావించి వుంటాడు. దీనితో ఆ సంస్థానాలలో ప్రవేశం లభించి వుండదనుకుంటాను. ప్రాణం విసిగిన పండితరాయలు ఉత్తర హిందూస్థానీయుల పోకడలు నచ్చివాని కలవాటు పడినవాడు గావున నేరుగా 'ఢిల్లీ వల్లభ పాణి పల్లవతలే నేయం నవీనం వయః'' అని-నడుమ యెక్కడా ఆగకుండా ఆగ్రా కోటలో పడినాడు. ఏదో ప్రసంగవశంగా చెప్పుకుంటూ వచ్చాను:

అప్పుడు దీక్షితులు కాశీలో వున్నారు. ప్రభాత వాయువులు చల్లగా వీస్తున్నాయి. ఆ కర్మ నిష్ఠులు గంగా స్నానానికి పోతున్నారు. ఆ తీరంలో దట్టంగా అల్లుకున్న నికుంజాలు. అందులో ఒక దానిలో తన యవన కాంతతో గూడ జగన్నాథుడు విశ్రాంతి తీసుకుంటున్నాడు. అక్కడెవరో పడుకున్నారన్న సంగతి దీక్షితుల కర్థమయింది, కానీ-అతడు జగన్నాథుడన్న సంగతి వారు గమనింపలేదు. 'ఎవరు నాయనా! వయస్సెదిగిన వాడిలా వున్నావు. పరలోక ప్రాప్తికి ప్రయత్నించవలసిన సమయం. మృత్యువు దాపరిస్తూంది. ఈ సమయంలో దాన్ని గురించి యే మాత్రమూ ఆలోచించకుండా స్వేచ్ఛా వృత్తిలో వున్నావు అన్నారు. ఇది-మందలింపు కూడా కాదు. ఆ దయార్ద్ర హృదయులకున్న భూతానుకంప. ఈ మాటలు పండిత రాయల మనస్సులో హత్తుకుంటాయా? వాడు పూర్తిగా శృంగారపు మత్తులో వున్నాడు, తలయెత్తి "ఎవరది?''. అని గర్జించాడు. ఆ మసక చీకటిలో దీక్షితులకు వాడు జగన్నాథుడని అర్థమయింది. కొంత జంకినారు. జంకు పాండిత్యాన్ని గూర్చి కాదు, ఈ వాచాలునితో యెందుకు రగడ-అనే భావం. వారు వెంటనే 'ఓహో! నాయనా! నీవా? యెవరో అనుకున్నాను. మంచిది. మంచిది, హాయిగా గంగానదిపై నించీ సుఖశీతల పవనాలు వీస్తున్నాయి, సుఖంగా నిద్ర పట్టును లెమ్మ-''ని ముందుకు సాగిపోయినారట!

ఇది ఒక చాటువు. అప్పయ్య దీక్షితులదిగానే ప్రచారంలో వున్నది. సన్నివేశం కూడా యిదేనని చాలామంది అంటారు. సన్నివేశమెట్లున్నా-దీక్షితులు-జగన్నాథుడు వీరిద్దరి మన స్తత్వాన్నీ యీ శ్లోకం రేఖామాత్రంగా చెబుతుందని నా అభిప్రాయం.

జగన్నాథుడు వేగినాటి బ్రాహ్మణుడు. ఇంటి పేరు 'ఉపద్రష్ట' వారు, తూర్పు గోదావరీ తీరంలో 'ముంగండ' అనే అగ్రహారంలో జన్మ. జగన్నాథుడు 'రసగంగాధరం'లో తన విద్యల గూర్చి యిలా చెప్పుకున్నాడు:

"శ్రీమత్ జ్ఞానేంద్ర భిక్షోరధిగత సకల బ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీ రాక్షపాదీరపి గహనగిరో యో మహేంద్రాదవేదీత్.
దేవా దేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంక ప్రాప్త శేషామల ఫణితి రభూత్సర్వ విద్యాధరోయః"

జ్ఞానేంద్ర భిక్షువు, భట్టోజీ దక్షితులు వ్రాసిన, సిద్ధాంత కౌముదికి తత్వ బోధ అనే వ్యాఖ్యానం చేసినాడు. మొట్టమొదట కౌముదిని ఖండించడానికే ఆయన పూనుకొన్నట్లుంది. తరువాత యెందుకో అభిప్రాయం మార్చుకున్నాడు. అతడు వేదాంతంలో పారంగతుడు. ఆయన వద్ద జగన్నాథుడు సకల బ్రహ్మ విద్యా ప్రపంచాన్ని గ్రహించెనట. వైశేషిక న్యాయాలను మహేంద్రుడనే గురువు నుండీ నేర్చినాడు. ఖండదేవుడు జగన్నాథునికి జైమినీయంలో గురువు. ఆయన-ప్రసిద్ధుడైన మీమాంసకుడు. శేషం వీరేశ్వరశాస్త్రి గారినుండి పండితరాయలు వ్యాకరణాన్ని సాధించినాడు. దాని క్రిందనే యీ శ్లోకముంది:

"పాషాణాదపి పీయూషం స్యందతే యస్యలీలయా
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుం"

—జగన్నాథుని తండ్రి పేరుభట్టు. అతడు కవితాదక్షుడుగా వున్నట్లుంది. తండ్రినుంచీ కుమారునికి - కవితావిద్య సంక్రమించి వుంటుంది. మంత్రోపదేశం కూడా తండ్రే చేసివుంటాడు. అందుకే- "మహాగురుం" అంటాడు. పండితరాయలు హయగ్రీవ మంత్రోపాసకుడని విన్నాను. భట్టోజీ కౌముదినే గాక 'ప్రౌఢమనోరమ' అనే వ్యాకరణ గ్రంథాన్ని కూడా రచించినాడు. భట్టోజీకి జగన్నాధునికీ గురుపరంపరకు సంబంధించి ద్వేష మున్నట్లుంధి. ఆయన 'కాశికా' గ్రంథాన్ని ఖండించినాడు. దానిని మనసులో పెట్టుకుని జగన్నాథుడు- 'ప్రౌఢమనోరమాకుచమర్దనము'-ను రచించినాడు. ఆ పేరుపెట్టే దానిలోనే యెంత లౌల్యముందో నేనే చెప్పేదా! యథాప్రకారమా గ్రంథములోనూ ధార్ష్ట్యమే. "గురుద్వేషదూషిత మతీనాం పునుషాయుషేణా పి నశక్యంతే గణయితుం ప్రమాదాః-" అంటాడు. గ్రంథరచనలో- భట్టోజీ దీక్షితుల దోషం యేముందో నాకు తెలియదు. తక్కిన శాస్త్రాలలో పూర్వపూర్వ ప్రామాణ్యము. వ్యాకరణంలో ఉత్తరోత్తర ప్రామాణ్యం. ఇది- అందరు పండి

తులూ అంగీకరించ వలసిన విషయమే. భట్టోజీని జగన్నాథుడు ఖండింప రాదని నా అభిప్రాయం కాదు. మాటల్లో కొంత 'హుందా,' తనంవుంటే బాగుండేది.

జగన్నాథుడు మహా ప్రతిభాశాలి. ఆ ప్రతిభకు- యే విద్య అయినా తాకితే వస్తుంది అనుకుంటాను. ఢిల్లీ చేరిన తరువాత అతడు 'పార్సీ' భాషలో మంచి ప్రవేశం సంపాదించినాడు. అజ్మీర్‌లో పారసీ పరిశ్రమ చేసెనంటారు. ఆ భాషలో ఆయనవి కొన్ని రచనలున్నాయని వినికిడి. సంగీతంలోనూ చాలా గొప్పవాడట! కొన్ని ధృవపదాలు అతడు వ్రాసినవి వున్నయంటారు. ఒకసారి- 'షాజహాన్-' కాశ్మీరమునించీ మరలివచ్చి - 'బంభర్'-లో నిలిచినాడు. అంతకు ముందే జగన్నాథునితో కొన్ని ధృవపదాలు రచించమని చెప్పివుండినాడట బంభర్‌లో ఆ పదాలు రచించి మహాకవి పాడినాడు. షాజహాన్ సంతోషించి మహాకవిని వెండినాణెములతో తూచినాడట! ఆ నాణెములు నాలుగు వేలకు పైగా ఐనాయి. ఆ ధనమంతా చక్రవర్తి జగన్నాథునికే యిచ్చినాడు. పండితరాయలు వ్రాసిన వేరే గ్రంథాన్ని, కవిని కూడా యేనుగుపై గూర్చుండబెట్టి చక్రవర్తి ఊరేగించెనట! ఈ విషయాలు - ఆనాటి "ముల్లా అబ్దుల్ హమీద్-" చెప్పినాడు.

మొగల్ చక్రవర్తులకు సంస్కృతముపై గూడ కొంత అభిమానం వున్నట్లుంది. జగన్నాథుడు జీవితమంతా షాజహాన్ కొలువులోనే గడిపినాడు. కొలువులో ప్రవేశం తనకు అసఫ్‌ఖానుని మూలంగా దొరికింది. అతని పరిచయం రాయముకుందుని ద్వారా. అసఫ్ ఖానుకు హిందీ సంస్కృతాలపై గొప్ప ఆదరముండేది. ఆనాటి పండితులాయనను 'కవికల్ప తరువుగా-' వర్ణించినారు. ఆయనకు 'బ్రహ్మజిజ్ఞాస-' కూడా వుండేదట! పండితరాయలు- అసఫ్‌ఖానుని యిట్లా వర్ణించినాడు

"సుధేవ వాణీ వసుధేవ మూర్తిః
సుధాకరశ్రీ సదృశీచ కీర్తిః.
పయోధికల్పామతి రాసఫేంద్రోః
మహీతలేఽన్యస్య నహీతి మన్యే"

—ఆసఫ్‌ఖానుని అనుగ్రహాన్ని సంపాదించడానికి- జగన్నాథుడు- అసఫ్ విలాసాన్ని రచించాడు. అందులో కృతిభర్తనిలా అంటాడు:

''అథ సకలలోక విస్తారిత మహోపకార పరంపరాధీనమాన సేన, ప్రతి దిన ముద్యద్దనవద్య గద్యపద్యాద్యనేక విద్యావిద్యోతి తాంతః కరణైః కవిభిరు పాస్యమానేన, కృతయుగీకృతకలికాలేన, కుమతి తృణజాల సమాచ్ఛాదిత వేద వనమార్గ విలోకనాయ సముద్దీపిత తర్కదహన జాలేన, నవాబాసఫఖాన మనః ప్రసాదేన, ద్విజకుల సేవాహేవాక క్రియా వాఙ్మనః కాయేన, మాధవకుల సముద్రేందునా, రాజముకుందేనాధిష్ఠితేన, సార్వభౌమ శ్రీషాజహాన్ ప్రసాదాధి గత పండిత రాజపదవీ విరాజితేన, త్రైలింగకులావతంసేన, పండిత జగన్నాథేన, 'అసఫ్ విలాసాఖ్యే-'య మాఖ్యాయితా నిరమీయత సేయమనుగ్రహేణ సహృదయానాం అనుదిన ముల్లాసితా భవతాత్.''

బాగానేవుంది. జగన్నాథుడు - అప్పయ్య దీక్షితుల రచనలో స్తన శల్య పరీక్ష చేశాడు. ఈయన అసఫ్ ఖానునిపై వ్రాసిన శ్లోక మెలావుందో చూతాం. -ఆ నవాబు వాణి సుధవలె వున్నది. మూర్తి వసుధవలె వున్నది. కీర్తి సుధాకర శ్రీ సదృశి. ఈ ఆసఫ్‌ఖాననే చంద్రుడియొక్క మతి పయోధి కల్పమట. ఉప మానాలన్నీ స్త్రీలింగాలే. వాణి సుధా సదృశం. బాగానేవుంది. ఆయన మూర్తి వసుధ వంటిదట! మూర్తి శబ్దం స్త్రీలింగం గనుక వసుధతో ఉపమానోప మేయభావం సరిపోయిందనుకున్నాడు, కీర్తికి సుధాకరశ్రీః అని కృత్రిమంగా స్త్రీలింగాన్ని కల్పించాడు. ''పయోధికల్పా'' అనేదికూడా— కృత్రిమంగా స్త్రీత్వం సంపాదించడమే. శాబ్దికంగా చమత్కారాన్ని సంపాదించినానని సంతోషం. కానీ- పయోధి స్త్రీలింగం కాదు. అట్లే 'వసుధ' తో అసఫ్‌ఖానుని మూర్తిని పోల్చడం అంత బాగాలేదు. 'మూర్తి' శబ్దంతో నవాబును-ఆడదాన్ని చేసినాడు. ఇలా విమర్శిస్తూపోతే యెవరినైనా — యెక్కడికైనా తప్పుపట్టవచ్చు. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే- పండితరాయలు శాబ్దికుడైన కవి. అంటే- అర్థానికంటే శబ్దానికి ప్రాధాన్యమన్నమాట!. శబ్దార్థాలను రెండింటినీ సమానంగా నిర్వహించే సామర్థ్యం యెవ్వరో కొందరు అదృష్టవంతులకు మాత్రమే లభిస్తుంది. వాల్మీకి- కాళిదాసు- భారవి, వంటివాళ్ళకు.

ఆసఫ్ ఖానుకూ దారాకూ యెక్కువ స్నేహం. దారాకు హిందూమతమంటే తీరని అభిమానం. ఉపనిషత్తుల నన్నింటినీ పారసీలోకి అనువాదం చేసినాడు.

దానికి 'సిద్రఅక్బర్' అనిపేరు. పండితరాయల 'జగదాభరణం'లో - దారాను గొప్పగా వర్ణిస్తాడు. ఆయనకుండే హిందూమతాభిమానమే ప్రాణాలు తీసింది. ఔరంగజేబు ఆయనను చంపినాడు. అసఫ్‌ఖాన్ షాజహాన్ చక్రవర్తికి మామ, నూర్జహాన్‌కు తమ్ముడు. జహంగీర్ మరణకాలంలో 'ఖుర్రం' దక్షిణదేశంలో వున్నాడు. అసఫ్‌ఖానుకు జహంగీర్ దగ్గరకూడా ముఖ్యమంత్రిత్వమే. దానితో ఆయన జహంగీరు మరణిస్తూనే- షహర్యార్‌నుపట్టి గుడ్లు పీకించినాడు. దక్షిణానవున్న ఖుర్రంకు వర్తమానం పంపినాడు. ఖుర్రం ఆగ్రాకు వచ్చి, షాజహానై సింహాసనమెక్కినాడు. కనుక అసఫ్‌ఖాన్‌కు షాజహాన్ దగ్గరకూడా పెద్దమాట వుండేది.

ఒకరోజు పండితరాయలు చక్రవర్తితో చదరంగమాడుతున్నాడు. సమయానికి సరిగా 'లవంగి' అనేదాసి మదిరారసం తీసుకుని వచ్చింది. దాన్ని చూస్తూనే జగన్నాథునికి దానిపై మనసుపోయింది. చక్రవర్తి అప్పటికే వారుణీమదమత్తుడు. పండితరాయలకోర్కె నతడు గమనించి 'నీకేమి కావలె' నన్నాడు. వెంటనే పండితుడు జంకక యిలా అన్నాడు.

''నయాచేగజాళిం, నవా వాజిరాజిం
నవిత్తేషుచిత్తం, మదీయం కదాఽపి.
ఇయం సుస్తనీ మస్తకన్యస్త హస్తా
లవంగీ కురంగీ మదంగీ కరోతు''

ఈ లవంగి అచ్చపు మహమ్మదీయ స్త్రీగా తోచటంలేదు. ఎవరో రాజపుత్ర స్త్రీకి పుట్టినట్లుంది. ఆ నాడు మొగలులు రాజపుత్రస్త్రీలను పరిణయమాడే పద్ధతి బహుళ ప్రచారంలో వుండేది. హిందూ మహమ్మదీయ వివాహాలు కోకొల్లలు, చక్రవర్తి 'జంభరు' నగరంలో వీరికి సంబంధించిన కొన్ని పంచాయితీలను తీర్చినట్లు చరిత్రలో వస్తుంది. ఈ లవంగిపై నీకు మనసెందుకుపడిందని చక్రవర్తి ప్రశ్నించాడు కాబోలు !.

పండితరాయల ప్రత్యుత్తరం –
''యవనీరమణీ విపదశ్శమనీ
కమనీయతమా నవనీతసమా,

ఊహీ ఊహీ వచోమృత పూర్ణముఖీ
సముఖీ జగతీహ యదంకగతా'' –

–రాజు లవంగి ముఖంవైపు చూచినాడు. దానికిమూహా పండితరాయలపై మనసున్నట్లున్నది. ఈరీతిగా లవంగి పండితుని జీవితంలో ప్రవేశించింది. ఆయనకు దానిపై యెక్కువ మక్కువ వున్నట్లున్నది. చాలాచోట్ల ఆమె ప్రస్తావన తెచ్చి తన్మతాను పొగడుకుంటాడు. ఒకటి యీ క్రిందిది:

''యవనీ నవనీత కోమలాంగీ
శయనీయేయది నీయతే కదాచిత్
అవనీతల మేవ సాధుమన్యే
నవనీ మాఘవనీ వినోదహేతుః''

ఈ భామినీ విలాసం ఆమె మెప్పుకోసం అప్పుడప్పుడు చెప్పిన శ్లోకాల సంకలనమే. అందుకే దానికా పేరు పెట్టినాడు. ఆనాడుగూడా-యీనాటివలెనే, యితరుల పద్యాలను తస్కరించే మహానుభావులుండేవారేమో అందుకే ఒకచోట యిలా అంటాడు –

"దుర్వృత్తా జారజన్మానో
హరిష్యంతీతి శంకయా
మదీయ పద్య రత్నానాం
మంజూషైషా మయాకృతా"

– యీ శ్లోకంలోకూడా యథాప్రకారంగా జగన్నాథుని స్వభావమే. మన తెలుగులోకూడా కావ్యాలలో కుకవినింద చేసిన ఘట్టాలెన్నో వస్తాయి. కానీ – పెద్దన్నగారివలె నిందించినా, తమ పెద్దతనం నిలుపుకునేవారు అరుదుగా వుంటారు. పై శ్లోకంలోని 'జారజన్మానః' అనేదాన్ని తెలుగుచేస్తే యేమౌతుందో మీకే తెలుసు!

''రసగంగాధరం'' లోని శ్లోకాలు చూచినప్పుడు – చాలామట్టుకు అవి ఆయన అప్పుడప్పుడు చెప్పిన చాటువులే అనిపిస్తుంది. అందులోనే ఈ శ్లోకం గూడా వుంది.

''అపహాయ సకల బాంధవ
చింతా, ముద్వాస్యగురుకల ప్రణయం
హాతనయ ! వినయశాలిన్ !
కథమివ వరలోక పథికోభూః''

—పైగ్రథనం - యవనస్త్రీతో, ఆయనకు పుట్టిన యేకైక కుమారుడు మరణించినప్పటిదై వుంటుంది. జగన్నాథునికి - తన జాతికి చెందిన భార్య ఒకామె వుండేదని సమర్థించటానికి - చాలామంది పెద్ద హడావుడి చేసినారు. సవర్ణురాలయిన భార్య లేకుంటే - ''శాస్త్రాణ్యాకవితాని నిత్యవిధయః స్సర్వేపి సంభావితాః'' - అనే శ్లోకంలో ఉత్తర భాగం కుదరదని వారి చింత. దీనికి ఉపబలంగా ''కామేశ్వరీ హృదయతో దయితా నయాతి'' అనే శ్లోకం చెబుతారు. అంటే - ఆయన భార్యపేరు 'కామేశ్వరి' - అయివుంటుందని వీరి భావం, కానీ పండిత రాయలకు పౌత్రుడొకడున్నాట. ఆయన పేరు - మహాదేవసూరి. అతడీ శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ - యే విషయమూ చెప్పకుండా - ''కామేశ్వరీ కామానాం యీశ్వరీ-పూర్వణే సమార్థా''-అని మాత్రం చెప్పి వూరుకున్నాడు. పండిత రాయలకు - అల్పాయుష్కుడైన ఒక కొడుకు తప్ప – మరి సంతానం వుండివుండదని నా నమ్మకం. ఉంటే - అది ఒక పెద్ద కతయై వుండేది. ఆయనకు – రామచంద్ర భట్టనే తమ్ముడొకడుండెనట ! బహుశా - మహాదేవ సూరి ఆయన పౌత్రుడేమో ! యవనస్త్రీని వివాహ మాడినందువల్ల బ్రాహ్మణులాయనను ఆ కాలంలో వెలివేశారు. ఆయన గొప్ప ఉపాసకు డన్నాము గదా ? మరణ కాలంలో లవంగిని తీసుకుని గంగాతీరానికి వచ్చినాడు. పండిత రాయలప్పుడు కాశీలో వుండేవాడు. 'గంగాలహరి-' అనే స్తోత్రాన్ని - గట్టుపై నిలబడి - జగన్నాథుడు చెప్పాడట ! ఒక్కొక్క శ్లోకానికి ఒక్కొక్క మెట్టు యెక్కుతూవచ్చి గంగ వాళ్ళిద్దరినీ తీసుకొని పోయిందంటారు. ఈ నాటికీ సాయంకాలాలలో, కాశీలో, అనేక స్నానఘట్టాలలో జగన్నాథుని గంగాలహరి చెప్పి భాగీరథికి నీరాజనం యివ్వడం నేను చూచాను. కనుక ఆయనకు స్వజాతి భార్య ఒకతె వుండేది అనే ఆకాశఖడ్గచాలనానికంటే మౌనం వహించడం మంచిది. మరి - పైన చెప్పిన నిత్య విధులెట్లాచేసినాడో?- ఎట్లాగో ఒకలాగ చేసి వుంటాడు. ఈయన గృహస్థాశ్రమంలో - మూడగ్నులు

రక్షించుకోవడానికి అప్పయ్య దీక్షితులాయేమి?-ఏమో, గంతకు తగిన బొంతలు-బ్రాహ్మణులు చిక్కి వుంటారు. తన నిత్యవిధులు నెరవేర్చుకుని వుంటాడు.

ఢిల్లీ చేరిన పండిత రాయలు ప్రసంగ వశాత్తు, పాదుషాతో యిట్లా అన్నాడట!

''శీతార్తా ఇవ సంకుచంతి దివసా నై వాంబరం శర్వరీ
శీఘ్రం ముంచతి. కించ సోఽపి హుత భుకో్కణం గతో భాస్కరః.
త్వంచానంగ హుతాశభాజిహృదయే సీమంతినీనాంగతో
నాఽస్మాకం వసనం నవా యువతయః కుత్రవ్రజామోవయం''

—అది బహుశా శీతకాలమై వుంటుంది. పగళ్లు సన్నగిల్లినాయి—చలితో అంగాలు ముడుచుకున్నట్లు; రాత్రి అనే స్త్రీ పైదుప్పటిని శీఘ్రంగా వదలనే వదలదు. అంటే రాత్రుళ్లు దీర్ఘాలన్న మాట! అంబర శబ్దము శ్లిష్టము, భాస్కరుడు ఆగ్నేయమూలలో దాగినాడు. పాదుషాగారు గూడా—విరహమనే అగ్నితో కూడుకున్న స్త్రీలహృదయాలలో చేరుకుని చలి కాచుకుంటున్నాడట! ''మాకు బట్టా లేదు. స్త్రీలూ లేరు. మా గతి యేమంటు''న్నాడు కవి, పొగిడే ఉత్సాహంలో రాజ్యంలోని స్త్రీలందర్నీ పాదుషాకే కట్టివేసినాడు, పండిత రాయలు.

ఇలాంటి శ్లోకాలను బట్టిమాస్తే, ఆయన చిన్ననాడే కాశీకి చదువుకోవడానికి వెళ్ళి వుంటాడు. మహమ్మదీయ స్త్రీని పెండ్లి చేసుకుని, అక్కడే వుండి వుంటాడన్నది ఖాయం. జగన్నాథుని కాలంలో, మరి ఒక ప్రసిద్ధుడైన కవి, వంశీధరుడు. ఇతగా డెప్పుడూ—ముంతాజ్ మహల్ ద్వారం కనిపెట్టుకుని వుండేవాడు. ఆయన్నేమన్నా అంటే—ఆవిడకు కోపం వస్తుంది. షాజహాన్—జగన్నాథునికి – 'పండితరాయలు' - బిరుదమిచ్చినాడు. అది– ఆ కాలంలో శ్రీనాథుని విద్యాధికారత్వం వంటి పదవి కావచ్చు. అప్పటినుంచీ – వంశీధరునికీ—పండిత రాయలకూ స్పర్ధప్రారంభమైంది. పోనీ లెమ్మని వూరుకుండే స్వభావం జగన్నాథునిది కదు. శ్రీనాథుని వలెనే జగన్నాథుడున్నా 'కచ్చి పోతు'. శ్రీనాథుడు ఢంకా బజాయించుదున్న పద్యం ఒకటి వుండనే వున్నది కదా!

ఉ. కంటికి నిద్రవచ్చునె! సుఖంబగునే రతికేళి, జిహ్వకున్
వంటక మిందునే! యితర వర్తనముల్ పదివేలు మానసం
బంటునె! మానుషంబుగల యట్టి మనుష్యున కెన్నడేనియున్
కంటకుడైన శాత్రవుడొకండు తనంతటివాడు గల్గినన్॥

—కవి సార్వభౌముడు ఒక పద్యంలో యీ మాట అంటే-పండిత రాయలు పది శ్లోకాల్లో అంటాడు. శ్రీనాథుడు, జగన్నాథుడు-వాళ్ళ పేర్లు కూడా పరస్పరం అందుకున్నట్లున్నాయి, శైలిలో పటాటోపం-ఔద్ధత్యమూ యితరులను చూస్తే అవహేళనా రెండు మనస్తత్వాలకూ సమానమే, శ్రీనాథుడే జగన్నాథుడై పుట్టి వుంటాడని నా నమ్మకం. శ్రీనాథుని పద్యాలు-పండితరాయలూ విని వుంటాడు. ఎందుకు విని వుండడు?. ఇద్దరూ ఆంధ్రులే గదా! పండితరాయల కొన్ని శ్లోకాలు శ్రీనాథుని పద్యాలకు వ్యాఖ్యానాలు చేసినట్లుంటాయి. ఆయన మనస్తత్వం యీ క్రిందిది—

॥శ్లో॥ ఆమూలాద్రత్నసానోః మలయవలయితా దాచకూలాత్పయోధేః
యావంత స్సంతి కావ్య ప్రణయన పటవస్తే విశంకం వదంతు;
మృద్వీకా మధ్య నిర్యన్మధుర రసఝరీ మాధురీ భాగ్యభాజాం
వాచామాచార్యతాయాః పదమనుభవితుం కోఽస్తి ధన్యోమదన్యః

—రత్న సానువు మొదలుకొని మలయ పర్వతంచే పరివేష్టింపబడి దక్షిణ సముద్రం వరకూ వుండే భూమిపైని పండితులందరికీ ఒక ప్రశ్న వేస్తాడు జగన్నాథుడు, ద్రాక్షపండును ఒలిస్తే-దానిలోపలి బేసంతో సమానమయిన రసం గలిగిన కవిత్వం చెప్పడంలో తాను ఆచార్యుడట!. తాను గాక మరెవ్వరయినా వుంటే-పేరు-పత్రికాముఖంగా ప్రకటించుకోవలెనని సవాలు. అంతమాత్రంతో ఆగలేదు. ఇంకా ముందుకు సా[illegible]నాడు-

॥శ్లో॥ నిర్మాణే యది మార్మికోఽసి నితరా మత్యంత పాకద్రవ
న్మృద్వీకా మధుమాధురీ మదపరీ హారోద్ధురాణాంగిరాం.
కావ్యం తర్హి సఖే! సుఖేన కథయ! త్వం సమ్ముఖేమాదృశాం
నోచే ద్దుష్కృతమాత్మనా కృతమివ స్వాంతాద్బహిర్మా కృథాః॥

—ఒకానొక ప్రత్యర్థిని కల్పించుకొని-యిట్లా ప్రశ్నిస్తాడు. ''ఓయీ! నిర్మాణ చాతుర్యం కలవాడవైతే-మృద్వీకారసంతో సమానమైన రసపరీవాహం గల్గిన నిర్మాణం చేయగలిగినట్లయితే-దాన్ని మావంటివాళ్ళ ముందర చెప్పు. ఎందుకంటే-దానిపై-చక్కని జడ్జిమెంట్ యివ్వగలవాళ్ళం మేమే. ఆ తాహతు లేకుంటే-చేసిన తప్పును గూఢంగా దాగుకునేవానివలె నీ కావ్యాన్ని గూడా గూఢంగా దాచుకో! ఇలాంటి జంభాల గోతులకు సాహిత్యంలో తక్కువ లేదు. తెన్నాలివాడో- ''ఉదయం బ స్తనగంబు''-అని తోకను బ్రహ్మాండంగా తిప్పి నాడు గదా!. "ఆ పరితోషాద్విదుషాం'' అనే మనుష్యత్వం యెవరికో కొంత మందికే లభ్యమయ్యే వరం. ప్రగల్భాలు కొట్టుకునేవాళ్ళను చూచి యేమను కుంటాము!- యిదీ ఒక దౌర్బల్యము లెమ్మనుకుంటాము. మృద్వీకారసానికి మద మున్నదట!. దానిని అణచవలెనట! ఇదెలా వుంది? ''గజం మిథ్య-పలాయనం మిథ్య'' లాగా వుంది.

వంశీధరునికీ-పండిత రాయలకూ జరిగిన, రహస్య యుద్ధంలో నాందీ యెవ్వరిదో తెలియదు. పండిత రాయల భామినీ విలాసంలోనే యీ శ్లోకం వసుంది.

శ్లో॥ దిగంతే శ్రూయంతే మదమలిన గండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమ శీలాః ఖలు మృగాః.
ఇదానీం లోకేఽస్మిన్ అనుపమ శిఖానాం పునరయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మిన్ మృగపతిః॥

— ఏదో ఒక దానిపై వంకపెట్టి తిట్టడమన్నమాట! మదం పుంజుకొన్న గండస్థలాలుగల దిగ్గజాలు-దిక్కుల కొనల్లో వున్నాయి. ఆడ యేనుగులను చంపుదామంటే 'అయ్యో పాప'మనిపిస్తుంది, పైగా-తన పరాక్రమాన్ని ఆడ వాళ్ళపై చూపడమేమిటి?,కనుక-'నానఖపాండిత్యాన్ని యెవ్వరిపైన చూపేది'- అని వాపోతూన్నదట మృగరాజు!, ఈ శ్లోకాన్ని తన శిష్యుడైన నారాయణుని చేతికిచ్చి వంశీధరుని దగ్గరకు పంపినాడట పండితరాయలు యన మాత్ర మేమి తక్కువ తిన్నాడా! వెంటనే యీ శ్లోకం గ్రథనంచేసి, జవాబుగా పంపి నాడు-

శ్లో॥ దిఙ్నాగాః ప్రతిపేదిరే ప్రథమతో జాత్యైవ జేతవ్యతాం
సంభావ్య స్ఫుట విక్రమోఽథవృషభో గౌరేవ గౌరీపతేః.
విక్రాంతేర్నికషం కరోతు కతమం నామ త్రిలోకీతలే
కంఠే కాల కుటుంబినీ కరుణయాసిక్తస్స కంఠీరవః ॥

వంశీధరుడున్నూ-తన్ను సింహానికే పోల్చుకున్నాడు, ఆయనకు-ఒక వత్తాసి కూడా వుంది. కంఠేకాల కుటుంబిని యొక్క కరుణ తనపై పుష్కలంగా వుంది. అంటే-ముంతాజ్ మహల్ దయ అన్నమాట! ఆ సింహం గూడా పండితరాయలలాగ్నే దిగ్గజాలపైకి దూకుదామనుకుంది. అవి యెంత బలం కల వైనా యేనుగులే. సింహం యేనుగులను చంపితే-యెవరాశ్చర్యపడుతారు?, అది దాని స్వభావమే లెమ్మంటారు. శంకరుని యెద్దుపైకే దూకుదామనుకుంది. అది యెప్పుడో కొమ్ములటూయిటూ ఆడించిందట. కడకు-యెట్లాగయినా యిది పశువే పొమ్మనుకుంది. తన వాడి గోళ్లు-ఒగపెట్టుకోవడానికి వస్తువేదీ దొరకలేదని-అదీ బాధపడుతూందట!, పండితులు తిట్టుకునే పద్ధతులిలాగే వుంటాయి' ఇంట్లో-ఆడ వాళ్లు-పిల్లిమీదా కుక్కమీదా పెట్టి-తిట్టుకున్నట్లు. పై శ్లోకం 'రసిక జీవనం'-అనే పుస్తకంలో వుంది. పై రెండు సింహాల జగడం ఎలా ముగిసిందో!. ఒక దానిపై మరొకటి పడి బరుక్కున్నాయో-లేక గుర్రు చూపులతోనే చాలించు కున్నాయో!

వంశీధరుని శ్లోకం మరియొకటి కన్పిస్తుంది, అది తప్ప మరేదిన్నీ కన పడటంలేదు. ఆయన యేదైనా గ్రంథం వ్రాసినాడో లేదో-వ్రాసినా అది గడ్డకు రాలేదో మనకు తెలియదు, ఆయన పేరిట శ్లోకం యీ క్రిందిది.—

॥శ్లో॥ సాయం దామగ్రథన సమయే లగ్నయాకర్ణమూలే
సఖ్యా మందస్మిత మధురయా సాదరం సూచ్యమానః.
కోయం ధన్యః కమలనయనే! యత్కథాయాంపురస్తా
దంగుల్యగ్రం నిజమపి ముహు స్సూచి విద్ధం నవేత్సి॥

—ఒకావిడ- సాయకాలం తీరికగా సూదితో పూలు కుడుతూ వుంది. ఆమెకొక చెలికాడున్నాడు. తన సఖి వానినుండీ యేదో వర్తమానం మోసుకుని వచ్చింది. అది- శుభ వర్తమానమే అయి వుంటుంది. ఎందుకంటే- ఆమె చిఱు

నవ్వుతో- నాయిక యొక్క చెవిదగ్గర మూతి పెట్టి చెబుతూ వుంటట!. ఈవిచ పూలు కుడుతూ అది వింటూవుంది. ఆ రసానందంలో సూది వ్రేలికి గుచ్చుకుంది. ఆమెకు తెలివి రాలేదు. ఒకసారి కాదుసుమండీ! 'ముహుః'. చాలాసార్లు గుచ్చు కుందట!. కానీ ఆమెకు దానిపై గమనమే లేదు. ప్రియుని సుద్ది 'గులాబ్ జామ్-' లాగా తింటూనేవుంది. ఆ భాగ్యవంతుడైన నాయకుడెవడని- వేరొకతె యీ సన్నివేశాన్ని చూచి- నాయికనే ప్రశ్నిస్తూంది. ఈ నాయిక ఒట్టి మొద్దులాగా కినపడుతుంది. అన్నిసార్లు సూదిగుచ్చుకున్నా తెలివిరాని దదేమి మనిషి? ఇలాంటి కవులు ధడియం హెచ్చుతక్కువగా యేదో ఒకటి చెబుతూవుంటారు.

షాజహాన్ చక్రవర్తి మరణించడంతో పండిత రాయల అదృష్టం తల్ల క్రిందులైంది. ఔరంగజేబు-కవిత్వాలకూ గివిత్వాలకూ లొంగేవాడు కాడు. పండితుడు తిన్నగా మధురకు మకాం మార్చినట్లుంది. బహుశా అప్పుడీ శ్లోకం చెప్పుకొని వుంటాడు.

॥శ్లో॥ పురాసరసి మానసే వికచసార సాలిస్ఖలత్
పరాగ సురభీకృతే ............ సంగ్రహ
సపల్వలజలేఽధునా మిళదనేక భేకాకులే
మరాళకులనాయకః కథయరే ! కథం వర్తతామ్ ॥

-ఒకానొక రాజహంస. దాని ఆయుస్సంతా మానస సరస్సులోనే గడచిపోయింది, ఆ నీళ్లు సామాన్యమైనవా ! వాని నిండా శత పత్రాలూ సహస్ర పత్రాలూ. వాని నుండి పరాగం నీళ్లలోకి తెప్పలుగా రాలుతుంది, ఆ సువాసన నాఘ్రాణిస్తూ, ఆ కమలాలపైన ఉయ్యాలలూగుతూ, శ్రేష్ఠములైన ఆ తామర తూండ్లను భుజిస్తూ, యింతవరకూ కాలం గడిపింది. ఇప్పుడు దానికి కాని కాలం వచ్చింది, పల్వలజలాల నాశ్రయించింది, అక్కడ యేముంటాయి, ఎడ తెగని కప్పల బెక బెకలు ! పాపం అది యెట్లా జీవిస్తుంది?'' అంటాడు పండిత రాయలు. మహమ్మదీయుల కొలువులోనే చాలాకాలం బతకడంతో కొన్ని మహమ్మదీయుల ఆచారాలు ఆయన కవిత్వంలో ప్రవేశించినాయి. ఈ క్రింది శ్లోకం చూడండి !

''నిరుద్ధ్యయాంతీం తరసాకపోతీం
కూజత్కపోతస్య పురోదధానే.
మయి స్మితార్ద్రం వదనారవిందం
సామంద మందం నమయాంబభూవ''

-ఒకానొక ఆవిడ. నాయిక అనుకుందాం. ఆడ పావురాన్ని పట్టుకొని పోతూంది. నాయకుడు మగ పావురాన్ని పట్టుకొని యెదుట నిలబడ్డాడు. అది మందంగా మణితంలాగా ధ్వనిస్తూవుంది, అప్పుడు-నాయిక చిఱు నవ్వుతూ తన వదనార విందాన్ని వీని వైపు తిప్పిందట! సాధారణంగా పావురాలను పెంచటం మన అలవాటు కాదు, ఈ అలవాటు వాళ్ళదే. అలాంటిదే యీశ్లోకం:-

''ప్రతి నగరం ప్రతి రథ్యం
భుజంగ సం వాస రుద్ధసంచారే.
మమ సఖి! సమ్మతమేతత్
న కులప్రతి పాలనం శ్రేయః''

-యెక్కడ చూచినా భుజంగ సంచారం. వానితో జనాలు అ త్రోవల్లో నడవటానికి భయపడుతున్నారు, ఇలాంటి పరిస్థితిలో,ఒక ముంగిసను పెంచడం మంచిదంటూవుంది చెలికత్తె. 'భుజంగ'-శబ్దానికి-విటులని కూడా అర్థం, ఎటుచూచినా విటులు అని కూడా అర్థం. ఎటుచూచినా విటులు సంచరిస్తున్నారు. అనుభవించకుండా, కులగౌరవమని మూతి ముడుచుకొని కూర్చోవటం అంత మంచిది కాదని చెలికత్తె యిచ్చే సలహా! ఇది రెండవ అర్థం. ముంగిసలను పెంచడంగూడా వాళ్ళ ఆచారమే.

ఇంకో శ్లోకంలో మరో మాటంటాడు, యమునా నదిలో చంద్ర బింబం ప్రతిబింబించిందట! దాన్ని చూస్తే నల్లటి, పల్చటి ముసుగు మొగంపై వేసుకున్న ఒకానొకతె ముఖ చంద్రబింబం జ్ఞాపకం వస్తున్నదట!

సాధారణంగా పండిత రాయలలో శాబ్దిక విజృంభణ మెక్కువ అని, ముందే చెప్పుకున్నాము. అట్టి సన్నివేశాలు చాలాచోట్ల కనిపిస్తాయి. ఈ క్రింది శ్లోకం చూడండి! అర్థం యెంత నలిగిపోయిందో!

''యస్మిన్ ఖేలతి సర్వతః పరిసరత్కల్లోల కోలాహలైః
మందాద్రి భ్రమణ భ్రమం హృదిహరిద్దంతావలాః పేదిరే.
సోఽయం తుంగతిమింగిలాంగ కవలీకార క్రియాకోవిద
క్రోధః క్రీడతి కిం కుశీర కుహరే త్వత్కార్ణవో రాఘవః''

- పైశ్లోకంలో ''కబలీకార క్రియా కోవిద క్రోధః'', ఇదంతా కేవలం ఆడంబరమే. పైగా 'కోవిద'-శబ్దం గిజ గిజ తన్నుకుంటుంది. రాఘవ శబ్దంలో వ్యాకరణానికి సంబంధించిన ఒక్క కక్కుర్తి, దానికి 'రాఘవుని బాణ'మని అర్థం. ఇలాంటి శ్లోకాలే యెక్కువగా కనిపిస్తుంటాయి. ఒక్కొక్కసారి మనసుకు తాకేట్టుగాకూడా చెబుతాడు.

॥శ్లో॥ సర్వేఽపి విస్మృతిపథం విషయాః ప్రయాతాః
విద్యాఽపి ఖేదగలితా విముఖీ బభూవ.
సా కేవలం హరిణ శావక లోచనా మే
నైవాఽపయాతి హృదయాదధి దేవతేవ.

—దీన్ని వ్రాసే వేళకు పండితరాయలకు అపరవయస్సు వచ్చివుంటుంది. యవ్వనంలోని అన్ని విజయక్షణాలు కొన్నికొన్ని మరపునకు తట్టివుంటాయి. మేధశ్శక్తి కూడా సన్నగిల్లింది. షాజహాన్ గతించటంతో, దారిద్ర్యంగూడా యింట్లో జొరబడివుంటుంది. కుమారుడు గతించిన దుఃఖము యింకా యేవేవో మనసును ఆక్రమించినాయి. ఏమైతేనేమి? ఆ లవంగి సూత్రం, మనస్సును విడిచి పోవటంలేదు. అధిదేవతవలె, హృదయాన్ని అంటిపెట్టుకునివుంది. అడుగడుగునా వెన్నాడుతూంది. అందుకే అంటాడు—

''ఉపనిషదః పరిపీతాః
గీతాఽపిచ హంత ! మతి పథం నీతా.
తదపిన హా! విధువదనా
మానససదనాద్బహిర్యాతి''

ఉపనిషత్తులన్నీ పానం చేసినాను. భగవద్గీతను బుద్ధితో అరిగించుకున్నాను. దానిపై అనేక వ్యాఖ్యానాలు చదివినాను. ఏమి ప్రయోజనం? ఆ ప్రియురాలు నా

మానసంలో యిల్లు కట్టుకొని కూచుంది ; ఆమె అక్కడనుంచి కదలడంలేదు. తానొక్కడే యిట్లావున్నాడా ! ఇంకెవ్వరూ యిట్లా ప్రవర్తించరా ! పండిత రాయలు తన ఓటమిని ఒప్పుకుంటాడా ! ఆయన అహంకారం ఒప్పుకోనివ్వదు గదా ! వెంటనే దానికి సమాధానం యీ రీతిగా చెప్పుకుంటాడు.

"తదవధి కుశలీ పురాణశాస్త్ర
స్మృతిశతచారువిచారజో వివేకః.
యదవధి న పదం దదాతి చిత్తే
హరిణకిశోరదృశో దృశోర్విలాసః"

— నా కథేమిటి ? గాలికి గడ్డపారలు కొట్టుకుపోతుంటే, "పుల్లాకా ! నీ పూరేది"-అన్నారట! అందరిబ్రదుకూ యింతే, పురాణాలు చదువుతారు.శాస్త్రాల్లో పరిశ్రమిస్తారు. స్మృతిశతాలు అధ్యయనం చేస్తారు. వీనినన్నిటినీ కలిపి బ్రహ్మాండమైన విచారం చేస్తారు. ఈ వివేకమంతా యెంతవరకూ వుంటుంది ? లేడికన్నుల్లాంటి కన్నులు గలిగిన ఆడుదానిచూపులు తనపై పడేంత వరకే." ఇంక— మనమేమైనా యెక్కువ మాట్లాడితే విశ్వామిత్రుణ్ణి, వశిష్ఠుణ్ణి, వాళ్ళ పితృదేవతలనూ పట్టుకువస్తాడు ;. మొదటినుంచీ ఆయన నోటితోనే బ్రదికినాడు. ఆ అభ్యాసం ఆ జీవికి యెప్పుడూపోదు.

ఆయన శృంగారం ఒక్కొక్కచోట, హృదయ ద్రావకంగా వుంటుంది.

"విరహేణ వికలహృదయా
విలపంతీ దయిత! దయిత! దయితేతి।
ఆగతమపి తం సవిధే
పరిచయహీనేవ వీక్షతే బాలా॥"

- ఈ నాయిక బాల. అంటే ముగ్ధ. విరహం ఆమె మనస్సుకు పెద్ద దెబ్బగొట్టింది. హృదయమంతా వికలమైపోయింది. మాటిమాటికీ నాయకుని పేరు —పనవుతూ— అరుస్తూంది. ఇంతలో వాడేవచ్చి యెదుట నిలబడినాడు. ఆమె దృష్టే మారిపోయింది. బాహ్యస్మృతి మరచిన స్థితి. ఎవరినో క్రొత్తవాళ్లనుచూచినట్లు చూస్తున్నదట !. ఇంతకంటే కొంచెం గట్టిది యింకొక ఆవిడ వుంది. ఆవిడ స్థితి యీ క్రిందిది—

''శయితా శైవల శయనే
సుషమాశేషా నవేందులేఖేవ.
ప్రియమాగత మపి సవిధే
సత్కురుతే మధుర వీక్షణై రేవ !.

ఒకావిడకు విరహం పట్టుకుంది. చెలిక త్తెలున్నారుగదా ! వాళ్లు చల్లని పదార్థాలు తెచ్చి - పడక పరిచారు. చిగురుటాకులు, పూలు, కమలాలు మొదలైనవి. వాటిలో కొంత నాచుగూడా వేశారట !. ఆమెలో కేవలం చిన్న కాంతి రేఖ మాత్రమే మిగిలింది. ఇంతలో, ప్రియుడు వచ్చి యెదుటనే నిలబడ్డాడు. ఆమెకు-లేచి-అతన్ని 'రిసీవ్' చేసే శక్తి లేదు. కళ్ళతో మాత్రం ఆదరిస్తూందట !

కరుణ రసాన్నిగూడా మర్మాలను తాకేటట్టు చెప్పే చాతుర్యం ఆయనకుంది. ఒకచోట యిలా అంటాడు.

''న యత్ర స్థేమానం దధురతి భయభ్రాంత హృదయా
గలద్దానోద్రేకభ్రమదళికదంబాః కరటినః
స్థలన్మ క్తాఘారే భవతి పరలోకం గతవతి
హరే రద్యద్వారే శివ! శివ! శివానాం కలకలః.''

''ఒకానొక సింహం వున్న గుహ. దానిముందు బ్రహ్మాండమైన మద ధారతో ఝుంకారం చేస్తూండే తుమ్మెదలు గలిగిన యేనుగులు గూడా పారాడ డానికి భయపడేవి. ఇప్పుడా సింహం మరణించింది. దాని గుహాద్వారం ముందు గుంటనక్కలు గట్టిగా అరుస్తూ కోలాహలం చేస్తూన్నాయట!''. ఒకానొక పండితుడు-పెద్దపెద్ద బిరుదు పట్టాలు గల మనీషులంతా ఆయన యెదుట బడటానికే జంకేవారు. దూరంనుంచే తోక ముడుచుకొని పోయేవారు ఇప్పుడా పండితుడు మరణించినాడు. ఆయన యింటి ముందు శుష్కపండితులంతా చేరి కోలాహలం చేస్తున్నారు.

క్రొత్తగా చెప్పడం కూడా పండిత రాయలకు సాధ్యమౌతుంది. ఈ రచన చూడండి,

''నిస్సీమ శోభా సౌభాగ్యం
నతాంగ్యా నయన ద్వయమ్.
అన్యోన్యాలోక నానంద
విరహాదివ చంచలమ్॥

—ఒకావిడకు యవ్వనం వచ్చింది, కళ్ళలో కాంతి నిస్సీమంగా వుంది. అంతకుముందు నిశ్చలంగా చూచేకళ్లు—యిప్పుడు పరమ చంచలములైనాయి. దీనికి కారణమేమిటి ? కళ్లు పరస్పరం చూచుకోలేవట. ఆ దుఃఖంతో – వాటి మనస్సుచెడి-నిలుకడలేక పొరాడుతున్నాయట ! ఇలాంటివేవో అరుదుగా కని పిస్తాయి. కానీ ఆయనకు సాధారణంగా—శబ్దంపైననే యెక్కువ దృష్టి. ఆయన హాస్యం యిట్లా వుంటులది.

''హారం వక్షసి కేనాపి
దత్తమజ్ఞేన మర్కటః.
లేఢి, జిఘ్రతి, సంక్షిప్య
కరోత్యున్నత మాసనం.''

ఒకడెవడో బుద్ధిలేనివాడు-కోతి మెడలో ముత్యాలహారం వేసినాడు. దాన్ని రవంత సేపు అది నాకింది, రవంత సేపు వాసన చూచింది; కడకుదాన్ని తుంటలుచేసి తుంటికింద వేసుకుని కూర్చుందట ! ఇలా వుంటుంది అతని హాస్యం, హాస్యాన్ని పోషించే గుణం అందరికీ సామాన్యంగా అబ్బేదిగాదు. ఎందరో హాస్యాన్ని వర్ణిస్తారు. కాని వారి అసమర్థతను మనం చూచి నవ్వ వలిసిందే తప్ప నిజమైన నవ్వు మనకురాదు. హాస్యాన్ని చక్కగా పోషించ గలిగిన వాడు తెనుగులో తెన్నాలి రామకృష్ణుడు. సంస్కృతంలో నీలకంఠ దీక్షితులు. తక్కినవారు వీళ్ళకు తీసికట్టే.

ఢిల్లీశ్వరునిపైన మరీ కనపడిన నవాబులపై యెన్నో శ్లోకాలు జగన్నాథుడు చెప్పినాడు. రసగంగాధరంలోనే వున్నాయి కొన్ని—

''మాహాత్మ్యస్య పరోఽవధిర్నిజగృహం గంభీరతాయాః పితా
రత్నానామహమేకమేవ భువనే కోవాఽపరో మాదృశః.

ఇత్యేవం పరిచింత్య మాఽస్మ సహసాగర్వాంధ కారంగమో
దుగ్ధాబ్దే ! భవతా సమో విజయతే ఢిల్లీ ధరా వల్లభః''

క్షీరసాగరాన్ని ప్రశ్నిస్తున్నాడు కవి. ''మహత్త్వానికి తల పొలము. గాంభీర్యానికి గృహము. రత్నాలకు తండ్రి నేనొక్కడేనని నీ కెంతో గర్వంగా వుంది. నీ వట్లా యేమీ గర్వపడవలిసిందిలేదు, మా షాజహాన్ చక్రవర్తి నీతో సమానుడులే !'' అని గద్దిస్తున్నాడు. శ్లోకం బాగా వుంది. పండితరాయల స్వభావమైన ధారాశుద్ధి కొట్టవచ్చినట్టుగా కనబడుతూంది. అలంకారాలూ వున్నాయి. హృదయం తప్ప అన్నీ వున్నాయి. ఇలాంటి జండా కట్టెలవంటి శ్లోకాలు పండితరాయల్లో కొన్ని నూర్లకు దొరుకుతాయి. వీటిలోగూడా ఒక శ్లోకం మంచిది దొరుకుతుంది. 'మనోరమా కుచ మర్దనం''లో యిట్లా అంటాడు.

''సురాణా మారామాదిహ ఝుడితి ఝంఝూనిలహ తాః
పతేయుశ్శాఖీంద్రా యది తదభితో నందతి జనః
కిమేభిర్వ్యాకార్యం శివశివ ! వివేకేన వికలైః
చిరంజీవన్నాస్తా మధి ధరణి ఢిల్లీ నరపతిః''

-కల్పవృక్షాలకు-దాన మివ్వడంలో వివేకంలేదనీ ఢిల్లీ నరపాలుడు వివేకంగా-యేనుగు పాడిగా యిస్తాడని వర్ణన. దాని చుట్టూ ఒక కథ అల్లుతాడు, స్వర్గంలో జంఝూనిలం వీచేటట్లూ అక్కడినుంచీ కల్పవృక్షాలు క్రిందపడేటట్లూ-ఐనా-యేదో కొత్తగా వూహించినాడు— మరి యివన్నీ దేనికి? దీనికి.

శ్లో॥ పురోధావన్ ధావన్ ద్రవిణమదిరాఘూర్ణితదృశాం
మహీపానాం నానాతరుణతరఖేదస్య నియతం
మమైవాయం మంతుః స్వహిత శతహం తుర్జడధియో
వియోగస్తే మాతర్యదిహ కరుణాతః క్షణమపి''

-''డబ్బు''-అనే ఆసవంచేత తిరుగుడు పడుతూవుండే కండ్లుగల రాజుల ననుసరించి-పరుగెత్తి పరుగెత్తి - అవస్థపడ్డానని తానే చెప్పుకున్నాడు. అంత మాత్రమే కాదు. తానింతవరకూ గడపిన జీవితం యిలాంటిదట;

''శ్వవృత్తివ్యాసంగో నియతమథ మిథ్యాప్రలపనం
కుతర్కేష్వభ్యాసః సతత పరపైశున్య మననం.
అపిశ్రావం శ్రావం మమతు పునరేవం గుణగణాన్
ఋతే త్వత్కో నామ క్షణమపి నిరీక్షేత వదనం''

—గంగాదేవితో మొఱపెట్టుకుంటున్నాడు. ''అమ్మా! నే నింతవరకూ ఆశ్రయించింది శ్వవృత్తి, చెప్పినవన్నీ అపద్ధాలు. చేసినవి కుతర్కాలు. ఎప్పుడూ వాడు డబ్బివ్వలేదే-వీడు డబ్బివ్వలేదే-అని తిట్టుకోవడం. తల్లీ! నా ముఖం నీవు తప్ప యెవడు చూస్తాడు? కడకు రెండు చేతులెత్తి–''జగన్నాథ స్యాఽయం సురధుని సముద్ధార సమయః''-అని–దండం పెడతాడు. జీవితాన్ని నడపిన పద్ధతిలో-సమాజం చూచిన పద్ధతిలో-అప్పయ్య దీక్షితులతో జగన్నాథు నికి పోలికే లేదు. నీలకంఠ దీక్షితులు-అప్పయ్యను ప్రస్తావిస్తూ యిట్లా అంటాడు.

''నానా దేశ నరేంద్రమండలమహాయత్నాతిదూరీభవ
త్కాదాచిత్కపదారవిందవినతేరప్పయ్యయజ్వప్రభోః.
శైవోత్కర్ష పరిష్కృతై రహరహ స్సూక్తై స్సుధాలాలితైః
పుల్లత్కర్ణ పుటస్య బొమ్మనృపతేః పుణ్యాని గణ్యాని కిం?''

-నానా దేశాలనించీ రాజులు వచ్చి దీక్షితుల దర్శనానికి కాచుకుని వుంటా రట! ఆయనను చూడటానికి యెన్నో అవస్థలు పడతారు, ఎప్పుడో ఒకసారి యెవ్వరో ఒకరికి ఆయన పాదాలకు నమస్కరించేయోగం పడుతుంది. ఆయన- ''శివా ద్వైత మత'' స్థాపనాచార్యుడు. శ్రీకంఠభాష్యోద్ధారకుడు, ఖండదేవుడే ఆతనిని గూర్చి–

''నాస్తి పూర్వం పరత్రవా అప్పయ్య దీక్షితాత్ కశ్చిన్మీ మాంసకః
యస్మిన్నేతస్యేవ న్యాయ సంచార నైపుణం తాదృశీ మాకలయేము''
(మీమాంసాభ్యుదయం)

అంతేకాదు. ''మీమాంసామూర్ధన్యు''డని ఢంకా వేసినాడు. ఆయన యెంతో పరమత సహనం కలవాడు. పరమగుణ పక్షపాతి యాదవాభ్యుద యాన్ని వ్యాఖ్యానిస్తూ - పీఠికలో యిలా అంటాడు

''కవి తార్కిక సింహస్య కావ్యమేత త్కథామతి
వివృణోమి మహీపాల! బహుమాన నియోగతః ॥

—దేశికులను కవితార్కిక సింహుడని చెప్పడానికి, దీక్షితులలో దేశికుల 'శత దూషణీ' గ్రంథం అడ్డం రాలేదు. ఆయనకు శివ పారమ్యమున్నా విష్ణు వుపై ద్వేషంలేదు. ఒకసారి-ఆయన శ్రీరంగంలో రంగనాథుని శివుడుగా దర్శన మిమ్మని కోరినాడట! ఆయన అట్లే యిచ్చినాడట! ఒక కథ చెబుతారు. ఆయ నదే ఒక రచన.

''విష్ణుర్వా శంకరోవా శ్రుతి శిఖరగిరా మస్తు తాత్పర్య భూమిః
నా ఽ స్మాకం తత్రవాదః ప్రసరతి కిమపి స్పష్టమద్వైత భాజాం॥
కింత్వీశ ద్వేష గాఢానల కలిత హృదాం దుర్మతీనాం దురుక్తం
భంక్తుం యత్నో మమాయం నహిభవతు తతో విష్ణు విద్వేషశంకా ॥

-పై శ్లోకంతో దీక్షితుల అభిప్రాయం తెలుస్తూనే వుంది. ఆయన 'విధిరసా యనం'లో యిలా అంటాడు-

''ప్రా ప్తంతత్ర్వాపణీయం కిలయదిహకియాన్ పూరణీయో స్తినాంశో
నా ఽనిష్టం వా నివర్త్యం నిజవిషయతయా దృశ్యతే కించిదత్ర.
కింతువ్యాపార ఏష ప్రథయతి ఫలసం యోజనార్థం పరేషాం
ప్రా ప్తః పుణ్యైరగణ్యైరివ విబుధగణో వేంకట క్షోణిపాలం''

ఇలాగా నిండైనది అప్పయ్య దీక్షితుల జీవితం. సార్థకమైనదిన్నీ ఆయన-గోవింద దీక్షితుల ప్రేరణతో 'కువల-యానందాన్ని' వ్రాసినాడు. రెండవ- ఆలంకారిక గ్రంథం 'చిత్రమీమాంస'. అంతటివాణ్ణి పట్టుకుని పండితరాయలు, కుతర్క-వ్యాసంగం చేయడం మంచిపనికాదు. ఆయన పాండిత్యానికి మనమెంత సంతోషించినా యీ విషయంమాత్రం మనసులో గుచ్చుకుంటూనే వుంటుంది. జగన్నాథుడు ఆంధ్రుడు.

'కిం నిశ్శంకం శేషే'-అనే శ్లోకం నేనే పరిష్కరించిన-'భామినీవిలాసం'-లోనూ కనబడుతుంది. కానీ పండితలోకంలో మాత్రం అది అప్పయ్య దీక్షితులదిగానే ప్రసిద్ధం. దాన్నే అనుసరించినాను.

'భామినీ విలాసం'లో యెన్ని శ్లోకాలున్నాయో యెవరూ చెప్పడంలేదు. నా కందిన ప్రతి వేదం వేంకట కృష్ణశర్మగారు అనువదించినది. దాన్నే నేనూ అనుసరించినాను. నాతో యీ పని చేయించిన అకాడెమీ యజమానులకు మనః పూర్వకంగా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. అధ్యక్షులకు, ఉపాధ్యక్షులకూ, కార్యదర్శి గారికీ నా వినతులు.

కడప

20-4-1980 పుట్టపర్తి నారాయణాచార్యులు

# భామినీ విలాసము

## అన్యోక్తిసముల్లాసము

*మాధుర్యపరమసీమా*
*సారస్వతజలధిమథనసంభూతా.*
*పిబతామనల్పసుఖదా*
*వసుధాయాం మమ సుధా కవితా.* 1

తాత్పర్యము :- నా కవిత్వము మాధుర్య పరమ సీమ. సారస్వత మనెడు సముద్రమును మథింపగా జన్మించి అనల్పమైన సుఖ [illegible] కనుక నిది యమృతము. దీనిని రసికులు తృప్తిదీర ద్రావుదురు గాక

విశేషములు :- "సారస్వత జలధి" = రూపకము. మథనమనగా-ఒక పక్షమున 'చిలుకుట' యని భావము. వేరొక అర్థమున – "బాగుగా నాలోచించుట" యని తాత్పర్యము. అందుచే రెండవ పక్షమున లాక్షణిక ప్రయోగము. "వసుధాయాం" = సాధారణముగా నమృతము స్వర్గమందే యుండును. నా కవిత్వమనెడు నమృతము భూమిపై నున్నది. అగుటచే–మీ కందరికి సులభముగ దొరకునదని తాత్పర్యము.

రసగంగాధరము :- ఇక్కడ మాధుర్యపానములు ఔపచారిక ప్రయోగములు. మాధుర్యము, పానము యీ రెండును కవిత్వమునందు సంభవింపవు. ఆస్వాద శ్రవణములు అముఖ్యార్థములు. వీనికి ముఖ్యార్థముతో సాధారణీకరణము; ఉత్ప్రేక్షాలంకారము.

*దిగన్తే శ్రూయన్తే మదమలినగండాః కరటినః*
*కరిణ్యః కారుణ్యాస్పదమసమశీలాః ఖలు మృగాః.*
*ఇదానీం లోకేఽస్మిన్ననుపమశిఖానాం పునరయం*
*నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మి న్మృగపతిః.* 2

తాత్ప :- మదముచేత మలినములైన కపోలములు కలిగిన, అష్ట దిగ్గజములు - ఎక్కడో దిక్కుల కొనలలో నున్నవి; కరేణువులు-పాపము! కారుణ్యాస్పదములు; జింకలు మొదలైన అన్యమృగములు (పరాక్రమాది) గుణములలో సామ్యము లేనివి. మృగపతి యొక్క నఖము లందమా! వాడిమిలో సాటి లేనివి. తన గోళ్ళయొక్క పరాక్రమము సింహ మిక నెవ్వరిపైఁ జూప వలెను ?

విశే :- "శ్రూయంతే"-వినబడుటయే గాని చూచిన వారెవ్వరును లేరని భావము; "పాండిత్యమ్" - ఇది లాక్షణికప్రయోగమే; "గోళ్ళయొక్క తీక్ష్ణతను" —అనుటలో పర్యవసానము. ఒకానొక పండితుడు-తనకు సాటియైన పండితులు లేకుండుటచే-తన పాండిత్యము నెవ్వరిపైన చూపగలడు ? అను అర్థము ధ్వనించుచున్నది. ఈ శ్లోకములో "పాండిత్యమ్" అను శబ్దము లేకున్నచో నింకను బాగుండెడిది. దీనితో ధ్వని గుణీభూతమగు ప్రమాద మేర్పడినది.

రస. గం :- ఈ శ్లోకము అప్రస్తుత ప్రశంస కుదాహరణముగా నివ్వఁ బడినది. అప్రస్తుతముచే, దానితో సమానమైన ప్రస్తుతార్థము తోచుట, ఒక విధమైన అప్రస్తుత ప్రశంసాలంకారము.

*పురా సరసి మానసే వికచసారసాళిస్ఖల*
*త్పరాగసురభీకృతే పయసి యస్య యాతం వయః.*
*న పల్వలజలేఽధునా మిలదనేకభేకాకులే*
*మరాలకులనాయకః కథయ రే ! కథం వర్తతామ్.* .. 3

తా :- ఈ మరాళకుల నాయకుని, గడచిన దినములు - వికసించిన పద్మముల నుండి జారిన పరాగములచేత సురభితములైన జలములుగల, మానస సరస్సులో గడచిపోయినవి; అట్టి ఈ రాచహంస నేడు కప్పల బెక బెకలతో నిండిన పడియ నీళ్ళలో కాలము గడపవలసి వచ్చినది. పాపము! ఎట్లు కాలము గడపును ?

వి :- "సురభీకృతే" – అభూత తద్భావార్థము నందు "చ్వి" ప్రత్యయము. అంతకుముందులేని సువాసనలు పద్మపరాగములతో నేర్పడిన వన్న మాట. "యస్య యాతం వయః" చక్కని జాతీయము. తెలుగులోని నానుడిని-సంస్కృతీకరించినట్లున్నది. ఇట్టిదే భవభూతి వాడిన "తేహి నో దివసా గతాః" అనునది. అతడు గూడ నాంధ్రుడే. ఇట్టిదే శ్రీనాథుని యొక పద్యము:

గీ:- నికటమున జేరి ప్రతిపుట నిష్ఠురముగ
అడరి కాకులు చేరి బిట్టరచి నప్పు
డుదధి రాయంచ యూక రయుండ లెస్స
సైపరాకున్న నెందేని జనుట యొప్పు.

"ఒక మహాకవి గతదినములలో గొప్ప భాగ్యము ననుభవించినాడు. నేడతనికికానికాలము వచ్చినది. చిన్నచిన్నరాజుల నాశ్రయించినాడు. అక్కడ అల్పపండితులు చేరి "ప్రతిపుట నిష్ఠురముగ" దమ పాండిత్యములను ప్రకటించుకొనుచున్నారు. పాపమా మహాపండితు డాగందపులో నెట్లు బ్రతుకును ?" అని పండితరాజు వాపోవుచున్నాడు.

ర. గం :- ఇదికూడ అప్రస్తుత ప్రశంసాలంకారమునకే ఉదాహరణము. కారణముచే కార్యము తోచుట మూడవ భేదముగా నందులోఁ జెప్పఁబడినది.

*తృష్ణాలోలవిలోచనే కలయతి ప్రాచీం చకోరీగణే*
*మౌనం ముఞ్చతి కించ కైరవకులే కామే ధనుర్ధున్వతి.*
*మానే మానవతీజనస్య సపది ప్రస్థాతుకామేఽధునా*
*ధాతః కిం ను విధౌ విధాతుముచితో ధారాధరాడమ్బరః. 4*

తా :- చకోరములు - ఆశాలోలములైన చూపులతో చంద్రుడుదయించు తూర్పును జూచుచున్నవి. కైరవములు తమ వాకట్టును వదలుచున్నవి; మన్మథుడు ధనుశ్చాలన మొనరించుచున్నాఁడు. మానవతీగణమానము ప్రయాణమునకు మూటగట్టినది. ఓయి ! బ్రహ్మ ! ఇట్టి శుభసమయములో మేఘములు చంద్రుని కప్పునట్లు చేయుచున్నావు. ఇది నీకు మంచి పనియేనా ?

వి :- చకోరములు వెన్నెలను గ్రోలును. అందుచే చంద్రుని వైపవి చూచు చున్నవి. ''మౌనం ముంచతి'' = చాల రసికమైన ప్రయోగము. ''కామే ధనుర్ధన్వతి'' = యుద్ధారంభమునకై ధనుస్సును గదల్చు చున్నాఁడు. ఇది యును మంచిమాట. ''మానే ప్రస్థాతుకామే'' = ఇదియును జక్కని వక్రోక్తి. పై శ్లోకములో నన్నియు సతి సప్తములు.

ర.గ. :- దైవముచ్ఛృంఖలముగాఁ బ్రవర్తించుట యను విభావముతో కవి కతనిని గూర్చిన యసూయ. కాని యిచ్చట అమర్షము, అభివ్యక్తము అసూయను శబలితముగా నొనర్చును.

*అయి! దలదరవింద! స్యందమానం మరన్దం*
*తవ కిమపి లిహన్తో మంజు గుంజన్తు భృఙ్గాః.*
*దిశి దిశి నిరపేక్షస్తావకీనం వివృణ్వాన్*
*పరిమలమయమన్యో బాన్ధవో గన్ధవాహః.* 5

తా :- విచ్చికొనుచున్న ఓ కమలమా! జారుచున్న తీయని నీ తేనెను గ్రోలి తుమ్మెద లరచుచున్నవి. అరువనిమ్ము! నిరపేక్షుఁడై నీ పరిమళము దిక్కు దిక్కుల యందును వ్యాపింపజేయు గంధవాహుఁడను మరి యొక్క బంధువు నీ కున్నాఁడు.

వి :- ''దళదరవింద'' - అప్పుడప్పుడే పద్మము విచ్చుకొనుచున్న దన్న మాట. ''కిమపి'' దాని రుచి యిట్టి దట్టిదని చెప్పుటకు నసాధ్యము. ''గంధ వాహః''- వాని పనియే గంధములు మోసికొనిపోవుట.

పై శ్లోకములో ''స్యందమానమ్ 'తావకీనమ్' ఇత్యాది శబ్దములు పాండిత్య స్ఫోరకములు. భృంగముల ప్రేమ సాపేక్షము; గంధవాహుని ప్రేమ నిర పేక్షము. ఈ శ్లోకములో ''నిరపేక్షః'' అను శబ్దమును వాచ్యముగా చెప్ప కున్నచో నింకను బాగుండెడిది.

*సముపాగతవతి దైవా*
*దవహేలాం కుటజ! మధుకరే మాగాః.*

మకరన్దతున్దిలానా
మరవిన్దానామయం మహామాన్యః. 6

తా :- ఓ కుటజమా ! కాలము చెడి మధుకరము నిన్నాశ్రయించినది. దాని నవమానింపకుము. మకరంద తుందిలములైన యరవిందములకు అది మహామాన్యము.

వి :- ''దైవాత్'' కాలము చెడి వచ్చినది. ''మకరంద తుందిలానామ్'' పరమసంపన్నులైన వారని ధ్వని.

''అయం మధుకరః'' ఈ రెండును పుంలింగములే; ఇట్టి చమత్కారము తెలుగులో గుదురదు; ఒకానొక మహాకవి కాలము చెడి యల్పు నాశ్రయించినాఁడు. వాఁడు పరమ సంపన్నులకును మాన్యుఁడైన వాఁడు. కాలముచెడి వచ్చినాఁడని వాని నవమానింపకుమని కవి హెచ్చరించు చున్నాఁడు.

ర. గం :- అప్రస్తుత ప్రశంసకే యుదాహరణము. ఇక్కడ వృక్షమున సంబోధనము గుదురదు గనుక ప్రతీయమానమైన యంశతో తాదాత్మ్యమును గోరును.

తావత్కోకిల విరసాన్
యాపయ దివసాన్ వనాన్తరే నివసన్.
యావత్ మిలదలిమాలః
కోఽపి రసాలః సముల్లసతి. 7

తా :- కోకిలా ! మ్రోయుచున్న తుమ్మెదలతో మామిడి పూచు వరకును యీ విరసములైన దివసముల నెట్లో యెక్కడో గడపుము.

వి :- ఒకనికి కానికాలము వచ్చినది. మరల శుభకాలము వచ్చు వరకును ఎట్లో యెక్కడో గడపుమని కవి యూరడించుచున్నాఁడు.

ర. గం :- ఇక్కడగూడ కోకిలకు సంబోధనము గుదురదు గనుక ప్రతీయమానాంశతాదాత్మ్యమును గోరును.

*నితరాం నీచోఽస్మీతి*
*త్వం ఖేదం కూప మా కదాఽపి కృథాః.*
*అత్యన్తసరసహృదయో*
*యతః పరేషాం గుణగ్రహీతాఽసి.* 8

తా :- ఓ కూపమా ! నేను నీచుడనని నీవెప్పుడును దుఃఖింపకుము. నీ హృదయము సరసము. నీ వితరుల గుణములను గ్రహింతువు.

వి :- పై శ్లోకములో శ్లేషాలంకారము ప్రధానము. "నీచః" తగ్గుకొనున్నది; నీచుడు-అని రెండర్థములు: "సరస హృదయః" రసమనగా జలము. రసమనగా ఆర్ద్రత. ఆర్ద్రమైన మనస్సుగల వాఁడని యొక అర్థము. జలముచేతఁ గూడినదని వేరొక యర్థము. "గుణ" త్రాడు; మంచి గుణములు. కూపము త్రాడును గ్రహించును; అనఁగా బిందెలతో నీటిని జేదికొందుము గదా! ఇతరుల మంచి గుణములను గ్రహించునని వేరొక యర్థము.

ర. గం :- అప్రస్తుత ప్రశంసకే యుదాహరణము. శ్లిష్టములైన విశేషణములతోఁ గూడ అప్రస్తుత ప్రశంసను సాధింపవచ్చుననుటకు యీ యుదాహరణ మిచ్చినాఁడు. ఇది సమాసోక్తి యగునని యాక్షేపణము. కాదని సమాధానము.

*కమలిని! మలినీకరోషి చేతః*
*కిమితి బకై రవహేలితాఽనభిజ్ఞైః.*
*పరిణతమకరన్దమార్మికాస్తే*
*జగతి జయంతి చిరాయుషో మిలిన్దాః.* 9

తా :- ఓ, కమలినీ! అనభిజ్ఞులైన బకములు పరిహసించిన వని యేల దుఃఖింతువు? నీ యొక్క పరిణత మకరంద మార్మికులైన మిళిందములు చిరాయుస్సుతో వెలుగుచున్నవి గదా !

వి :- "పరిణత మకరంద మార్మికాః" = మంచి సమాసము.
"మలినీకరోషి" = వైయాకరణుడు చేయు ప్రయోగమ్ము.

*యేనాఽమన్దమరన్దే*
*దలదరవిన్దే దినాన్యనాయిషత.*
*కుటజే ఖలు తేనే హా!*
*తేనేహా మధుకరేణ కథమ్!.* 10

తా :- అమంద మకరందముగల్గి వికసించిన పద్మమందు దినములు గడచి పోయినవి. ఆహా! అట్టి మధుకరము నేడు కుటజము నెట్లు మెచ్చును ?

వి :- "ఆనాయిషత" గడుపఁబడినవి. ఆంగ్ల సంస్కృతములలో కర్మణి ప్రయోగము సొంపు. ద్రావిడభాషలలో కర్తరి ప్రయోగ మందము.

*అయి మలయజ! మహిమాఽయం*
*కస్య గిరామస్తు విషయస్తే.*
*ఉద్గిరతో యద్గరలం*
*ఫణినః పుష్ణాసి పరిమలోద్గారైః.* 11

తా :- మలయ పర్వతమందు బుట్టిన యో చందనమా ! నీ మహిమ నెవ్వరు పూర్తిగా భాషతోఁ జెప్పఁగలరు? విషము గ్రక్కునట్టి పాములను గూడ పరిమళోద్గారములతోఁ బోషించుచున్నావు గదా !

వి :- చందనపు చెట్లనుఁ బాములు చుట్టుకొని యుండును. చందన వృక్షముల యొక్క సువాసనలు వాని నాకర్షించును; అప్రస్తుత ప్రశంస.

*పాటీర! తవ పటీయాన్*
*కః పరిపాటీమిమామురీకర్తుమ్.*
*యత్పిషతామపి నృణాం*
*పిష్టోఽపి తనోషి పరిమలైః పుష్టిమ్.* 12

తా :- పాటీరమా ! నీ పద్ధతి ననుకరింప నెవరికి సాధ్యము ? నిన్ను అరుగ దీచు జనులకును పరిమళములతోఁ బుష్టిని గలిగించుచున్నావు గదా !

వి :- "ఉరీకర్తుం" - అంగీకరించుటకు. మంచి పదము. సాధువులు తమ్ము బాధించువారికిని సంతోషమును గలిగింతురు. వారి మార్గము ననుసరించుట కష్టమని ధ్వన్యర్థము.

*నీరక్షీరవివేకే*
*హంసాలస్యం త్వమేవ తనుషే చేత్.*
*విశ్వస్మిన్నధునాన్యః*
*కులవ్రతం పాలయిష్యతి కః.*

తా :- హంసమా ! నీరక్షీర వివేకమందు నీవే యాలసించిన నింక నెవ్వారు కుల వ్రతమును పాలింతురు ?

వి :- పెద్దవారే న్యాయమును దప్పినపుడు దాని నింకెవ్వ రనుసరింతురని ధ్వన్యర్థము.

*ఉపరి కరవాలధారా*
*కారాః క్రూరా భుజఙ్గమపుఙ్గవాత్.*
*అన్తః సాక్షాద్ద్రాక్షా*
*దీక్షాగురవో జయన్తి కేఽపి జనాః.* 14)

తా :- బాహ్యమునకుఁ గరవాల ధారలవలెఁ దీక్ష్ణముగాఁ గనుపింతురు. పాములకంటె క్రూరులుగాఁ దోతురు. కాని వారి మనస్సులు ద్రాక్షకన్నను మృదుమధురములుగా నుండును. ఇట్టి వారెక్కడో కొందరుందురు.

వి :- పైకి వారి మాటలు దురుసుగా నున్నను, కోపగాండ్రుగఁ గన్పించినను, కొందరి మనస్సులు చాల మృదువులుగ నుండును. వారి బాహ్య వర్తనమును బట్టి వారి మనస్సుల నూహించుట సాధ్యము గాదని యర్థము.

"సాక్షాత్ ద్రాక్షా గురవః" = కేవల శాబ్దిక తాండవము.

ర.గం :- ఉల్లేఖాలంకారమున కుదాహరణము. ఒకటే వస్తువు నిమిత్త భేదముతో, అనేకులచే ననేక విధముల గ్రహింపఁబడినచో యుల్లేఖనము.

అనేకులు లేకున్నను ఒకడే విషయభేదముతో ననేకవిధులుగా వర్ణించినను, ఉల్లేఖమే యగును. ఇది రెండు రీతులు. శుద్ధము, అలంకారాంతర సంకీర్ణము. పై శ్లోకములో ఉపమావ్యతిరేకముతోను, ఉత్ప్రేక్షలతోను, ఉల్లేఖాలంకారము సంకీర్ణమైనది.

స్వాచ్ఛన్ద్యం దళదరవిన్ద తే మరన్దం
విన్దన్తో విదధతు గుఞ్జితం మిలిన్దాః.
ఆమోదానథ హరిదంతరాణి నేతుం
నైవాన్యో జగతి సమీరణాత్ప్రవీణః. 15

తా :- ఓ! దళదరవిందమా! నీ తేనెను కావలసినట్లుఁ ద్రావుచుఁ దుమ్మెదలు ధ్వనించుగాక; నీ వాసనలను హరిదంతములకుఁ గొనిపోవుటలో సమీరణుని కన్నను ప్రవీణుడు లేడు. అప్రస్తుత ప్రశంస.

యాతే మయ్యచిరాన్నిదాఘమిహిరజ్వాలాశతైః శుష్కతాం
గన్తా కం ప్రతి పాన్థసన్తతిరసౌ సన్తాపమాలాకులా.
ఏవం యస్య నిరన్తరాధిపటలైర్నిత్యం వపుః క్షీయతే
ధన్యం జీవనమస్య మార్గసరసో ధిగ్వారిధీనాం జనుః. 16

తా :- "ఎండకాలము నందలి సూర్యుని జ్వాలాశతములచే నేను శుష్కించి పోవుచున్నాను. పాపము-ఈ దారిలో నడచు బాటసారుల గుంపు దప్పి దీర్చుకొనుటకిక నెవ్వరిఁ జేరును"- అని నిరంతరము మానసిక చింతతో మార్గ సరోవరము కృశించుచున్నది. దాని జీవితమే ధన్యము. సముద్రముయొక్క జన్మమునకు తిరస్కారము.

వి :- ఎండకాలములో సరస్సులలోని నీరింకి పోవుట సహజము. దానిని దుఃఖముచేత శరీరము శుష్కించుటగా కవి యుత్ప్రేక్షించుచున్నాడు. "జీవన" శబ్ద మిక్కడ శ్లిష్టము; "జీవన" మని - "జల" మని రెండర్థములు. "పాంథ సంతతిః" - శబ్దము స్త్రీ లింగము అగుటచే బాటసారుల దైన్యమున కింకను శోభ గూర్చుచున్నది. "వారిధి" - దండిగా నీరున్నది; ఏమి ప్రయోజనము?

ఒక సామాన్య సంసారి తన యౌదార్యముతో ననేకమంది యతిథులనుఁ బోషించుచున్నాఁడు. కాలము కలిసిరాక వాని సంపదలు తగ్గినవి. ''అయ్యో ! ముందటివలె నతిథులను బోషింప నైతినే'' యను బాధతో శుష్కించుచున్నాడు. ఇంకొకడు మహా సంపన్నుఁడు. వాని ధనము లెవ్వనికిని బనికి వచ్చుట లేదు.

*ఆపేదిరేఽమ్బరపథం పరితః పతఙ్గా*
*భృఙ్గా రసాలముకులాని సమాశ్రయన్తి.*
*సఙ్కోచమఞ్చతి సరస్త్వయి దీనదీనో*
*మీనో ను హన్త ! కతమాం గతిమభ్యుపైతు.* **17**

తా :- ఓ సరోవరమా! నీవేమో తిన్న తిన్నగా శుష్కించి పోవుచున్నావు. జల పక్షులన్నియు - మింటికెగిరిపోవుచున్నవి. (అవి వేరొక సరస్సు నాశ్రయించును.) (ఇంతవరకును నీ పద్మములతో తృప్తి నందుచున్న) తుమ్మెదలు రసాల ముకుళముల నాశ్రయించుచున్నవి. పాపము! నిన్నే నమ్మిన దీన దీనమైన యీ చేప యేగతి బడవలెను ?

వి :- ఒక దాత ధనము క్షీణించి శుష్కించి పోవుచున్నాడు. వాని కాశ్రితులు నానా శీలములవారు. కొందరు దేశాంతరముల నాశ్రయింతురు; కొందరితర దాతలను వెదకికొనుచుఁ బోదురు. మరి కొందరెక్కడికిని బోఁక వానినే యంటిపెట్టికొని యుందురు. ''పతఙ్గాః'' సార్థకమైన శబ్దము. ''దీనదీనః''- యీ యామ్రేడనము రసపోషకమైనది.

ర. గం :- ఇక్కడ సరోవృత్తాంత మొక్కటి, క్షీణుఁడైన రాజు నాశ్రయించిన వారి వృత్తాంత మొక్కటి యున్నది. ఇదికూడ నప్రస్తుత ప్రశంసయే !

*మధుప ఇవ మారుతేఽస్మి*
*న్మా సౌరభలోభమమ్బుజిని మంస్థాః.*

*లోకానామేవ ముదే*
*మహితోఽప్యాత్మా మునార్థితా ...ల* (18)

తా:- ఓ! పద్మలతా! తుమ్మెదనువలె మారుతుని గూడ నీ వాసనలతో ప్రలోభింపజేయకుము. * వాఁడు మహితాత్ముడు. లోకానందము కొఱకేయాచనకుఁ బూనుకొన్నాఁడు.

వి :- మహితుఁడైన మారుతుఁడు నిన్ను యాచించుచున్నాఁడు. ఎందుకు? లోకానందము కొఱకు. (వామనుడు బలి నడిగినట్లు). గొప్పవారొక్కొక్కసారి తమ యోగ్యతకుఁ దగని పనులనైనను లోక క్షేమమునకై జేయుదురని తాత్పర్యము.

*గుఞ్జతి మఞ్జు మిలిందే*
*మాలతి మా మౌనముపయాసీః.*
*శిరసా వదాన్యగురవః*
*సాదరమేనం వహ న్తి సురతరవః.* 19

తా :- మాలతీ ! తుమ్మెద మనోహరముగ ఝుంకరించుచు నీ చుట్టుఁ దిరుగుచున్నది. దాని నుపేక్షించి మౌనము వహింపకుము. వదాన్యగురువులైన సురతరువులే దానిని సాదరముగ శిరములయందు వహించుచుందురు.

వి :- "మిళిందః"- ఇది పుల్లింగము. ఈ స్వారస్యముతో నొకానొక పురుషుఁడు ధ్వనించుచున్నాఁడు. "మాలతీ" స్త్రీలింగము. అనగా నొక నాయిక. ఉత్తముఁడైన పురుషుఁడు నిన్నాశ్రయించి మధురముగ బల్కుచు నీ చుట్టు దిరుగుచున్నాఁడు. ఓసీ! వానిని సామాన్యునిగాఁ జూడకుము. ఆభిజాత్యము గల మహాదాతలుగూడ వానిని దలపైఁ బెట్టుకొని కోర్కెలు తీర్చుచున్నారని యర్థాంతరము.

"వదాన్యగురవః" — "సురతరవః" = మంచి శాబ్దికమైన అందుబాటు. "వదాన్యగురవః" చక్కని ప్రౌఢోక్తి.

---

* తుమ్మెదకు వలె మారుతునికి కూడ నీ సౌరభముపై లోభమున్నదని అనుకొనకుము.

యైస్త్వం గుణగణవానపి
సతాం ద్విజిహ్వైరసేవ్యతాం నీతః.
తానపి వహసి పటీరజ!
కిం కథయామ స్త్వదీయమౌన్నత్యమ్. 20

తా:- ఓ! చందనవృక్షమా! నిన్ను ద్విజిహ్వులాశ్రయించికొని యుండుటచే సత్పురుషులు నీ దరి చేర జంకుచున్నారు. ఇట్లు నీ యపకీర్తికి కారణములైనవారినిగూడ నీవు భరించుచునే యున్నావు. నీ యౌన్నత్యమేమి చెప్పవలెను ?

వి:- "ద్విజిహ్వులు" = పాములు, రెండు నాల్కలు గలవారు. అనగా నాల్కలతో మాట్లాడు దుష్టులని యర్థము.
"ఔన్నత్యమ్" = గొప్పతనము, పొడవు.

ఒక మహామహుని చెంత రెండు నాల్కలుగల దుర్మార్గులాశ్రయించికొని యుందురు. వారికి భయపడి సత్పురుషు లాతని నాశ్రయింప వెఱతురు. తనచుట్టునున్నవారు దుష్టులని యా దాత యెఱుఁగును. వారిచేఁ దనకుఁ గళంకమనియు నెఱుఁగును. కాని-తనది యుత్తమ శీలము. అందుచే వారిని వదలడు. సత్పురుషులను సేవించుటయు మానడు.

అపనీత పరిమలాంతర-
కథే పదం న్యస్య దేవతరుకుసుమే.
పుష్పాంతరేఽపి గంతుం
వాఞ్ఛసి చేత్ మధుప! ధన్యోఽసి. 21

తా:- ఓ! మధుపమా! సర్వోత్తమ పరిమళము గల దేవకుసుమముపై పదముంచితివి. అట్లయ్యు నితర పుష్పమును చేరుటకును నీవు వాంఛించినచో-నీవే ధన్యుడవు.

వి:- "అపనీత పరిమళాంతరకథే" = * ఎప్పుడెప్పు డేయే పరిమళము గావలెనో అప్పుడప్పుడవన్నియు సాక్షాత్కరించునని భావము. నీవే వాసనల

* దీని పరిమళము వాసన చూచినవారు ఇతరపరిమళములను గూర్చి ముచ్చటింపరు అని అర్థము.

దలచిన నావాసనలా కల్పవృక్ష కుసుమ మిచ్చును. ఇట్లుండియు నీ వితర పుష్పమును వాంఛించుచున్నావు. ''ధన్యోసి!'' = చాలగొప్పవాఁడవు. ఇది పరిహాసము. నీ తెలివి యేడ్చినట్లే యున్నదని తాత్పర్యము.

'కుసుమ' శబ్దము నపుంసకలింగము. స్త్రీలింగమైనచో నింకను బాగుండెడిది.

*తటిని! చిరాయ విచారయ*
*వింధ్యభువ స్తవ పవిత్రాయాః.*
*శుష్యన్త్యా అపి యుక్తం*
*కిం ఖలు రథ్యోదకాదానమ్.* 22

తా :- ఓ! నదీ! నీవు వింధ్య భూములలోఁ బుట్టితివి. నీ పవిత్రత నైనను యోచించుము. నీవు శుష్కించి పోవుచున్నావు. అయినను రథ్యోదకముల గ్రహించు టొప్పునా?

వి :- మహోన్నతవంశజాతులు కష్టములలో నున్నను నీచములైన పనులకుఁ బూనుకొనరాదని ధ్వని.

*ఏక స్త్వం గహనేఽస్మిన్*
*కోకిల! న కలం కదాచిదపి కుర్యాః.*
*సాజాత్యశంకయామీ*
*న త్వాం నిఘ్నన్తు నిర్దయాః కాకాః.* 23

తా :- కోకిలా! నీ వీ యడవిలో నొంటిగా నున్నావు. ఎప్పుడుగాని కల మధురముగా శబ్దింపకుము. నీ చుట్టును గాకులున్నవి. అవి నిన్ను గుర్తించి చంపకుండు గాక.

వి :- కోకిలయు, కాకియు నాకారములో నొకటిగా నుండును. కంఠ ధ్వనియే వాని విభేదకధర్మము. కోకిల యని గుర్తించిన వెంటనే కాకులు దానిని చంపివేయును.

ఒకానొక పండితుడు తన పాండిత్యమును వెల్వరింప నారంభించినచో చుట్టునున్నవారసూయతో వానిని జంపివేయుదురు. వాఁడు దన కనుపగుచోటు దొరకువఱకును ఇతరులు దన్ను గుర్తింపకుండునట్లు మసవలెను.

పత్రఫలపుష్ప లక్ష్మ్యా
కదాప్యదృష్టం వృతం చ ఖలు శూకైః.
ఉపసర్పేమ భవన్తం
బర్బుర ! వద కస్య లోభేన ?. 24

తా :- ఓ బర్బుర వృక్షమా ! నీయం దే శోభ యున్నది ? పత్రములు లేవు. ఫలములు లేవు. పూలు లేవు. పైగా ముండ్లున్నవి. మే మే యాశతో నిన్ను సమీపింపవలెను ?

వి :- "లక్ష్మ్యా" = ఈ స్త్రీ లింగపద మమితస్వారస్యమును గూర్చుచున్నది. ఓయీ ! నీలో నే గుణమును లేదు; ఇక మేము నిన్నెట్లాశ్రయింపవలె నని భావము.

తరుకులసుషమాఽపహరాం
జనయన్తీం జగతి జీవజాతార్తిమ్.
కేన గుణేన భవానీ-
తాత ! హిమానీమిమాం వహసి. 25

తా :- ఓ హిమవత్పర్వతమా ! ఈ మంచు నీ వృక్షములయొక్క కాంతిని పోగొట్టుచున్నది; నీ యందలి జీవులకు ఆర్తిని గలిగించుచున్నది. మరి దేనిని జూచి నీవీ మంచును ధరించుచున్నావు?

వి :- "భవానీ తాత !" = పార్వతికి తండ్రియైన వాఁడా ! నీ బిడ్డ జగజ్జనని ; భవునంతటి వానిని బెండ్లి యాడినది. అట్టి బిడ్డను గన్న నీవు చాల గొప్పవాఁడవని భావము. "హిమానీ" = స్త్రీ లింగము. ఈ పేరిటి నాయిక. ఈమెతో నీకేమి సుఖమున్నదో కాని, నిన్నాశ్రయించిన వారి కందరికి కష్టమే యున్నదని ధ్వని.

*అమరతరుకుసుమసౌరభ*
*సేవనసంపూర్ణసకలకామస్య.*
*పుష్పాన్తరసేవేయం*
*భ్రమరస్య విడమ్బనా మహతీ.* 26

తా :- ఆ భ్రమరము కల్పవృక్షకుసుమ సౌరభ సేవనములు గలది. దాని సకలవాంఛలును దానితోఁ దీరినవి. ఈ పుష్పాంతరసేవ, కేవలము విడంబనమే.

వి :- ఒకడు మహా వైభవము లనుభవించినాఁడు. వానితో నిత్యతృప్తుడైనాఁడు. వాఁడప్పు డప్పుడు చిన చిన్న సుఖములు వాంఛించుట కేవలమేదో యుబుసుపోకకు మాత్రమే.

*కలభ ! తవాన్తికమాగత-*
*మలిమేనం మా కదాప్యవజ్ఞాసీః.*
*అపి దానసుందరాణాం*
*ద్విపధుర్యాణామయం శిరోధార్యః.* 27

తా :- ఓ కలభమా! నీకడకు వచ్చిన యీ తుమ్మెదను - ఎప్పుడు నవమానింపకుము. దాన సుందరులైన ద్విపధుర్యులకది శిరోధార్యము.

వి :- "దానము" = వదాన్యత; మదజలము;

"దాన సుందరాణామ్" = ఇక్కడ సుందర శబ్దమెంతయో రమ్యముగా నున్నది. దానమే నిజమైన సౌందర్యమనుట. "శిరోధార్యః" ఒక అర్థము నందు జాతీయము; గౌరవింపదగిన వాఁడని పిండితార్థము; రెండవ యర్థమందు తలపై నుంచి కొనుట. ఏనుగుల గండస్థలములపైననే గదా తుమ్మెదలు వ్రాలుట. "కలభ!" = ఏనుగు పిల్ల; నీ వయసు చిన్నది. జీవితానుభవము లేదు. నీకు యుక్తాయుక్తము లింకను సరిగఁ దెలియవని పిండితార్థము.

*పుష్టాః ఖలు పరపుష్టాః*
*పరితో దృష్టాశ్చ విటపినః సర్వే.*

మాకన్ద ! న ప్రపేదే
మధుపేన తవోపమా జగతి. 28

తా :- ఎన్నో చెట్లున్నవి. వానితోఁ గోకిలలు గూడ తృప్తము లై బలసినవి. కాని మాకందమా? మధుపమునకు నీతో సమానమైన చెట్టొకటియుఁ గన్పడలేదు.*

వి :- ''పరపుష్టాః'' = ఇతరులచేత పెంచఁబడినవి. కోకిలలు చిన్నతనమందు కాకులచేతనే బెంచఁబడుచున్నవి; పరుల జీవితముపైననే యవి జీవించు నని రెండవ యర్థము.

తోయైరల్పైరపి కరుణయా భీమభానౌ నిదాఘే
మాలాకార ! వ్యరచి భవతా యా తరోరస్య పుష్టిః.
సా కిం శక్యా జనయితుమిహ ప్రావృషేణ్యేన వారాం
ధారాసారానపి వికిరతా విశ్వతో వారిదేన. 29

తా :- ఓయి ! మాలాకారుడా ! నిదాఘము వచ్చినది; సూర్యుడు ప్రచండముగ వెల్గుచున్నాఁడు. నీరు దొరుకుటయే కష్టము. అట్టి సమయములో నీవు అతి కరుణతో నీరుబోసి యీ వృక్షమునకు బుష్టి నిచ్చితివి. నీవు వోసిన నీరు కొంచెమేయైనను అది యా చెట్టున కెంతయో బలము నిచ్చినది. వర్షాకాలమున మేఘము బ్రహ్మాండముగ ముసలధారలు వర్షించు నను కొనుము. ఆ వృక్షమునకు నీ జలముతో నేర్పడిన పుష్టి వారిదనీరధారలచే గలుగదు గదా !

వి :- "అతి కరుణయా" = అయ్యో ! చెట్టెండి పోవుచున్నదే పాపము ! - అను నెక్కువ యనుకంపతో ననుట. ఒకానొకఁ డాపదలో నుండును. వానికప్పుడు సహాయ మవసరము. అప్పు డొనర్చిన యే చిన్న తోడ్పాటైనను వానికి గొప్ప సంతోషము నిచ్చును; వాని కవసరము లేనప్పు డెంత పెద్ద సాయమొనర్చినను వానికిఁ దృప్తి గలుగదు.

''ప్రావృషేణ్యా'' = చక్కని వ్యాకరణ నిష్పన్నమైన శబ్దము.

---

* 'పృష్టాః' అనుపాఠమున-''మాకందముతో సమానమైన వృక్షములేవైన ఉన్నవా'' అని కోకిలలు ప్రశ్నింపబడినవి; చుట్టుప్రక్కల నున్న వృక్షములన్నియు పరిశీలింపిబడినవి; అని అర్థము.

ఆరామాధిపతిర్వివేకవికలో నూనం రసా నీరసా
వాత్యాభిః పరుషీకృతా దశదిశశ్చండాతపో దుస్సహః.
ఏవం ధన్వని* చంపకస్య సకలే సంహారహేతావపి
త్వం సిఞ్చన్నమృతేన తోయద కుతోప్యావిష్కృతో వేధసా

తా :- వనపాలకుడు అవివేకి. భూమిపై నొక నీటిబొట్టులేదు. దశదిక్కులు గాలులచేఁ గఱుకువాఱినవి. సూర్యుని వేడిమి భరింప సాధ్యముగాదు: ఈ చంపకము సర్వరీతుల నిస్సహాయమైనది. కావునకుఁ దయార్హైనది. ఓ నీరదమా! ఈ సమయములో నీ వమృతమును వర్షించితివి. బ్రహ్మదేవుఁడు యెక్కడి నుండియో నిన్ను బంపినాఁడు.

వి :- ''వివేక వికలః'' = అవివేకి యనుటకుఁ బొడిగింపు.

''రసా నీరసా'' = రసము నీరసమైనదని శాబ్దిక చమత్కారము. నిర్గత మైన రసముగలది నీరసము. ని + రస = అని యుండగా వ్యాకరణ శాస్త్రము ప్రకారము ''ని'' ప్రత్యయమున దీర్ఘమువచ్చి నీరసమైనది : ''అమృత'' = జలము, అమృతము అని రెండర్థములు. ''తోయద'' = జలమిచ్చుటయే స్వభావముగా గలది.

ఒక సంసారి అన్నివైపులనుండి కష్టములతో బాధపడుచుండును. ఎక్కడనుండియో హఠాత్తుగ వానికి సాయము లభించును. అది ఈశ్వరేచ్ఛ.

న యత్ర స్థేమానం దధురతిభయభ్రాన్తహృదయా
గలద్దానోద్రేకభ్రమదలికదమ్బాః కరటినః.
స్థలన్మృగ్రాఖారే భవతి పరలోకం గతవతో
హరేరద్య ద్వారే శివశివః శివానాం కలకలః. 31

తా :- ఒక సింహము బ్రతికి యుండెను. అది బ్రతికి యున్నపుడు, మద జలముచే మొరయుచున్న తుమ్మెదలు గల గొప్ప యేనుఁగులు గూడ

* ధన్వని = మరుభూమియందు

భయభ్రాంతములై యా సమీపముల నట్టాడుట లేదు. ఇంతలో నా సింహము గతించినది. ఓహో! దాని గుహయందు నేడు గుంటనక్కలు విశృంఖలముగాఁ గూయు చున్నవి.

వి :- "స్థలన్ముక్తాభారే" = ఆ సింహము బ్రతికినప్పుడెన్ని యేనుఁగులనో జంపినది; ఏన్గుల కుంభస్థలములలో ముత్యము లుండును. సింహము యేన్గుల కుంభములను జీల్చినప్పుడు ముత్యములు చిట్లిపడి యాగుహా ప్రాంతమంతటను వ్యాపించినవి. కాళిదాసు కుమార సంభవములో నీ శ్లోక మున్నది:-

"పదం తుషారస్రుతిధౌతరక్తం
యస్మిన్నదృష్ట్వాఽపి హతద్విపానామ్.
విదంతి మార్గం నఖరంధ్రముక్తై
ర్ముక్తాఫలైః కేసరిణాం కిరాతాః"—ఈ శ్లోకమును వ్యాఖ్యానించుచూ మల్లినాథులిట్లన్నారు: "కరీంద్ర జీమూత వరాహశంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని. ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాం హి శుక్త్యుద్భవమేవ భూరి." కనుక కరుల కుంభ స్థలము లందు ముక్తా ఫలములుండుట ప్రసిద్ధములు.

"గలద్దానోద్రేకభ్రమదలికదమ్బాః" = ఈ సమాసము గంభీరము. ఏన్గుల ఔన్నత్య స్థౌల్యములను శబ్ద శ్రవణ మాత్రముననే దెల్పుచున్నది. "భయభ్రాంత హృదయాః" = అను సమాసముగూడ నిట్టి చమత్కారము గలదే. "భ్రాంత" శబ్దము భయముతో, వాని గుండెలదరుటను సూచించుచున్నది.

*దధానః ప్రేమాణం తరుషు సమభావేన విపులం*
*న మాలాకారోఽసావకృత కరుణాం బాలవకులే.*
*అయం తు ద్రాగుద్యత్కుసుమనికరాణాం పరిమలై*
*ర్దిగంతానాతేనే మధుపకలఝంకారభరితాన్.* 32

తా :- తోట మాలి కన్ని వృక్షములు నొక్కటే. ఒకదానిపై నెక్కువ దృష్టి లేదు. మరి యొకదానిపై తక్కువ లేదు. వాఁడు యీ బాల వకుళముపై

నెక్కువ బలము నుంచలేదు. అది పడి పడిగా నిగిర్చినది. పూలు పూచినవి. వాని వాసనలతో దిగంతములను మధుపకులఝంకార భరితము లొనర్చినవి.

వి :- "ద్రాగుద్యత్" హఠాత్తుగాఁ బుట్టుకొని వచ్చినవన్నమాట; "కుసుమ నికరాణామ్" = ఒకటి రెండుగాదు; గుంపులు గుంపులు; ఒకనికి చిన్న తనములో సరియైన పోషణ లేదు. వాఁడు గొప్పవాఁడగుట కనుకూలములు లేవు. కాని వానికి శక్తి దైవదత్తమై వచ్చును; వాని కీర్తి దిగంతములకు వ్యాపించి పొగడ్త లందికొనును.

> మూలం స్థూలమతీవ బన్ధనవిధౌ శాఖాః శతం మాంసలా
> వాసో దుర్గమహీధరే, తరుపతే! కుత్రాస్తి భీతిస్తవ.
> ఏకః కింతు మనాగయం జనయతి స్వాన్తే మమాధిజ్వరం
> జ్వాలాలీవలయీభవన్నకరుణో దావానలో ఘస్మరః. ౫౮

తా :- ఓ వృక్ష రాజమా ! నీ కన్ని సౌకర్యములు బాగుగనే యున్నవి. నీ మూలము దృఢమైనది. నీ మొదలు ముదులు పెట్టి యెదిగి యున్నది. శాఖా శతములు పుష్టితో నున్నవి. ఇక వాసమందమా కొండకొమ్ముపై; నీకేమి భయమున్నది ? నిన్ను జూచినపు డొకటే యొక సందేహము - తాపము - నా మనస్సు నల్పముగ నాక్రమించుచున్నది. ఎప్పుడో యొకసారి తిండి పోతైన దావానలము నిన్ను జుట్టుముట్టి నిష్కారుణముగఁ గాల్చివేయవచ్చును గదా !

వి :- "తరుపతే!" –నీవేమో చాల గొప్పవాఁడవు. నీకన్ని సౌకర్యము లున్నవి. "మాంసల" = లాక్షణిక ప్రయోగము. దండిగా మాంసము గలదని వాచ్యార్థము. ఇక్కడ పుష్టి గలిగినవనుటలో పర్యవసానము. "మనాక్" = రేఖామాత్రముగానని భావము. 'జ్వాలాలీ వలయీభవన్'-జ్వాలాసమూహము చేత గుండుగా నిన్ను అన్నివైపుల నుండి చుట్టుకొన్నదై; "అకరుణః" = దయలేనివాఁడు. "ఘస్మరః" = తిండిపోతు.

ఒకానొకడు పెద్ద మహారాజు. వాని యంతఃపురములు గొప్పవి. చుట్టు మున్న పరివారమా ! బలపుష్టమైనది. వాఁడు నివసించు పట్టణపు కోటలా !

కొండల వంటివి. ఇఁక వానికేమి భయమున్నది ? నిజమే. వేరొక రాజు. వానికెన్ని రాజ్యము లాక్రమించినను తృప్తిలేదు. వాఁడెప్పుడు పైనవచ్చి పడునో ? సృష్టిలో నాపద కెవ్వఁడును దప్పించుకొన్నవాఁడు లేఁడని భావము.

*గ్రీష్మే గ్రీష్మకరైః కరైర్దినకృతా దగ్ధోఽపి యశ్చాతక*
*స్త్వాం ధ్యాయన్ ఘన వాసరాన్ కథమపి ద్రాఘీయసో నీతవాన్,*
*దైవాల్లోచనగోచరేణ భవతా తస్మిన్నిదానీం యది*
*స్వీ చక్రే కరకానిపాతనకృపా తత్కిం ప్రతిబ్రూమహే.* 34

తా :- ఓయీ ! ఘనుడా ! ఆ చాతకము జూడుము. నీ కొఱకెన్ని దినముల నుండియో గాచికొన్నది. నీపై నాశ పెట్టుకొని యెండకాలములను సైరించినది. సూర్యుఁడు కిరణములతో దాని శరీరమును మాడ్చివేసినాఁడు. అయిన నది నీపై యాశతో సహించినది. అదృష్టవశాత్తు నీవు గన్పించితివి. నీవేమి చేయుచున్నావు ? వడగండ్లతోఁ దాడించుచున్నావు. అది నీ దయ. ఇక నీకేమి బదులు చెప్పవలెను ?

వి :- "ఘనః" = మేఘము, గొప్పవాడు.

నీవేమో చాల గొప్ప వాఁడవు. నీకరుణ యిట్లేడ్చిన దని ధ్వని. "కథమపి" = ఎన్నికష్టములనో యా చాతకము సహించినది. "ద్రాఘీయసః" = దుఃఖమునందు దినములు దీర్ఘములుగా నున్నట్లు తోచును. "దైవాత్" = అదృష్టముతో గన్పించును. "లోచనగోచరేణ" = నీవు కంటబడుటయే గొప్ప యదృష్టము; తన కష్టములన్నియు తీరునని గంపెడాశలు నీపైన బెట్టికొన్నది. "భవతా" = ఇది పరిహాసము; 'తమరిచేత' యని యర్థము.

"కరకానిపాతనకృపా" = కరకాని పాతన మనెడు దయ; ఇచట 'కృపా' శబ్దము సమాసగతమై మరింత వెక్కిరింతను దోపించును.

''ఇదానీం'' = ఇంతమైన కరువుకాలగోచరమని శ్రుతి. ''గ్రైష్మికాన్ వాసరాన్'' గ్రీష్మమునందు పగళ్లెక్కువ.

దవదహనజటాలజ్వాలజాలాహతానాం
పరిగలితలతానాం మ్లాయతాం భూరుహాణామ్.
అయి జలధర ! శైలశ్రేణిశృఙ్గేషు తోయం
వితరసి బహు కోయం శ్రీమదస్తావకీనః. 35

తా :– ఓయి జలధరమా ! చెట్లకంటికొన్న తీగలన్నియు మాడిపోయినవి. వృక్షములు దవదహన జటాలజ్వాలజాలా హతములైనవి. నీవేమో కొండకొమ్ములందు వానలు విరివిగా వర్షించుచున్నావు. నీ లక్ష్మీ మద మేమన వలెను?

వి :– ''జటా'' = జడలవంటి.

''తోయం బహువితరసి'' = అక్కరలేనివారికి విరివిగా నిచ్చుచున్నావని భావము.

''తావకీనః'' = ప్రౌఢమైన శబ్దము. నీ శ్రీమదమునకు కండ్లు గన్పించుట లేదని భావము. ఒకానొక సంపన్నుడుండును. అవసరముగలవారికి వాఁడివ్వఁడు; అక్కరలేనివారికి విరివిగా నొసగును. అది వాని శ్రీమదస్వభావము..

శృణ్వన్ పురః పరుషగర్జితమస్య హన్త
రే ! పాన్థ ! విహ్వలమనా న మనాగపి స్యాః.
విశ్వార్తినివారణసమర్పితజీవనోఽయం
నాకర్ణితః కిము సఖే ! భవతామ్బువాహః. 36

తా :– ఓయీ ! పాంథుడా ! ఆ మేఘము యొక్క పరుషగర్జితము విని విహ్వలతనందకుము. వాఁడు విశ్వార్తివారణసమర్పిత జీవనుఁడు. ఆ అంబువాహుని పేరు నీవు వినలేదా ?

వి:– ''పురః'' = ముందు. మేఘ గర్జితమును విని యేదో దుష్ట మృగగర్జితమని వాని భ్రాంతి. ''పరుష గర్జితమ్'' = ఆ శబ్దము పరుషమై గుండెలదరించునదిగా నున్నది.

“జీవన” = ఈ పదమిక్కడ శ్లిష్టము. నీరనియు, బ్రదుకనియు రెండర్థములు. వాఁడంబువాహుఁడైన మేఘుఁడని అనుట కంటెను- “వాఁడంబువాహుఁడు. వాని పేరు నీవు వినలేదా ?” అని చెప్పుటలో నెంతయో కవిత్వమున్నది.

*సౌరభ్యం భువనత్రయేఽపి విదితం శైత్యం ను లోకోత్తరం*
*కీర్తిః కించ దిగఙ్గనాఙ్గణగతా కింత్వేతదేకం శృణు.*
*సర్వానేవ గుణానియం నిగిరతి శ్రీఖండ తే సున్దరాన్*
*ఉజ్ఝన్తీ ఖలు కోటరేషు గరలజ్వాలాం ద్విజిహ్వావలీ.* 37

తా :- ఓ ! చందనమా నీ సువాసన మూడు లోకములకు విదితము. నీ శైత్యము లోకోత్తరము. నీ కీర్తి దిగంగనాంగణ గతము. కాని వీనితో నేమైనది. ఒకమాట వినుము. సుందరములైన నీగుణముల నన్నిటి నొక దోషము నాశ మొనర్చుచున్నది. నీ కోటరములలోఁజేరి గరళములు వెలార్చు పాముల గుంపు.

వి :- “దిగంగనా” = రూపకాలంకారము. దిక్కులను స్త్రీలతో బోల్చినాఁడు. “అంగణగతా” = వారియిండ్లవరకును వ్యాపించినదని భావము. పురుషులకంటెను స్త్రీలను రంజిపజేయుటలో కీర్తికి ప్రత్యేకమైన ఘనత. “సర్వానేవ గుణాన్” = ఆ యున్న నీ యన్ని గుణముల నొక్కడోషము హరించుచున్నదని భావము.

*నాపేక్షా న చ దాక్షిణ్యం*
*న ప్రీతిర్న చ సంగతిః.*
*తథాపి హరతే తాపం*
*లోకానామున్నతో ఘనః.*

తా :- వానికపేక్ష లేదు. దాక్షిణ్యములేదు. ప్రీతి లేదు. సంగతి లేదు. కాని లోకము యొక్క తాపములను హరించుచున్నాఁడు. వాఁడు లోకోన్నతుడైన ఘనుడు.

వి :- “ఘనః” = మేఘము, శ్రేష్ఠుఁడు అని రెండర్థములు.

"లోకానాం ఉన్నతః" = లోకములకంటె వాడున్నతమైన యాకాశ మందే గదా యుండుట. సర్వలోకములకు సమ్మాన్యుడని యర్థాంతరము. గొప్ప వారు నిరపేక్షముగా, నితరుల దుఃఖములను బోకార్తురు.

*సముత్పత్తిః స్వచ్ఛే సరసి హరిహస్తే విలసనం*
*నివాసః పద్మాయాః సురహృదయహారీ పరిమలః.*
*గుణైరేతైరన్యైః రపి చ లలితస్యాంబుజ ! తవ*
*ద్విజోత్తంసే హంసే యది రతిరతీవోన్నతిరియమ్.* 39

తా :- అంబుజమా ! స్వచ్ఛమైన సరస్సునందు బుట్టితివి. హరికర మందు విలాసము. లక్ష్మీదేవికి నీవు నివాసము. నీ పరిమళములు దేవతల హృదయము లాకర్షించినవి; ఇవి కొన్ని గుణములే; ఇక నెన్నో సుగుణము లున్నవి; నీవు ద్విజోత్తంసుడైన హంసయందు రతి నుంచినచో నది నీ తక్కిన సుగుణముల కన్నింటికిని కిరీటము పెట్టినట్లు.

వి :- "ద్విజోత్తంసే" = ద్విజ శ్రేష్ఠుడని యర్థము. 'ద్విజ' శబ్దము శ్లిష్టము. ద్విజోత్తంసుని యందు రతినుంచికొనుటలోనే నీ వివేకమున్నది అది చేసినచోఁ దక్కిన యీ గుణములన్నియు భాసించును: అందు పొరపాటు పడితివా - ఈ సుగుణములన్నియు నుండియు లేనట్లే.

*సాకం గ్రావగణైర్లుఠన్తి మణయో బాలార్కబింబోపమాః*
*తీరే నీరచరైః సమం స భగవాన్నిద్రాతి నారాయణః.*
*ఏవం వీక్ష్య తవావివేకమపి చ ప్రౌఢాం పరామున్నతిం*
*కిం నిన్దామ్యథవా స్తవామి కథయ క్షీరార్ణవ త్వామహమ్.* 40

తా :—ఓ క్షీర సముద్రమా ! నీలో గండశిలలతో పాటు బాలార్క బింబోపమ కాంతిగల రత్నములున్నవి. ⊕ తీరమందు నీరచరములతోఁబాటు భగవంతుఁడైన నారాయణుఁడే నిద్రించుచున్నాఁడు. నీ యదృష్టము చాల గొప్పది. నీ యవివేకము గూడ గొప్పదే. మరి నిన్ను నిందింతునో, స్తుతింతునో, నీవే చెప్పుము.

---

⊕ లేదా రత్నములు ఱాళ్ళతో కలసి తీరముపై దొర్లుచున్నవి అని అర్థము. 'నీరే' అనియు పాఠము. జలముపై నారాయణుడు నిద్రించుచున్నాడు అని అర్థము.

వి :- బాలార్క ద్యుతులైన రత్నములుండుట గొప్ప యదృష్టము; కాని యాయదృష్టమును సముద్రము గమనించుట లేదు; వానిని దనలోని రాళ్ళ తోనే సమానముగ జూచుచున్నది. నారాయణుడు డాశ్రయించినాడు. వానిని దక్కిన జలజంతువులతో సమానముగనే జూచుచున్నది; ఇది దాని గొప్ప యవివేకము; ఈ వస్తువులు ప్రాప్తించుట దాని యదృష్టము. ఒకనికి భగవంతుడు గొప్ప యదృష్టము లిచ్చును; గొప్పవారందరు వాని నాశ్రయింతురు; కాని వాడా యదృష్టములు లెక్కింపడు. ఆ గొప్పవారిని ప్రత్యేక దృష్టితో జూడడు. ఇది వాని యవివేకమో, వివేకమో !

*కిం ఖలు రత్నై రేతైః*
*కిం పునర భ్రాయితేన వపుషా తే.*
*సలిలమపి యన్న తావక-*
*మర్ణవః వదనం ప్రయాతి తృషితానామ్.* **41**

తా :- ఓయీ! సముద్రుడా! నీరత్నములతోనేమి ప్రయోజనము? మేఘము వంటి నీ శరీరముతో నేమి ఫలము ? నీ నీరుగూడ దప్పికొన్న వారి గొంతులోనికి బోదుగదా !

వి :- "అభ్రాయితేన" = అభ్రమువలె నాచరించుచున్న. ప్రౌఢమైన శబ్దము.

*అయత్యాం సమ్ప్రత్యావపి చ సలిలానాం త్వమధునా*
*న తృష్ణామార్తానాం హరసి యది కాసార ! సహసా.*
*నిదాఘే చణ్డాంశౌ కిరతి పరితోఽఙ్గారనికరం*
*కృశీభూతః కేషా మహహ ! పరిహర్తాసి ఖలు తామ్.* **42**

తా :- ఓ ! కాసారమా ! ఇప్పుడు నీ కింత సలిల సంపద యున్నది. ఇప్పుడు గూడ నీవు ఆర్తుల తృష్ణను బోగొట్ట నేరనిచో నేమి ప్రయోజనము ? రేపెండకాలము వచ్చును; ప్రచండుడైన సూర్యుడు కిరణములచే నిప్పులు జెఱగును. అప్పుడు నీవే కృశించి పోయెదవు; ఇతరుల దప్పి నేమి దీర్తువు?

వి :- మనుష్యుఁడు తనకు సంపదలున్నప్పుడే యితరుల కుపకరింపవలెను. ఆ సంపదలు శాశ్వతమని యేమున్నది? రేపు కాని కాలమువచ్చి తానే కృశించి నపుడు మరియొకరి కే యుపకార మొనర్చును ?

"కృశీభూతః" = అంతకుముందు కృశుడుగానివాఁడు కృశుఁడుగా నగుట.

అయి రోషమురీకరోషి నో చే-
త్కిమపి త్వాం ప్రతి వారిధే! వదామః.
జలదేన తవార్థినాపి ముక్తా
న్యపి తోయాని వహన్న హా! జహాసి. 43

తా :- ఓ సముద్రమా ! నీవు కోపింపకుందువేని యొకమాటఁ జెప్పెదను. నీవేమో దొడ్డవాఁడవు. నీకు జలమిచ్చినది మేఘుఁడే. వాఁడే నేడు కొంత జలమిమ్మని వేడినను పలుకకున్నావు.*

వి :- "వారిధే" = నీటిని ధరించునది; అనగా సంపదలను వహించుటయే గాని విడుచుట యెఱుగనిదని తాత్పర్యము.

"జలదేన" = నీటి నిచ్చునది. అనగా త్యాగమే తనకు స్వభావము; ఇట్లు వారిధి, జలదశబ్దములుఇట సాభిప్రాయములుగా ప్రయుక్తములైనవి.

"ఉరీకరోషి" = మధ్యమపురుష క్రియ. పుష్టికలిగిన క్రియ.

న వారయామో భవతీం విశన్తీం
వర్షానదీ! స్రోతసి జహ్నుజాయాః.
న యుక్త మేతత్తు పురో యదస్యా-
స్తరఙ్గభఙ్గాన్ప్రకటీకరోషి. 44

తా :- ఓసీ! వర్షానదీ! నీవేమో జహ్నుసుతా ప్రవాహమున జొచ్చుచున్నావు; మంచిదే. నీకు గొప్ప యదృష్టమే పట్టినది; కాని - దాని యెదుట

* "వహన్"కు బదులు "మహాన్" అని పాఠాంతరము. మేఘుడు నిన్ను యాచించి తీసికొన్న జలములో కొంత మరల నీకు ఇచ్చుచున్నాడు. దానిని కూడ భద్రము చేసికొనుచున్నావే కాని ఇతరులకు ఇవ్వలేకున్నావు అని కూడ భావము.

కూడ నీ తరంగ భంగములను బ్రకటించుచున్నావు. నీకీ జంభము దగదు సుమా !

వి :— "భవతి" = హటాత్తుగా గల్గిన యదృష్టముతో గొప్ప దాని వైనావు; అందుకే "తమరిని" యనుచున్నాఁడు కవి.

తరంగభంగులను సాధారణముగా భ్రూచాలనమునకుఁ బోల్తురు. ఆమె యెదుటఁ గూడ నీవేమో బొమలు గదలించుచు కౌలీనతను ప్రకటించుట దగదని యర్థము.

*పౌలోమీపతికాననే విలసతాం గీర్వాణభూమీరుహాం*
*యేనాఘ్రాతసముజ్ఝితాని కుసుమాన్యాజిఘ్రిరే నిర్జరైః.*
*తస్మిన్నద్య మధువ్రతే విధివశాన్మాధ్వీకమాకాంక్షతి*
*త్వం చేదఞ్చసి లోభమమ్బుజ! తదా కిం త్వాం ప్రతిబ్రూమహే. 45*

తా: - ఓ యంబుజమా! నిన్నొక తుమ్మెద జేరినది. అది యెట్టిదను కొన్నావు ? ఇంద్రుని నందన వనమునఁ దిరుగాడినది. అక్కడి కల్పవృక్షములపైన సంచరించినది. దానిచే వాసనఁ జూడబడిన యెంగిలిపూలనే దేవతలు వాసన జూచిరి. అది యిప్పుడు కాలము చెడి నీ తేనె నాకాంక్షించి నీ కడకుఁ జేరినది; ఇప్పుడు నీవు లోభమును ప్రదర్శించినచో - నిన్నేమని యందుము ?

వి :— "పౌలోమీపతి" = పౌలోమి యనగా శచీదేవి; ఆమె పతి యింద్రుఁడు. "గీర్వాణభూమీరుహాః" = దేవతా వృక్షములు. ప్రాచీనములై యెన్ని వేల యేండ్లనుండి యో నున్న చెట్లని భావము.

"ఆఘ్రాత సముజ్ఝితాని" = రెండు విశేషణములకు సమాసము కర్మధారయము. రాయలాముక్త మాల్యదలోఁ బ్రయోగించిన ఉషస్స్నాత ప్రయాత ద్విజావలి"- అను చోటులోని "ఉషస్స్నాత ప్రయాత" అను సమాసము వంటిది.

"ఆజఘ్రిరే నిర్ఝరైః" = చాల యందమైన కర్మణి ప్రయోగము.
"మధువ్రతో" = మధువును సేకరించుటయే వ్రతముగా గలది.

*భుక్తా మృణాలపటలీ భవతా నిపీతా*
*న్యంబూని యత్ర నలినాని నిషేవితాని.*
*రే రాజహంస ! వద ! తస్య సరోవరస్య*
*కృత్యేన కేన భవితాసి కృతోపకారః.* 46

తా :- ఓ ! రాజహంసమా ! ఆ సరోవర మందలి మృణాలసముదాయమును దింటివి. నీటిని త్రావితివి. నలినములయందు వసించితివి. ఇప్పుడా సరోవరమున కేమి యొనర్చి ఋణ విముక్తుఁడ వయ్యెదవు ?

వి :- "మృణాలపటలీ" = స్త్రీ లింగ స్వారస్యముచే స్త్రీలు ధ్వని.

*ప్రారమ్భే కుసుమాకరస్య పరితో యస్యోల్లసన్మఞ్జరీ*
*పుఞ్జే మఞ్జులగుఞ్జితాని రచయంస్తానాతనోరుత్సవాన్.*
*తస్మిన్నద్య రసాలశాఖిని దశాం దైవాత్కృశామఞ్చతి*
*త్వంచేన్ముఞ్చసిచఞ్చరీక వినయం నీచస్త్వదన్యోఽస్తికః.*47

తా :- ఓ చంచరీకమా ! వసంతారంభమందు రసాల శాఖ పుష్పించెను. దాని మంజరులయందు మధురముగ ఝుంకరించుచు ఆయాయుత్సవము లనుభవించితివి. ఇప్పుడు దానికి కానికాలము వచ్చినది; అది కృశించినది. దాని నిప్పుడు వదలిపెట్టిపోయినచో నీకన్న నీచుఁడెవ్వఁడు నుండడు.

వి :- "కుసుమాకరస్య" = వసంతము; కుసుమోద్గమమునకు కారణమైనది.

"మంజరీపుంజే మంజులగుంజితాని" = మంజులమైన శబ్దాలంకారము; "తానుత్సవాన్" = ఆయా వేడుకలను-అనఁగా యనుభవించిన వేడుకలు నీకే తెలియునని యర్థము.

ఏణీగణేషు గుణగర్వనిమీలితాక్ష
కిం కృష్ణసార! ఖలు ఖేలసి కాననేఽస్మిన్.
సీమామిమాం కలయ! భిన్నకరీన్ద్రకుమ్భ
ముక్తామయీం హరివిహారవసున్ధరాయాః. 48

తా :- ఓసీ! కృష్ణసారమా! గుణగర్వముచేతఁ గన్నులు మూసికొని ఆఁడు జింకల గుంపులో విశృంఖలముగ సంచరించుచున్నావు. ఈ భూముల యందు భిన్న కరీంద్రకుంభమైన సింహము దిరుగుచున్నది. ఈ రాలిన ముత్యములు దాని నఖగళితములే. ఈ శోభ వానిదే; ఇది నీ వెఱుగవా?

వి :- అనేకములైన యాఁడు జింకలకు ఒక మగజింక యుండును. అది యా గుంపునకు నాయకుఁడు.

"నిమీలితాక్ష" = వయసు పొగరుచే నీ కన్నులు మూసికొనిపోయినవి; నీకెవ్వరెదురులేదని విశృంఖలముగఁ దిరుగుచున్నావు.

జఠరజ్వలనజ్వలతా
ప్యపగతశఙ్కం సమాగతాపి పురః.
కరిణామరిణా హరిణా
హరిణాలీ హన్యతాం ను కథమ్ః 49

తా - ఒక సింహమున్నది. దానికి కడుపులో నాకలి పెచ్చు రేగుచున్నది: దాని ఎదుటనే పిచ్చలవిడిగా జింకలగుంపు తిరుగుచున్నది. ఆ సింహము యొక్క బుద్ధి యేనుగుపైననే యున్నది. ఎదుట దిరుగుచున్నను జింకలన దెట్లు జంపును?

వి :- సింహమున కేనుగును జంపుటయే కీర్తి. జింకలను జంపుటకాదు!

"జఠరజ్వలనజ్వలతాఽపి." = కడుపులో నగ్ని రేగినది.

"పురః" = తనపంజా క్రిందుబాటులోనే జింకల గుంపున్నది.

యేన భిన్నకరికుమ్భవిషక్త
న్మౌక్తికావలిభిరఞ్చితా మహీ.
అద్య తేన హరిణాన్తికే కథం
కథ్యతాం ను హరిణా పరాక్రమః. 50

తా :- చీల్చబడిన గజముల కుంభగతముత్యములచే ఏ సింగముచేత భూమి యలంకరింపబడినదో ! ఆ సింగము చేత నిపుడు జింకల సన్నిధానమున విక్రమ మెట్లు జూపబడును ?

స్థితం నో రే దధ్యాః క్షణమపి మదాన్ధేక్షణ ! సఖే !
గజశ్రేణీనాథ ! త్వమిహ జటిలాయాం వనభువి.
అసౌ కుమ్భిభ్రాన్త్యా ఖరనఖరవిద్రావితమహా
గురుగ్రావగ్రామః స్వపితి గిరిగర్భే మృగపతిః. 51

తా :- ఓ గజశ్రేణి నాథా ! నీకేమో మదముతోఁ గన్నులు మూసికొని పోయినవి. నీ మంచి కొఱకే చెప్పుచున్నాను. ఈ వనభూమి జటిలముగా నున్నది. నీకాహారమునకుఁ గొఱత లేదని ఇక్కడ దిరుగుచున్నావు. పొరపాటు సుమా ! ఏనుఁగుఁ అనెడు భ్రాంతితో వాడియైన గోళ్ళతో గీయబడిన గండశిలలుగల సింహము ఇచ్చటి గుహలో నిద్రించుచున్నది.

వి :- "ఖరనఖరవిద్రావితమహాగురుగ్రావగ్రామః" = ఈ సమాసము సింహముయొక్క పరాక్రమమును వ్యంజించుచున్నది; శబ్దశక్తి మూలక ధ్వని.

"స్వపితి"- అది నిద్రలేచినచో నేమౌదువో ! నీ యొక్క యలికిడికే నిద్ర లేవ వచ్చును. నిద్రాభంగమైనప్పుడు దాని కోపము లెంతింతలుగ నుండును గదా !

ఈ శ్లోకమందలి భ్రాంతిమదలంకారము చాల సొంపుగ నున్నది.

నిసర్గాదారామే తరుకులసమారోపసుకృతీ
కృతీ మాలాకారో వకులమపి కుత్రాపి నిదధే.

*ఇదం కో జానీతే ; యదయమిహ కోణాన్తరగతో*
*జగజ్జాలం కర్తా కుసుమతతిసౌరభ్యభరితమ్.* 52

తా :- తరుకుల సమారోప సుకృతియైన మాలాకారుఁడు వకుళముపై నెక్కువ దృష్టి పెట్టలేదు. అన్నిటిని నాటినట్లే దాని నెక్కడో నాటినాఁడు. కోణాంతరగతమైన యా లత జగజ్జాలమునే కుసుమతతిసౌరభ్యభరితముగా నొనర్చునని యెవ్వఁడెఱుగును ?

వి :- ఒక వ్యక్తి స్వభావతః తేజస్వి. వాని నితరు లంతగా గమనింపరు. పది మందిలో నొకనిగా లెక్కింతురు. కాని యా శక్తిమంతుఁ డూరకుండునా ? దిక్కులనెల్లఁ దనకీర్తిచే సువాసిత మొనర్చును.

*యస్మిన్ ఖేలతి సర్వతః పరిసరత్కల్లోలకోలాహలై*
*ర్మన్థాద్రిభ్రమణభ్రమం హృది హరిద్దన్తావలాః పేదిరే.*
*సోఽయం తుంగతిమింగిలాంగకవలీకారక్రియాకోవిదః*
*క్రోడే క్రీడతు కస్య కేళికలహత్యక్తార్ణవో రాఘవః.* 53

తా:- రాఘవము అనునది ఒక మహామత్స్యము. అది స్వేచ్ఛగా సముద్రములో విహరించుచున్నపుడు మహా కోలాహలముతో బయలుదేరు కల్లోలములను జూచి దిగ్గజములన్నీ మరల మందర పర్వతము తిరుగుచున్నదా అని భ్రాంతి చెందుచున్నవి. ఈ రాఘవము ఎన్ని తిములను మ్రింగి వేసినదో చెప్పజాలము. అది ఎప్పుడైనా తన నివాసమైన సముద్రముతో ప్రణయకలహము పెట్టుకొని బయటకు వచ్చినట్లైతే దేని క్రోడములో విహరించవలెను !

వి:- పెద్ద మత్స్యము తిమి. దానిని మ్రింగేది తిమింగిలము. తిమింగిలమును మ్రింగేది తిమింగిలగిలము. దానిని కూడా మ్రింగేది రాఘవము. తిమింగిలగిలగిల మన్నమాట ''తిమింగిలగిలో ఒప్యస్తి తద్గిలో౽ప్యస్తి రాఘవః'' అని ప్రసిద్ధ వచనము. క్రోడమనగా వక్షస్థలము. మధ్య భాగము.

ఒక మహాపురుషుడున్నాడు. అతనికి తగిన గొప్ప ఆశ్రయము కూడా లభించినది. ఏకారణము చేతనైనా ఆతడు ఆ ఆశ్రయదాతకు దూరమైతే మనడం అసంభవము, మహాపురుషుని మహత్త్వం గుర్తించగలిగిన మహా పురుషుడే ఆతనికి ఆశ్రయము ఇవ్వకలుగుతాడు. అట్టి వాడు దూరమైతే మరొకడు, తగిన వాడు, లభించడు.

*గిరిగహ్వరేషు గురుగర్వగుమ్భితో*
*గజరాజపోత ! న కదాపి సఞ్చరేః.*
*యది బుధ్యతే హరిశిశుః స్తనన్ధయో*
*భవితా కరేణుపరిశేషితా మహీ.* 54

తా :- ఓయీ ! గజరాజ పోతమా ! నీకు పొగరెక్కువైనది; అక్కడిక్కడ దిరుగుదువుగాని గిరి గహ్వరములందు సంచరింపవచ్చునా? స్తనంధయమైన హరిశిశువు నీ రాకను గుర్తించెనా – ఇక నేమున్నది? భూమిపై నాడు యేనుగు మాత్రమే మిగులును.

వి :- ''గజరాజ పోత !'' = నీ కింకను జీవితానుభవము లేదు.

''గురుగర్వగుంభితః'' = వయస్సునకు మించిన పొగరున్నది. అది నీ వయస్సు యొక్క ప్రభావము.

''కదాఽపి'' = తప్పి దారియైనను ఆ ప్రాంతములకు బోతివా - నీ కథ ముగిసినట్లే.

'' భవితా......మహీ '' = నీవు మరణింతువని చెప్పక కరేణువు మాత్రమే మిగులునన్నాడు. మంచి యుక్తివైచిత్రి. మగ యేనుగు యొక్క మరణము ధ్వని.

''స్తనంధయః'' = ఆ సింహపు పిల్ల యింకను పాలుద్రావు వయస్సులోనే యున్నది. నీ వయసు దాని కన్నను గొంచెము పెద్దది గావచ్చును. నీవు వాహ్యాళి వచ్చుచున్నావు. అది వయస్సులో నీకన్న జాల చిన్నది. అయినను దాని విజృంభణకు నీవు తట్టుకొనజాలవు. అది దాని జాతి స్వభావము.

*లూనం మత్తమతఙ్గజైః కియదపి చ్ఛిన్నం తుషారాంబుభి*
*శ్శిష్టం గ్రీష్మజభీష్మ భానుకిరణై ర్భస్మీకృతం కాననమ్.*
*ఏషా కోణగతా ముహుః పరిమలై రానన్దయ న్తీ దిశో*
*హా కష్టం లలితా లవఙ్గలతికా దావాగ్నినా దహ్యతే.* 55

తా :- ఈ యడవి మత్త మతంగజములచేఁ గొన్ని యెడల విలూనమై నది. కొన్ని యెడలఁ దుషారాంబువులచే భిన్నమైనది. మిగిలినది గ్రీష్మ భాను కిరణములచే భస్మీకృతమైనది. అయినను చింత లేదు. లలితమైన యీ లవంగ లతిక ఏదోయొక మూలయందుండి తన పరిమళములచే దిక్కుల నానందింపఁ జేయుచున్నది. అయ్యో ! అది గూడ దావాగ్నిచే దహింపఁబడుచున్నది.

వి :- "మత్త మతంగజైః" = అవి మదించినవి. వాని యిష్టము వచ్చినట్లు జెఱలాడినవి. భానుకిరణములే తీక్ష్ణములు. ఎండకాలమందవి యింకను ఘోరములు. "భస్మీకృతమ్" = అభూతతద్భావము. "భస్మ" శబ్ద ప్రయోగము అరణ్యమునకు సంభవించిన మహాపదను వ్యంజించుచున్నది.

"ఆనందయంతీమ్" = సంతోషపెట్టుటయే దాని స్వభావము. "హా కష్టమ్" = ఇత్యాది శబ్దములు శ్లోకములలో ననేక చోట్ల నీతఁడు వాఁడెను. వీనిచే ధ్వని వాచ్యమై పోవుచున్నది.

*స్వర్లోకస్య శిఖామణిః సురతరుగ్రామస్య ధామాద్భుతం*
*పౌలోమీపురుహూతయోః పరిణతిః పుణ్యావలీనామసి.*
*సత్యం నందన కిం త్విదం సహృదయైర్నిత్యం విధిః ప్రార్థ్యతే*
*త్వత్తః ఖాణ్డవరఙ్గతాణ్డవనటో దూరేఽస్తు వైశ్వానరః.* 56

తా :- "ఓ ! నందన వనమా ! నీవు స్వర్లోక శిఖామణివి; సురలోక తరు గ్రామమునకు నివాస స్థానము. పౌలోమీ పురుహూతుల పుణ్యములకు పరిణతి. ఖాండవరంగతాండవనటుడైన వైశ్వానరుఁడు నీ నుండి యెప్పుడును దూరముగా నుండు గాక"-అని సహృదయులు నిత్యమును బ్రహ్మదేవుని బ్రార్థించుకొనుచున్నారు. ఒకానొక తేజస్వియైన పురుషుఁడున్నపుడు వానితోఁ దమకేమియు లాభము లేకున్నను వాఁడు జీవించుటయే యొక యలంకారముగ భావించు సహృదయులు గొందరుందురు. వారు వాని క్షేమమునకై నిరంతరము బ్రార్థింతురు.

*స్వస్వవ్యాపృతిమగ్నమానసతయా మత్తో నివృత్తే జనే*
*చఞ్చుకోటివిపాటితారరపుటో యాస్యామ్యహం పఞ్జరాత్.*

*ఏవం కీరవరే మనోరథమయం పీయూషమాస్వాదయ*
*త్యన్తః సంప్రవివేశ వారణకరాకారః ఫణిగ్రామణీః .57*

తా :- పంజరములో నొక చిలుక జిక్కినది; దానికి బయటికిఁ బోవలెనని యాశ. అది మనస్సులో నిట్లాలోచించికొనుచున్నది: "ఇప్పుడు నాచుట్టును - జనమున్నారు. వారెంత సేపుందురు ? తమతమ పనులకు వెళ్ళిపోదురు. అప్పుడు నేను ఈ కడ్డీలను జీల్చుకొని బయటఁ బడుదును. ఇంకేమి ? నాకు స్వేచ్ఛ" అని యా చిలుక భావ సుధల నాస్వాదించుచున్నది. ఆ యాలోచనలే దానికిఁ దీయ తీయగా నున్నది. ఇంతలో దైవ దుర్విపాకము ! ఏన్గు తొండముతో సమానమైన లావుగల పాము. పంజరములో ప్రవేశించినది.

వి :- మానవుడు ఎన్నెన్ని యూహలనో జేయును. తన క్షేమము నకై "యిట్లు సేతు" "నట్లు సేతు" నని గాలి మేడ లల్లును. కాని దైవము పేఁబదలచినప్పుడు వాని యూహలన్నియు పటాపంచ లగుచుండును. అనుకోని యాపద హటాత్తుగాఁ తటస్థించును.

"మనోరథ మయం పీయూషమ్" = తీయని తలపులనెడి యమృతము. మంచి భావన.

ర. గం :- అభీష్టార్థమునకు విరుద్ధము ప్రాప్తించుట. విషాదనా లంకారము.

*రే! చాపల్యజుషో మృగాః! శ్రితనగాః కల్లోలమాలాకులా*
*మేతామమ్బుధికామినీం వ్యవసితాః సంగాహితుం వా కథమ్.*
*అత్రైవోచ్ఛలదమ్బునిర్భరమహావర్తైః సమావర్తితో*
*యద్గ్రావేవ రసాతలం పునరసౌ యాతో గజగ్రామణీః.58*

తా :- ఓ ! జింకలారా ! మీరీ నది ప్రక్కనున్న కొండలయందే విహరింపుడు. ఇదేమి ! దారితప్పి యిట్లు వచ్చితిరి? ఈ నది నేఱుగా సముద్రము

నకుఁ బోవును. కల్లోలమాలాకులమైనది; మీరు చాపల్యముతో నీనదిలో దూకుటకు వచ్చినారు. పొరపాటు సుమా ! ఆ నదిలో జూడుఁడు. ఎక్కడ జూచినను నీరు బుసలు గొట్టుచున్న భయంకరమైన సుడులు; నిన్న మొన్న నిక్కడికొక పెద్ద యేనుఁగు వచ్చి జొరఁ బారినది! ఇంకేమున్నది? దొడ్డ గండ శిలవలె పాతాళమునకు మునిగిపోయినది.

*విబ స్తన్యం పోత; త్వమిహాకిల దన్తావల ధియా*
*దృగ న్తానాధత్సే కిమితి హరిద న్తేషు పరుషాన్.*
*త్రయాణాం లోకానామపి హృదయతాపం పరిహర*
*న్నయం ధీరం ధీరం ధ్వనతి నవనీలో జలధరః.* 59

తా :— ఒక యాడు సింహము తన పిల్లతో ననుచున్నది:- "నాయనా! నిమ్మళముగాఁ బాలుద్రావుము. మదించిన యేను గనెడి భ్రాంతితో త్రావుటమాని దిక్కులకుఁ బరుషములైన చూపులు బఱపుచున్నావు; అది గజ బృంహితము గాదు సుమా! నవనీల జలధర గర్జనము. జలధరము ముల్లోకముల హృదయ తాపమును బోగొట్టునది.

వి:—"ఒకానొక సత్పురుషుఁడు; వాడు శుభకార్యములొనర్చును. నిష్కారణముగా వానిపై దుండగములు సల్పవలదని" యీ శ్లోకము మందలించు చున్నది.

*ధీరధ్వనిభిరలం తే*
*నీరద! మే మాసికో గర్భః.*

*మధ్యేజఠరం సముచ్ఛలతి.* 60

తా ఒక సింహము మేఘముతో ననుచున్నది: ఓ! నీరదమా ! నేను గర్భవతిని. ఒక మాసము మాత్రమే గడచినది. నీవేమో గగనమున ధీరముగ ధ్వనించుచున్నావు. ఆ ధ్వని విని మదించిన యేనుఁ గనెడు భ్రాంతితో నా కడుపునుండి పిల్ల గడ్డకు వచ్చుటకుఁ దనుకులాడుచున్నది; నాకు బాధ గల్గు చున్నది. దయచేసి గర్జింపకుము.

వి :- "నీరదా! నీవు నీరములిచ్చి సమస్త జనుల తాపములార్పు వాఁడవు. ఇతరులను శోభ పెట్టుట నీవంటి వానికి తగదు. "ఉన్మద... బుద్ధ్యా" = నీ గర్జితములు మదించినగజ బృంహితములని తలచుచున్నవి. "మద్భే... సముచ్ఛలతి" = నాపిల్ల గద్దెకు వచ్చుటకు యత్నించుచున్నదని చెప్పక నా గర్భ మధ్యము చలించుచున్నదని చెప్పుట చక్కని వక్రోక్తి.

ర. గం:- అతిశయోక్త్యలంకారము. విషయిచేత నిగరణము అతి శయోక్తి. రెండు పదార్థములకు భేదమున్నను అభేదము జెప్పుట కూడ నతి శయోక్తియే! పై శ్లోకమునకు ఆడు సింహము పలికినట్లున్నది. దానికి గర్భచలన సంబంధము లేదు. సంబంధమున్నట్లు చెప్పఁబడినది. ఎందుకట్లు చెప్పినాఁడు? శౌర్యాతిశయమును దెల్పుటకు.

*వేదణ్డగణ్డకణ్డూతి*
*పాణ్డిత్య పరిపన్థినా.*
*హరిణా హరిణాలీషు*
*కథ్యతాం కః పరాక్రమః.*

తా :- వేదండముల యొక్క గండ కండూతి పాండిత్యమునకు పరి పంథియైన సింహముచేత ఆడు జింకల యందేమి పరాక్రమము?

వి :- "వేదండ......పరిపంథినా" = ఈ సమాసము ప్రౌఢ గంభీర ముగనున్నది. "హరిణాళీషు" = జింకల గుంపులు: "ఆళీః" స్త్రీ లింగము. తేజస్వియైన వాఁడు తనకుఁదగిన వానిపై బోవలెనుగాని అల్పులపై విక్రమము జూపుట యేమి గొప్ప తనమని భావము.

*నీరా న్నిర్మలతో జనిర్మధురతా రామాముఖస్పర్ధినీ*
*వాసో యస్య హరేః కరే పరిమలో గీర్వాణచేతోహరః.*
*సర్వాస్వం తదహో మహాకవిగిరాం కామస్య చామ్భోరుహ!*
*త్వం చేత్ప్రీతిమురీకరోషి మధుపే! తత్త్వాం కిమాచక్ష్మహే.* 62

తా :- ఓసీ ! పద్మమా ! నిర్మలములైన నీరములలో జనించితివి. నీ యందము స్త్రీల ముఖ సౌందర్యములతోఁ బందెమునకు దిగునది. నీ యునికి మాధవుకరమందు. పరిమళమా ! గీర్వాణచేతోహరము. మహాకవుల వాక్యములకును, మన్మథునకును నీవు సర్వస్వము. ఇన్నియుండియు నీవు మధుప ప్రేమ యంగీకరించితివేని నిన్నేమనవలెను ?

వి :- "మధుప" = కల్లు త్రాగువాడని యర్థము.

"అంభోరుహ" = ఈ శబ్దమున కన్నను వేఱు పదము వేసి యున్నచో బాగుండెడిది. రూఢ్యర్థము గ్రహింపవలెను యౌగికార్థము "నీరాన్నిర్మలతో జనిః"- అనుటచే గతార్థము. మూడవ పాదము సరసమైన యుక్తి వైచిత్రి.

*లీలాముకలితనయనం*
*కిం సుఖశయనం సమాతనుషే.*
*హరిణా తవ మదహరిణా*
*కరినాయక ! వర్ధతే వైరమ్.* 63

తా :- ఓరీ కరినాయకా ! అలవోకగా కన్నులు మూసికొని, చక్కని పడకపైఁ బండుకొన్నావు. నీ మదహరమైన సింహముతో వైరము పెరిగి వచ్చుచున్నది సుమా !

*విదుషాం వదనాద్వాచః*
*సహసా యాంతి నో బహిః*
*యాతాశ్చేన్న పరాంచంతి*
*ద్విరదానాం రదా ఇవ.* 64

తా :- విద్వాంసుల నోటి నుండి యొక మాట గడ్డకు జారదు. అది గజదంతము వంటిది. జారిన మరల వెన్కకురాదు. అవమానమును పొందదు. గజదంతము లూడనే యూడవు. ఊడిన నదికికొనవు; ఊడి వచ్చినను వాని వెలతగ్గదు.

*ఔదార్యం భువనత్రయేపి విదితం సమ్భూతిరమ్యా నిధేః*
*వాసో నన్దనకాననే పరిమళో గీర్వాణచేతోహరః*

*ఏవం దాతృగురోరుణాః సురతరోః సర్వేఽపి లోకోత్తరాః*
*స్యాదర్థిప్రకరార్తితర్పణవిధావేకో వివేకో యది.* 65

తా :- కల్పవృక్షము యొక్క యౌదార్యము మూడులోకముల యందునుఁ బ్రసిద్ధము. ''అంభోనిధి'' నుండి జన్మ. నందన మందు నివాసము. పరిమళము గీర్వాణ చేతోహరము. సమస్త దాతలకును గురుత్వనుధిష్ఠించినది. గుణము లన్నియు లోకోత్తరములే! ఇవన్నియు నెప్పుడు శోభించును. యాచించవారి కోర్కెలు దీర్చుటలో వివేకమున్నప్పుడు. లేదు తీరుగదా.

వి :- పాత్ర మెఱిగి దానమీవలెననుట యిందలి భావము.

*ఏకో విశ్వసతాం హరామ్యపఘృణః ప్రాణానహం ప్రాణినా*
*మిత్యేవం పరిచిన్త్య మాస్మ మనసి వ్యాధానుతాపం కృథాః.*
*భూపానాం భవనేషు కించ విమలక్షేత్రేషు గూఢాశయాః*
*సాధూనామరయో వసన్తి కతి న త్వత్తుల్యకక్ష్యాః ఖలాః.* 66

తా :- ''ఓయీ! వ్యాధుడా! దయాహీనుడవై నమ్మిన జంతువులనే - ప్రాణములు దీసి వధింతును''. అని మనస్సునందు బాధపడకుము. నీ వంటి వారు ప్రపంచములో నెందరో యున్నారు. కొందరు రాజుల నాశ్రయించికొని వారు భవనములలో నుందురు. మరికొందరు యాత్రాస్థలములందు వసింతురు. వీరును నీవలెనే గూఢాశయులు; సాధుజనులకు వైరులు.

ర. గం :- ప్రతీపాలంకారము. ఉపమానము నుపమేయముగా చెప్పుట.

*విశ్వాస్య మధురవచనైః*
*సాధూనిహ వఞ్చయన్తి నమ్రతరాః.*
*తానపి దధాని మాతః.*
*కాశ్యపి! యాతస్తవాపి చ వివేకః.* 67

తా :- భూమాతా! మధుర వచనములతో విశ్వాసమును బుట్టించి, కపట వినయములు ప్రదర్శించుచు, కొందరు సాధువులను వంచింతురు. అట్టివారినిఁ గూడ భరించుచున్నావు. నీ వివేక మెటు వోయినది ?

ర.గం :- ఇది కావ్యలింగాలంకారము.

అన్యా జగద్ధితమయీ మనసః ప్రవృత్తి
రన్యైవ కాపి రచనా వచనావలీనామ్.
లోకోత్తరాచ కృతిరాకృతిరార్తహృద్యా
విద్యావతాం సకల మేవ గిరాం దవీయః. 68

తా :- జగద్ధితమును గలిగించు మనఃప్రవృత్తియే యన్యము; వచనరచనాపద్ధతియే భిన్నము. వారి పనియే లోకోత్తరము. ఆకృతి ఆర్త హృద్యమైనది. విద్యావంతుల సకలమును మాటలకందనిదే.

వి :- ''అన్యా'' = సామాన్య లోకముకంటె వేరె నది.

''గిరాం దవీయః'' = మాటలతో వర్ణించుటకు సాధ్యముగానిదని యర్థము.

ర.గం :- అతిశయోక్త్యలంకారము. ఎక్కడ భేదములేదో, అక్కడ లోకోత్తరత్వము సిద్ధించుటకై భేదము చెప్పబడెనో అక్కడఁగూడ నతిశయోక్త్యలంకారము. ఇక్కడ ప్రస్తుతమున కన్యత్వము (జెప్పఁబడినది.

ఆపద్గతః ఖలు మహాశయచక్రవర్తీ
విస్తారయత్యకృతపూర్వముదారభావమ్.
కాలాగరుర్దహనమధ్యగతోపి శశ్వ
ల్లోకోత్తరం పరిమలం ప్రకటీకరోతి. 69

తా :- గొప్ప భావములు గలిగిన మనుష్యుఁడు తానాపదలో నున్నను అకృతపూర్వమైన యుదారభావమును విస్తరింపఁ జేయును; కాలాగరువు దాఁగగ్గిలో దహింపఁ బడుచున్నను లోకోత్తరమైన పరిమళమును విస్తరింప జేయుచున్నది గదా !

ర.గం :- ప్రతివస్తూపమాలంకారమున కుదాహరణముగా నివ్వఁబడినది.

*విశ్వాభిరామగుణగౌరవ గుమ్ఫితానాం*
*దోషో౽పి నిర్మలధియాం రమణీయ ఏవ.*
*లోకోత్తరైః పరిమలైః పరిపూరితస్య*
*కాశ్మీరజస్య కటుతాపి నితాన్తరమ్యా.* 70

తా :- లోక మనోహరమైన గుణగౌరవము చేత గూడిన వారు కొందరుందురు. వారిలో నేదేని దోషలేశమున్నచో నదియును రమణీయమే ! సర్వోత్తమ పరిమళములచేఁ బరిపూరితమైన కుంకుమము యొక్క కటుత్వ మైనను రమ్యమైనదే గదా !

వి :- "నితాంతం రమ్యా = నితాంతరమ్యా" యని సమాసము. లోకములో రెండు తెగల వారున్నారు. గుణములెన్నియున్నను దోషలేశము గూడఁ బనికిరాదను వారుగొందరు. దండి కావ్యాదర్శములో "శ్విత్రేణైకేన దుర్భగం" అన్నాడు. అనఁగా శరీర మెంత యందముగా నున్నను ఒకమూల రవంత తొన్ని యున్నచో, కాయమంతయు వికారమగునుకదా" యని యాతని భావము. కాళిదాసు కుమార సంభవములో "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జ తేందోః కిరణేష్వివాంకః"—యనెను. అనేక గుణములలో నొక దోషలేశముకనుపడనే కన్పడదు. చంద్రుని కిరణములలో వాని కళంక లేశముగనపడనట్లు—" అని కాళిదాసు శ్లోకమున కర్థము. జగన్నాథుఁడీ రెండవ తెగకుఁజేరినవాఁడు.

ర.గం :- ఇదియును ప్రతి వస్తూపమయే.

*లీలాలుణ్ఠితశారదాపురమహాసంపద్భరాణాం పురో*
*విద్యాసద్మవినిర్గళత్కణముషో వల్గన్తి చేత్పామరాః.*
*అద్యశ్వః ఫణినాం శకున్త శిశవో దన్తావలానాం శశాః*
*సింహానాం చ సుఖేన మూర్ధని పదం ధాస్యన్తి సాలావృకాః* 71

తా :- కొందరు మహా విద్వాంసులున్నారు; వారు తమయొక్క శక్తితో సరస్వతీ పట్టణమందలి సంపదలనెల్ల కొల్లకొట్టి విద్యలనార్జింతురు. మరికొందరు పామరుల్లు. పండితుల విద్యాగేహములనుండి బయటికివచ్చిన గింజలను గ్రహించి

వాని ప్రభావముతోఁ దాము పండితులమని విఱ్ఱవీగుచుందురు. నిజముగా వారికే గౌరవము వచ్చినచో నిఁకనేమున్నది ? నేఁడో - రేపో నాగుల పడగలపై పిట్టలు గొల్వుండును. ఏన్గులను కుందేళ్ళు బెదిరించును. సింహముల నెత్తిపై గుంట నక్కలు గూర్చుండును.

వి :- లీలా...... సంపద్భరాణాం = చక్కని వక్రోక్తి. క్రిందిపాదము కూడ నట్టిదే ! *

ర. గం. :- అర్థాపత్త్యలంకారమున కుదాహరణము.

*గీర్భి ర్గురూణాం పరుషాక్షరాభి*
*స్తిరస్కృతా యాన్తి నరా మహత్త్వమ్.*
*అలబ్ధశాణోత్కషణా నృపాణాం*
*న జాతు మౌళౌ మణయో వసన్తి.* (72)

తా : విద్యాభ్యాసకాలమందు గురుపులు పరుషాక్షరములుగాఁదిట్టు దురు. అట్లు వారిచేఁ దిరస్కృతులై తిట్లు దిన్నవారే తర్వాతి జీవితమున మిగులఁ బ్రకాశింతురు. రత్నముల కొఱపిడి గావలెను. లేనిదే వానికి కాంతి యెక్కదు. రాజుల కిరీటములయందు నివాసములుండవు.

వి :- విద్యాభ్యాసకాలమందు మానవుఁడు గురువు తిట్టెనని తిరస్కరించె నని నొప్పిపడరాదు. అవియే వాని భావి కీర్తికిఁ గారణములు. అట్టివానికే గురువులు శ్రద్ధగాఁ జదువు చెప్పెదరు. మహాకవియైన మురారి గూడ నీ భావముతో సంవదించినాఁడు. "గురుకులక్లిష్టో మురారిః కవిః" అని యాతని సూక్తి.

ర. గం :- ప్రతివస్తూపమాలంకారము.

*వహతి విషధరాన్పటీరజన్మా*
*శిరసి మషీపటలం దధాతి దీపః.*
*విధురపి భజతేతరాం కలంకం*
*పిశునజనం ఖలు బిభ్రతి క్షితీన్ద్రాః.* (73)

* "అద్యశ్వః" = హిందీలోని "ఆజ్‌కల్". తెలంగాణా ప్రాంతములోని "ఈవేళా-రేపూ."

తా :- చందనము హారులను ధరించుచున్నది; దీపము శిరస్సుపై మషీ పటలమును వహించుచున్నది. చంద్రుడు గూడ కళంకమును ధరించుచున్నాడు. రాజులును పిశునజనములను బోషింతురు.

వి :- పై జెప్పిన పదార్థములన్ని ఆయా వస్తువులకెట్లు కళంకప్రాయములైనవో రాజులకు నంతేనని భావము; మూడు పాదములలో జెప్పిన వస్తువులకది సహజము; అట్లే రాజులకును పిశునజన పోషణము సహజము. రాజెంత మెలఁకువతోనున్నను నట్టివారు గొందరాతని కన్నుగప్పి చేరనేచేరెదరు. వారిని భరించియే గావలెను.

''పడిసె మున్నంతవరకు తలనొప్పి యున్నట్లు''
''భజతేతరాం'' = పౌఢమైన క్రియాపదము.

ర. గం :- ప్రతివస్తూపమాలంకారము.

సత్పురుషః ఖలు హితాచరణైరమన్ద
మానందయత్యఖిలలోకమనుక్త ఏవ
ఆరాధితః కథయ కేన గుణైరుదారై
రిన్దుర్వికాసయతి కైరవిణీకులాని.

తా :- సత్పురుషుఁడు దన్నెవ్వరుఁ గోరకున్నను హితాచరణముతో లోకమున కానందము గూర్చుచున్నాఁడు. కైరవిణీకులములను వికసింప జేయుమని చంద్రు నెవరు ప్రార్థించిరి ? సత్పురుషుల కది సహజ స్వభావము.

ర. గం :- దృష్టాంతాలంకారము.

పరార్థవ్యాసఙ్గాదుపజహదథ స్వార్థపరతా
మభేదైకత్వం యో వహతి గుణభూతేషు సతతమ్.
స్వభావాద్యస్యాన్తః స్ఫురతి లలితోదాత్తమహిమా
సమర్థో యో నిత్యం స జయతితరాం కోఽపి పురుషః 75

తా :- పరోపకారమునకై స్వార్థమును వదలును. సజ్జనులందు భేద భావమును వదలి అందరిని సమ భావముతో నాదరించును. స్వభావముగనే వాని మనస్సుదాత్త మహిమతోఁ జెలఁగును. సమర్థుడై యుండును. ఇట్టి వాఁడెవడో యొకానొక సార్థక పురుషు; సార్థకముగ జీవించును.

*వంశభవో గుణవానపి*
*సఙ్గవిశేషేణ పూజ్యతే పురుషః.*
*న హి తుంబీఫలవిఫలో*
*వీణాదణ్డః ప్రయాతి మహిమానమ్.* 76

తా : ఒకా నొకఁడు గొప్ప వంశములో జన్మించినను, సద్గుణ వంతుడైనను, సంగ విశేషముతోనే వాఁడు పూజ్యత నందును. తుంబీ ఫలము పగిలి పోయినప్పుడు వీణా దండమెంత బాగున్నను దానికి వెల రాదుగదా !

వి :- తుంబీ ఫలమనగా సొరకాయ; అది చీలినపుడు వల్లకీ దండ మెంత బాగున్నను దానియందు సరియైన ధ్వని రాదు. శ్లేషణికి తుంబీఫల సంసర్గము ప్రసిద్ధమే. పెద్దన్నగారు సరస్వతిని వర్ణించుచు –

''ఘనమైన రారాపు చనుదోయి రాయిడి
తుంబీ ఫలంబు తుందుడుకు జెంద''-అని యన్నారు.

రం. గం :- ప్రతివస్తూపమ.

*అమితగుణోఽపి పదార్థో*
*లోకే దోషేణ నిన్దితో భవతి*
*నిఖిలరసాయనమహితో*
*గన్ధేనోగ్రేణ లశున ఇవ.* 77

తా :- ఒకానొక వస్తువులో నెన్ని గుణములున్నను ఒక దోషముతో నది, నిందఁ బడయును. ఎల్లిగడ్డ రసాయనములలో శ్రేష్ఠమైనది; కాని దాని గంధము సహింపరానిది. అందుచే పెద్దలు దానిని బహిష్కరింతురు.

రం. గం :- ఉదాహరణాలంకారము.

ఉపకార మేవ తనుతే
విపద్గతః సద్గుణో నితరామ్.
మూర్ఛాగతో మృతో వా
నిదర్శనం పారదోఽత్ర రసః. 78

తా :- సత్పురుష సముదాయము విపత్తులలో నున్నను యితరుల కుపకారము చేయును. పాదరసము మూర్ఛ నందినను మృతమైనను అన్యులకు మేలొనర్చు రసముగనే మారును గదా !

వి :- వైద్యుడు పాదరసముతో ననేకములు మందులు జేయును. కొందరు దానిని మూర్ఛ నొందింతురు; అనఁగా దానిలోని విష గుణములను దీసివేయుదురు; మరికొందరు దానిని భస్మీకరింతురు; ఎట్లు చేసినను నది యుత్తమమైన మందుగనే దయారగును.

రం. గం :- ఉదాహరణాలంకారము.

వనాన్తే ఖేలన్తీ శశకశిశుమాలోక్య చకితా
భుజప్రాన్తం భర్తుః సపది భయహర్తుర్భజతి యా.
అహో ! సేయం సీతా దశవదననీతా హలరదైః
పరీతా రక్షోభిః శ్రయతి వివశా కామపి దశామ్. 79

తా :- దండకములలో సంచరించుచు సీతాదేవి కుందేలు పిల్లలను జూచినను భయపడెడిది; ఆమె వెంటనే రాముని భుజముల వెన్క దాగికొనును, రాముడామెను "భయపడకుము. అది సామాన్య జంతువ"ని యోదార్చెడు వాఁడు. అట్టి సీతను రావణుఁడెత్తికొని పోయెను. చుట్టును రాక్షస స్త్రీలు. వారి పండ్లే నాగళ్ళ వంటివి. ఆమె పాపము ! మానసికముగా నెట్టి బాధ నందినదో !

వి :- "సేయం సీతా" = అట్టి జానకీదేవి యని భావము. 'సేయం' అనుటలో పై రెండు పాదములలో జెప్పిన విషయమే గాక, ఆమె సౌందర్య

లాలిత్యము లన్నియు ధ్వనించును. ''దశవదన సీతా'' = వాడు చూచుటకే భయంకరుడు. ''సీతా'' – ''హలరద్రైః'' ఈ రెంటికి నేదో విచిత్రమైన సంవాదము సూక్ష్మముగ భాసించుచున్నది;

''రక్షోభిః'' = ఒకరుగాదు; అనేక రాక్షస స్త్రీలు;

''కామపి దశామ్'' = అట్టి దిట్టిదని, ఇంత మాత్ర మంత మాత్రమని చెప్పుటకు సాధ్యము గాని మనో వేదన.

ర. గం :- విషమాలంకారము.

*పురా గీర్వాణానాం నిజ భుజబలాహోపురుషికా*
*మహో ! కారణ్కారం పురభిది శరం సమ్ముఖయతః.*
*స్మరస్యా స్వర్బాలానయనసుమమాలార్చనపదం*
*వపుః సద్యో భాలానలభసితలీలాస్పదమభూత్.* 80

తా :– మన్మథుడు దేవతల ముందర దన పరాక్రమమును వేవేల రీతులఁ బొగడి కొనెను. వాఁడు వచ్చి భవునిపై బాణమును సమ్ముఖీకరించి నాఁడు. దాని ఫలమేమైనది ? దేవతాస్త్రీల నయన సుమ మాలాస్పదమైన వాని శరీరము పరమేశ్వరుని ఫాలానల భసిత లీలాస్పదమైనది.

వి :– ''ఆహోపురుషికా'' = అహంకారమని యర్థము. శంకరాచార్యుల సౌందర్య లహరిలో నీ శ్లోకమున్నది-

''క్వణత్కాంచీదామా కరికలభకుంభ స్తననతా
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా.
ధనుర్బాణౌ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తాదాస్తాం నః పురమథితురాహోపురుషికా.''–ఇచ్చటి
'ఆహోపురుషికా' శబ్దమును వ్యాఖ్యానించుచు లొల్లలక్ష్మీధరుడిట్లన్నాఁడు-

''అహోశబ్దః ఆశ్చర్యవాచీ. పురుషశబ్దస్య ప్రత్యగాత్మ వాచినః అహం శబ్దవాచ్యత్వం లక్ష్యతే. అతః అహోఅహంభావః; ఆహో పురుషికా అహంకార ఇతి యావత్'',

''వపుః'' = ఈ శబ్దమును సామాన్యముగా సుందరమైన శరీరములకే యుపయోగింతురు.

వపుషా స్వేన నియోజయిష్యతి'' = (కాళిదాసు కుమారసంభవము I-42)

''నవం వయః కాతమిదం వపుశ్చ'' = (రఘువంశము-2-47)

''వపుఃప్రకర్షాదజయత్ గురం రఘుః.'' (రఘువంశము-3-34) ఇత్యాది ప్రయోగములు. ''కారం కారం'' = చేసి చేసి, ''పురభిద'' = త్రిపురములను దహించినవాఁడు. మహాపరాక్రమశాలి.

''స్వర్బాలాః...పదం'' = దేవకాంతలందరికిని మన్మథుని శరీరముపైననే జూపు. తెల్లని కంటి చూపులతో నిరంతరమాతని బూజించుచుందురు. ''సద్యః'' = పరమశివుడు కన్ను దెరచుటకును 'మన్మథుఁడు దహింపఁబడుటకును' మధ్య నంతరమే లేదని తాత్పర్యము. ''పురా'' ఇందు తనకును పరమ శివునకును నంతరము దెలియక, మదనుఁడు దౌలుత నేవో జంభములు పల్కినాఁడని భావము.

ర. గం. :- విషమాలంకారము.

నిష్ణాతోఽపిచ వేదాన్తే
సాధుత్వం నైతి దుర్జనః.
చిరం జలనిధౌ మగ్నో
మైనాక ఇవ మార్దవమ్.

తా :- దుర్జనుఁడెన్ని వేదాంతములు జదివినను, సజ్జనుఁడు గానేరఁడు. ఎంతకాలము నుండియో మైనాకము సముద్రమందున్నది. ఏమి ప్రయోజనము? అది మార్దవము నందినదా ?

ర. గం :- అవజ్ఞాలంకారము.

నైర్గుణ్యమేవ సాధీయో
ధిగస్తు గుణగౌరవమ్.
శాఖినో౽న్యే విరాజన్తే
ఖణ్డ్యన్తే చన్దనద్రుమాః. 82

తా నైర్గుణ్యమే సాధింపఁ దగినదని * దోచును. గుణగౌరవముతో నేమి ప్రయోజనము ? ఎన్నో చెట్లున్నవి. వాని జోలికెవ్వరునుఁబోరు. చందనపు చెట్లను ఖండింతురు. ఆ యపకారము వాని గుణగౌరవము చేతనే యేర్పడినది.

ర. గం :- లేశాలంకారము.

పరోపసర్పణానంత
చింతానలశిఖాశతైః.
అచుమ్బితాన్తఃకరణాః
సాధు జీవన్తి పాదపాః. 83

తా :- ఈ వృక్షముల బ్రతుకే ధన్యమైనది. అవి యితరులను సమీపింపవు; సమీపించుట వలన ఏర్పడు చింతాశతములు లేవు; ఆ బాధలతో వాని యంతఃకరణము లచుంబితములు.

ర. గం :- వ్యాజస్తుతి.
శూన్యే౽పి చ గుణవత్తా
మాతన్వానః స్వకీయగుణజాలైః.
వివరాణి ముద్రయన్ ద్రా
గూర్ణాయురివ సజ్జనో జయతి. 84

తా :- సజ్జనుఁడు సాలీని వంటివాఁడు. అతఁడు దనుఁజేరినవారియందే గుణములు లేకున్నను తన గుణములచేత వానికి శోభ నాపాదించును; వాని దౌర్బల్యములనన్నిటినిఁ గప్పిపుచ్చును.

* సాధీయాన్ = మంచిది.

వి :- "గుణజాతైః" = సద్గుణములు నూలిపోపులు. సాలీడు తన గూడు శూన్య మంద ల్లును. ఆ ప్రదేశమును గుణములు గలదిగాఁ జేయును. దాని యందలి రంధ్రములనన్నిటిని బూడ్చివేయును.

ఖల స్సజ్జన కార్పాస
రక్షణైకహుతాశనః.
పరదుఃఖాగ్నిశమనే
మారుతః కేన వర్ణ్యతే. 85

తా :- దుర్మార్గుడు సజ్జనులను కార్పాసమును రక్షించుటలో హుతాశనుఁడే. పర దుఃఖాగ్నులను శమింపజేయు వాయువు. వీని నెవనితోఁబోల్ప వలెను ? *

పరగుహ్యగుప్తినిపుణం
గుణమయమఖిలైః సమీహితం నితరామ్.
లలితామ్బరమివసజ్జన
మాఖవ ఇవ దూషయన్తి ఖలాః. 86

తా :- సత్పురుషులు లలితాంబరముల వంటివారు. వారు పరుల లోపములను గప్పి పుత్తురు. వారి జీవనము గుణాత్మకము ; అందరును వారిని గోరుదురు. అంబరము గూడ నిట్టిదే. దానిని ధరించినప్పుడు- మన మర్మముల నది గప్పిపుచ్చును. దాని స్వరూపమే గుణమయమైనది. అందరును దానిని వాంఛింతురు. కాని యెలుకలు వానిని నాశమొనర్చును. దుర్జను లెలుకలవంటివారు ! వారు సజ్జనుల నాగడముల పాలొనర్తురు.

యశఃసౌరభ్యలశునః
శాన్తిశైత్యహుతాశనః.
కారుణ్యకుసుమాకాశః
ఖలః సజ్జనదుఃఖదః. 87

తా :- దుష్టుడు - యశ స్సౌరభ్యములలో, నెజ్జగడ్డ వంటివాఁడు. శాంతి శైత్యమునకు వైశ్వానరుఁడు. కారుణ్య కుసుమముల కాకాశము వంటివాఁడు. వానికి సజ్జనుల నెప్పుడును నిందించుటయే పని.

---

* 'రక్షణ' 'శమన' శబ్దములకు విపరీత లక్షణచే 'నశింప చేయుట', "వృద్ధి పొందించుట" అని అర్థములు.

వి :- ఎట్టిగడ్డ నింద దుర్వాసనయే గదా! అట్లే ఖలుఁడార్జించి కొన్నది దుష్కీర్తియే. శాంతితో మనసు చల్లగా నుండును. ఆ శైత్యమునకు వాడు నిప్పు. దయ వాని పుట్టుకలోనే లేదు; ఆకాశమున గుసుమోద్గమ ముండదు గదా!

ర. గం :- రూపకాలంకారము.

ధత్తే భరం కుసుమపత్రఫలావలీనాం
ఘర్మవ్యథాం హరతి శీతభవాం రుజం చ.
యో దేహమర్పయతి చాన్యసుఖస్య హేతో
స్తస్మై వదాన్యగురవే తరవే నమోస్తు. 88

తా :- ఇతరుల కుపయోగపడు కుసుమ పత్ర ఫల భారములను వహించు చున్నది. ఎండ చేత యేర్పడిన వ్యధను హరించును. చలిచేత నేర్పడిన క్లేశము నణచును. ఇతరుల సుఖమునకై తన దేహమునే యర్పించును. మహా వృక్షము దాతల కెల్ల దాత. దానికి నమస్కారము.

హాలాహలం ఖలు పిపాసతి కౌతుకేన
కాలానలం పరిచుచుమ్బిషతి ప్రకామమ్.
వ్యాలాధిపం చ యతతే పరిరబ్ధుమద్ధా
యో దుర్జనం వశయితుం తనుతే మనీషామ్. 89

తా :- దుర్జనుని బాగుపరుప నెవ్వరికిని శక్యము గాదు. అది యశక్యము. అట్టి కార్యమునకుఁ బ్రయత్నించువాఁడు "దీని రుచి యెట్లుండునో జూత" మని, హాలాహలమును ద్రావ యత్నించువాఁడు. కాలానలమును ముద్దిడబోవువాఁడు. పన్నగేంద్రుని కౌగిలింపగడగువాఁడు.

ర. గం :- నిదర్శనాలంకారము.

దీనానామిహ పరిహాయ శుష్కసస్యా
న్యౌదార్యం ప్రకటయతో మహీధరేషు

ఔన్నత్యం విపులమవాప్య దుర్లభం స్వం
జ్ఞాతోయం జలధర తావకో వివేకః 90

తా:- ఓహో! జలధరమా! నీ వివేకము తెలియవచ్చినది. ఎండిన వారి పంట భూములను వదలితివి. అవి నీకై మొగము వాచి కృశించుచున్నవి. నీ యౌదార్యమును మహీధరములందు ప్రకటించుచున్నావు. నీవు గొప్పతనము నంది పొగరుబట్టితివి. నీ వివేకము తెలిసి వచ్చినది లెమ్ము.

వి:- ఔన్నత్యమనగా సంపదల తోడి గొప్పతనము; [illegible] నందుండుట.

అ. గం.:- అర్థాంతరన్యాసాలంకారము.

గిరయో గురవస్తేభ్యో
ఉర్వీ గుర్వీ తతోపి జగదణ్డమ్
ప్రలయేప్యచలా మహాత్మానః. (91)

తా:- కొండలు భారమైనవి; వానికన్నను భూమి; దానికన్నను జగదండము గురువు; అంతకంటె బరువైనవాఁడు మహా పురుషుఁడు. వాఁడు ప్రళయమందునుఁ జలింపఁడు.

అ. గం:- సారాలంకారము.

వ్యోమని బీజాకురుతే
చిత్రం నిర్మాతి యత్నతః సలిలే
స్నపయతి పవనం సలిలే
యస్తు ఖలే చరతి సత్కారమ్.

తా :- ఖలులయందు సత్కారమాచరించు వాని వెఱ్ఱివాఁడనవలెను; వాడు. గగనమున బీజారోపమొనర్చువాఁడు. నీటిపై చిత్రములు వ్రాయువాఁడు; జలములందు గాలిని తాన మాడింప యత్నించువాఁడు.

ర. గం :- నిదర్శనాలంకారము.

*హారం వక్షసి కేనాపి*
*దత్తమజ్ఞేన మర్కటః.*
*లేఢి జిఘ్రతి సంక్షిప్య*
*కరోత్యున్నతమాసనమ్.* 93

తా :- ఎవడో బుద్ధిహీను డొక్కడు - కోతి మెడలో హారము వేసినాఁడు. అది దానిని గొఱకును. వాసన జూచును. గుండుగా జుట్టి క్రింద వేసికొని దానిపై గూర్చుండును.

ర. గం :- అప్రస్తుత ప్రశంస.

*మలినేఽపి రాగపూర్ణాం*
*వికసితవదనామనల్పజల్పేపి.*
*త్వయి చపలేపి చ సరసాం*
*భ్రమర ః కథం వా సరోజినీం త్యజసి.* 94

తా :- ఓయీ ! భ్రమరా ! ఆ పద్మినీలతను వదలుటకు నీకెట్లు మనసొప్పెను ? నీవు మలినుడవైనను నీపై రాగమునే నింపికొన్నది; నీవు పిచ్చిగా వదరుచున్నను, వికసిత వదనముతో నిన్ను జూచుచునే యున్నది. నీవు చపలుఁడవు. కాని, ఆమె నీయందు రసావిష్ట.

వి :- ''మలినేఽపి'' మలినమైన చిత్త వృత్తి గలవాఁడు. తుమ్మెద నల్లగా నుండును గదా !

"రాగపూర్ణాం" = అనురాగముతోఁ గూడినది. ఎఱ్ఱదనముతోఁ గూడినది.

"వికసిత వదనాం" = నిరంతరము సంతోషముతో వికసించిన ముఖము గలది. పద్మము వికసించియే యుండును.

"చపలోఽపి" = చపలమైన చిత్తవృత్తి గలవాఁడు. వేయి వేయి పూవులపై వ్రాలువాఁడు.

"సరసాం" = సరసమైన ప్రవృత్తి గలది; తేనెలచేత గూడినది.

ర.గం :- సమాసోక్తి.

*స్వార్థం ధనాని ధనికాత్ ప్రతిగృహ్ణతో య*
*దాస్యం భజేన్మలినతాం కిమిదం విచిత్రమ్.*
*గృహ్ణన్ పరార్థమపి వారినిధేః పయోఽపి*
*మేఘోఽయమేతి సకలోఽపి చ కాలిమ* 95

తా :- స్వార్థమునకై ధనములను ధనికుల నుండి గ్రహించువాని ముఖము మలినమగును. ఇందులో నాశ్చర్య మేమున్నది? వారినిధినుండి మేఘము జలములను గ్రహించుచున్నది. తనకొరకు గాదు; పరార్థమునకు; దానితో నది కళాయుక్తమైనను, నలుపును బొందుచున్నది.

వి :- "సకలోఽపి" = కళాయుక్తమైనను. శరీరమాద్యంతమును; "కాలిమానం" 'ఇమనిచ్' ప్రత్యయాంతము. నలుపు వర్ణము.

*జనకః సానువిశేషో*
*జాతిః కాష్ఠం భుజఙ్గమైః స్సంగః.*
*స్వగుణైరేవ పటీరజ*
*యాతోఽసి తథాఽపి మహిమానమ్.* 96

తా :- ఓ! చందనమా! నీవు పుట్టినది సాను విశేషమున; నీ జాతి కాష్ఠము. నీ సంగము భుజంగములతో. అయిన నేమి! నీ గుణములతో గొప్పతనమును సాధించుకొన్నావు;

తస్మై హ స్త ఫలాయ సజ్జన గుణగ్రామార్జనే సజ్జసి
స్వాత్మోపస్కరణాయ చేన్మమ వచః పథ్యం సమాకర్ణయ.
యే భావా హృదయం హరన్తి నితరాం శోభాభరైః సంభృతా
స్తైరేవాస్య కలేబర స్స్వవపుషః పుష్టిర్దినం వర్తతే. 97

తా :- ఓయీ ! సజ్జనుడా! ఏ ఫలములను గోరి, నిరంతరము,సద్గుణములను సంపాదించుకొనుటకు వేకారుచున్నావు ? ఆత్మోపస్కారార్థమన్నచో - నిఁక జెప్పునదేమున్నది ? నీవు జీవించుటయే కష్టము. నాయనా ! యీ కాలములో మంచిజెడ్డలకుఁ తావు లేవు. ఏ భావమైనను సరే, ఎదుటి వాని హృదయము నాకర్షింపవలెను. అంతే. అట్టివానికి జీవనగ్రాసము దండిగా లభించును.

వి :- హితమైనది వేరు. ఉల్లాసమును గల్గించునది వేఱు; మనస్సున కుల్లాసము గల్గించున దంతయు హితకరముగా నుండనవసరములేదు. ఈ కాలమున హితమెవ్వరికి గాబట్టినది ? ఇతరులకు సంతోషమును గల్గించు వర్తనము, భావము గావలయు నంతే.

ర.గం :- ఇక్కడ చావ దలచినచో గుణప్రాప్తికై యత్నింపుము - అని వస్తువు వ్యంగ్యము. కాని యిది వాచ్యమునకన్నను యెక్కువ సుందరమైనదిగాదు. కనుక గుణీభూత వ్యంగ్యము. వాచ్యార్థమున కన్నను తక్కువ యందముగల వ్యంగ్యమునకు గుణీభూత వ్యంగ్యమని పేరు.

భిన్నా మహాగిరిశిలాః కరజాగ్రజాగ్ర
దుద్దామశౌర్యనికరైః కరటిభ్రమేణ.
దైవే పరాచి కరిణామరిణా తథాపి
కుత్రాపి నాఽఽపి ఖలు హా పిశితస్య లేశః. 98

* ''స్తైరేవాస్య కలేః కలేబరపుషో దైనందినం వర్తనమ్'' అని రసగంగాధరములో నున్న పాఠము. తృతీయపాదములోని 'భావాః' అనుదానికి పదార్థములని అర్థము. ''ఏ పదార్థములు శోభాసమంచితములై మనోహరములుగ నుండునో వాటినే ఈ కలి ప్రతిదినము తనపొట్టఁబెట్టుకొనుచుండును.'' అనగా ఈకలి యుగమున, సద్గుణవంతులపైననే దురాత్ములు దురాక్రమణ చేయుచుందురు. అందుచేత కొంతకాలము జీవింపదలచినచో సజ్జనుడుగ ఉండుటమంచిది కాదు అని భావము.

తా :- సింహ మాకలి గొన్నది; ఏనుగు అను భ్రాంతితో సమీప మందలి గండశిలలను గోళ్ళతో బరికి బరికి వేసారుచున్నది. ఏమి ప్రయోజనము ? దైవ మనుకూలముగా లేదు. మాంసలేశ మైనను లభింపలేదు.

వి :- 'కరజాగ్ర. ..నికరైః" ఇది యొక దీక్షా సమానము. శాబ్దికమైన యకాండతాండవము.

*గర్జితమాకర్ణ్యా మనా*
*గఙ్కే మాతుర్నిశార్ధజాతోపి.*
*హరిశిశురుత్పతితుం ద్రా*
*గఙ్గాన్యాకుఞ్చ్య లీయతే నిభృతమ్.* 99

తా :- మేఘ గర్జనము వినవచ్చినది. సింహకిశోరము సగము రాత్రియందే జన్మించినది. అయినను దానికి నెగురవలెనని యాశ. అంగములు ముడిచికొని యెగుర నుంకించి చేతగాక మరల నూరక పండుకొన్నది.

*కిం తీర్థం? హరిపాదపద్మభజనం; కిం రత్నమచ్ఛా మతిః*
*కిం శాస్త్రం? శ్రవణేన యస్య గలతి ద్వైతాన్ధకారోదయః.*
*కిం మిత్రం? సతతోపకారరసికం తత్త్వావబోధః సఖే*
*కః శత్రుర్వద? ఖేదదానకుశలో దుర్వాసనాసఞ్చయః.* 100

తా :- తీర్థమనగా నేమి ? హరిపాద పద్మ భజనమే ! అనర్ఘ రత్న మేది ? స్వచ్ఛమైన బుద్ధి శాస్త్రమేది ? దేనిని వినుటచే ద్వైతబుద్ధియను నంధకారము నశించుచున్నదో యది. మిత్రుడెవడు ? సతతోపకార రసికమైన తత్త్వావబోధమే. శత్రువెవ్వడు ? పరమాత్మతోఁ దనకు భిన్నతను గల్పించు దుర్వాసనా సంచయమే !

ర.గం :- పరిసంఖ్యాలంకారము.

---

* 'ఖేదదానకుశలః' అని కూడ పాఠము.



# శృంగార సముల్లాసము

*న మనాగపి రాహురోషశఙ్కా*
*న కలఙ్కానుగమో న పాణ్డుభావః.*
*ఉపచీయత ఏవ కాఽపి శోభా*
*పరితో భామిని ! తే ముఖస్య నిత్యమ్.* 1

తా :- ఎన్నఁడును రాహుదోషమేర్పడునను శంక లేదు. కళంకానుగమము లేదు. పాండుభావము లేదు. సతతమును శోభ పెరుగుటయేగాని తరుగుట లేదు; భామినీ ! నీ ముఖము విలక్షణమైనది.

వి :- నీ ముఖమున కే దోషములు బొత్తిగా లేవనుచున్నాఁడు. ఉపమానమునకన్నను ఉపమేయమున కాధిక్యముతోఁ బ్రతీపాలంకారము.

ర.గం. :— జగన్నాథుఁడు రసగంగాధరములో వ్యతిరేకాలంకారధ్వనికి దీని నుదాహరణ మిచ్చినాఁడు.

*నితరాం పరుషా సరోజమాలా*
*న మృణాలాని విచార పేశలాని.*
*యది కోమలతా తవాఙ్గకానా*
*మథ కా నామ కథాఽపి పల్లవానామ్.* 2

తా :- నీ యంగముల కోమలతను విచారించి నపుడు-సరోజమాల పరుషముగాఁ గన్పడును; మృణాళములు విశాల పేశలములు గావు; ఇఁక పల్లవముల కథ యేమున్నది ?

వి :- ''అంగకాని'' = బాల్యము దాటి ముగ్ధా వయస్సులో నున్న వన్నమాట.

ర. గం :- మాధుర్య గుణమున కిది యుదాహరణము. సంయోగ పరములైన హ్రస్వములుగాక వేరు వర్ణములు గూడిన పదములు విడి విడిగా నుండుట మాధుర్యము. అప్రస్తుత ప్రశంస కిది యుదాహరణముగా నీయఁబడినది.

*స్వేదామ్బుసాంద్రకణశాలికపోలపాలీ*
*దోలాయితశ్రవణకుణ్డలవన్దనీయా.*

అనన్దమజ్కురయతి స్మరణేన కాఽపి
రమ్యా దశా మనసి మే మదిరేక్షణాయాః. 3

తా :- కపోలములను స్వేదకణము లావరించినవి; శ్రవణకుండలములా కపోలములపై డోలాయిత మొనర్చుచున్నవి. మదిరేక్షణ యొక్క రమ్యమైన యా దశఁ దలచి కొన్నపుడు ఆ తలపే యెంతయో యానందమును గల్గించును.

ర.గం :- సుకుమారత కుదాహరణము. పరుషములుగాని వర్ణములతోడి కూర్పు సుకుమారత.

కస్తూరికాతిలకమాలి నిధాయ సాయం
స్మేరాననా సపది శీలయ సౌధమౌలిమ్.
ప్రౌఢిం భజన్తు కుముదాని ముదా ముదారా
ముల్లాసయంతు పరితో హరితో ముఖాని. 4

తా :- సాయంకాలమైనది. నీవు ముఖమున కస్తూరికా తిలకమును దిద్దితివి. స్మేరాననముతో మేడ నెక్కుము. నిన్ను జూచి కుముదములు వికసించి సంతోష ప్రౌఢిని వెలార్చుగాక; దిఙ్ముఖము లుల్లాసమును బూనుగాక !

వి :- "స్మేరాననా" = స్మేరమే యాననమైనని; అనగా చిరునవ్వుల కాంతి ముఖమంతయు వ్యాపించినదని యర్థము. కస్తూరికాతిలకము చంద్రునిలో నున్న కళంకము వంటిది; చిరునవ్వులు వెన్నెలలు; నీ ముఖమే చంద్రుడని ధ్వని; కుముదములకును, దిక్కులకును, తద్వదనము చంద్రుడని భ్రాంతి.

ర.గం :- ధ్వన్యాత్మభూతమైన శృంగారమునందు యమకాది నిబంధనముశక్తియున్నను గూర్చుట ప్రమాదము. విప్రలంభమునందు మరియు ప్రమాదము. కాని యీ యనుప్రాసాదులు లేశమును క్లేశమును గలిగించక, స్వతంత్రముగా విస్తరించియుండక రసాదులకన్న వేఱుగా భావింపఁబడకుండెనేని యందమే ? అప్పుడు రసచర్వణలోనే ఇవి సుఖముగా గోచరింప వీలగును గదా ! రస విరోధిగాని అనుప్రాసమునకు, యీ శ్లోక ముదాహరింపఁబడినది.

తన్మఞ్జు మన్దహసితం శ్వసితాని తాని
సా వై కలఙ్కవిధురా మధురాననశ్రీః.
అద్యాపి మే హృదయమున్మదయన్తి హన్త
సాయన్తనామ్బుజసహోదరలోచనాయాః. 5

తా :- సాయంకాలమందలి యంబుజముల సహోదరములైన లోచనములామెవి. ఆ మంజు మందహసితము ఆ నిశ్వసితములు, కళంకవిధురమైన యా ముఖశోభ యిప్పటికి, నితలచుకొన్నపుడెల్ల నా హృదయమున నున్మాదమును రేపుచున్నది.

వి :- ''తన్మంజు మన్ద హసితం'' = ''శ్వసితానితాని'', ''సావై... శ్రీః'' = వీనిలోని తచ్ఛబ్దములు ధ్వని పరిపుష్టములు.

''హన్త'' = సంతోషమును, ఆశ్చర్యమును, ఆవేదనను గూడ దెల్పుచున్నది; ఈ శబ్దముకూడ ధ్వని పూర్ణమైనదే! సాయంకాలములందంబుజము నిమీలనోన్ముఖము. కుముదము వికసనోన్ముఖము. ఇచటి ''అంబుజ'' శబ్దము రూఢి యౌగికార్థములతో రెంటిని దెల్పుచున్నది. వీనితో నాయిక యొక్కయవస్థాభేద మేర్పడు చున్నది. తక్కిన విచారము సహృదయులకే వదలివేతును.

ర.గం :- రసధ్వని యని చెప్పవచ్చు ననుచు స్మృతి ధ్వని యనుచున్నాడు. సంస్కారజన్య మగు జ్ఞానము స్మృతి; విశిష్టమైన చింతన మీశ్లోకమందు విభావము. కను బొమ్మలు పైకెత్తుట, దేహము కదలకుండుట, మొదలగు అనుభావములు, ఆక్షేపకములు; ఇచట నీ స్మృతి సంచారి భావము. నాయిక విభావము. ''హన్త'' అను పదముచేఁ దోచు హృదయ వైకల్యము అనుభావము. వీని చేరిక వలన విప్రలంభ శృంగార రసము వ్యక్తమగును. కనుక రసధ్వని యన్నాడు. కాని మున్ముందు స్మృతియేఁ దోచుట చేతను, చమత్కారజనక మగుటచేతను, స్మృతిధ్వనియని వివరించినాఁడు.

ప్రాతస్తరాం ప్రణమనే విహితే గురూణా
మాకర్ణ్య వాచమమలాం భవ పుత్రిణీతి.

*రేదీయసి ప్రియతమే పరమప్రమోద*
*పూర్ణాదరం దయితయా దధిరే దృగన్తాః.* 6

తా :- ఒక నాయిక ప్రాతః కాలమందు అత్త మామలకుఁగాని, తల్లి దండ్రులకుఁగాని నమస్కరించుచున్నది; వారు "పుత్రవంతురాల వగుదువు గాక" యని యాశీర్వదించిరి. అప్పుడు మగఁడు సమీపముననే యున్నాఁడు. వాని వైపామె పరమ ప్రమోద పూర్ణాదరముగ దృగంతములఁ బరపినది.

వి :- "పరమ ప్రమోద పూర్ణాదరం" = ఈ సమాసము క్రియా విశేషణమై శ్రవణ పేయముగనే యున్నది. కాని ధ్వని యొక్క రామణీయ కతను దగ్గించుచున్నది.

*గురుజనభయమద్విలోకనాన్తః-*
*సముదయదాకులభావమావహన్త్యాః.*
*దరదలదరవిన్దసున్దరం హా!*
*హరిణదృశో నయనం న విస్మరామి.* 7

తా :- వానివైపుఁ జూడ వలెనని యామె యిచ్ఛ కాని గురు జను లున్నారు; వారి దగ్గర నామెకు జంకు; అందుచే వాని వైపుఁ జూచి చూడక ఆకుల భావమును వహించుచున్నదామె. ఆమె నేత్రము యీషద్దళిత అరవిందసుందరమై యున్నది. అట్టి యా నేత్రమును మరువ జాలను.

వి :- "దర దళత్" = అప్పుడప్పుడే విచ్చి కొనుచున్న యని యర్థము.

ర. గం :- ఉపమాలంకారము. "దరదళవిందము" - ఉపమాన వాచకము. సామాన్య వాచకమగు సుందర శబ్దములో సమాసమున దోచు నుపమ సకల వాక్యార్థమైన విప్రలంభ శృంగారము యొక్క స్మృతిని ఉపస్కరించును. కనుక నలంకారమే! ఇక్కడ స్మృతి ప్రధానముగా ధ్వనించు చున్నదని పూర్వ పక్షము. "న విస్మరామి-" యని స్మృతిని నిషేధించి నాఁడని సిద్ధాంతము.

బదరామలకామ్రదాడిమానా
మపహృత్య శ్రియమున్నతాం క్రమేణ.
అధునా హరణే కుచౌ యతేతే
దయితే ! తే కరిశాబకుమ్భలక్ష్మ్యాః. 8

తా :- ఓసీ ! దయితా ! నీ స్తన మండలము క్రమ క్రమముగా బదర - ఆమలక - ఆమ్ర - దాడిమముల శోభను హరించినది. ఇప్పుడు కరిశాబ కుంభ లక్ష్మిని హరించుటకు ప్రయత్నించు చున్నది.

కపోల పాలిం తవ తన్వి ! మన్యే
లావణ్యధన్యే ! దిశముత్తరాఖ్యామ్.
విభాతి యస్యాం లలితాలకాయాం
మనోహరా వై శ్రవణస్య లక్ష్మీః. 9

తా :- ఓసీ ! లావణ్య ధన్యా ! తన్వీ ! నీ కపోల పాలి యుత్తర దిక్కుగాఁ గాబోలు ! లలితాలకాజుష్టమైన దానియందు మనోహరమైన వై శ్రవణ లక్ష్మి శోభించు చున్నది.

వి :- అనగా పరమసౌభాగ్యవతి వన్న మాట.

నీవిం నియమ్య శిథిలాముషసి ప్రకాశ
మాలోక్య వారిజదృశః శయనం జిహాసోః.
నైవాపరోహతి కదాపి చ మానసాన్మే
నాభేః ప్రభా సరసిజోదరసోదరాయాః. 10

తా :- తెల్ల వారినది. ఆమె పాన్పు వీడి లేవఁ బోవుచున్నది; జారిన కోక ముడిని బిగించికొనుచున్నది. ఆమె నాభిమండలము సరసిజోదర సోదరముగా నున్నది. ఆ శోభ మనసు నుండి తొలగి పోవుట లేదనుచున్నాఁడు.

వి :- "సరసి జోదరసోదర" = చక్కని కూర్పు.

ర. గం :— ఉపమాలంకారము. ఈ యలంకారము సాధారణముగా 'ఇవ'-'యథా' - యిత్యాది శబ్దములచేఁ జెప్పఁబడుచున్నది. ఇక్కడ 'సోదర' శబ్దము చేత సదృశము లక్షిత మగును. ఒక తల్లి కడుపున పుట్టుట యను రూపముఁగల ముఖ్యార్థము బాధితము గదా ! అందుచే తదీయశోభాలక్షణ సమానాంశహారత్వ మను ప్రయోజన ముండుట వలన 'సోదర' శబ్దము చేత సదృశమే లక్షిత మని సిద్ధాంతము. ఈ తీరుగనే 'ప్రతిభట' - 'ప్రతిమల్లాది'- శబ్దములు.

*ఆలీషు కేళీరభసేన బాలా*
*ముహుర్మమాలాపముపాలపన్తీ.*
*ఆరాదుపాకర్ణ్య గిరం మదీయాం*
*సౌదామినీయాం సుషమామయాసీత్.* 11

తా :- ఆబాల సకియలతోఁ గేళీ పరత నున్నది. ఆ యాటలలో మాటికిని నాకు సంబంధించిన మాటలే వచ్చు చున్నవి. ఇంతలో సమీపమునందు నా మాటలు వినబడినవి. అమె సౌదామినీ కాంతి విశేషమును దాల్చినది.

వి :— "సుషమ" = "సుషమా పరమా శోభా = " యని యమరము. గొప్ప కాంతి విశేష మన్నమాట.

"సౌదామినీయాం" = సౌదామిని యనఁగా మెఱపు.

"సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం" = సౌదామినికి సంబంధించినది సౌదామినీయ; తద్ధిత ప్రత్యయము.

ర. గం :- త్రాసమున కుదాహరణము. మగడు తన మాటలను వినెనని చిన్నది పరువెత్తినది. వినుట విభావము. పరుగెత్తుట అనుభావము. ఈ శ్లోకములో సిగ్గు దోచునని చెప్పరాదు. చిన్నతనము గదా! అందుచేత త్రాసమే యేర్పడినది.

*ముధైవ మన్తుం పరికల్ప్య గన్తుం*
*మృషైవ రోషాదుపజల్పతో మే.*

*ఉదశ్రుచఞ్చన్నయనానతాఙ్గీ*
*గిరం న కాం కామురరీకరోతి.* 12

తా :- ఆమె యందుఁ గావలిసి యొక దోషమును గల్పించి మృషా రోషముతో, నేను వెడలిపోదు నన్నాను; ఇంకేమున్నది; ఆమెకు కన్నులలో గన్నీరుబికికొని వచ్చినది. వెంటనే నేను చెప్పిన యే యే మాట నామె యొప్పు కొనలేదు.

వి :- ''మంతుః'' = దోషము.
''ఆగోపరాధో మంతుశ్చ''= అమరము.

''ఉద్గత-అశ్రువులు = ఉదశ్రువులు'' = ఉదశ్రువులచేత ప్రకాశించుచున్న నయనములు గలది.

''నతాంగి'' = సనభారముచే వంగిన శరీరము గలదనుట.

*తదవధి కుశలీ పురాణశాస్త్ర*
*వివేకః.*
*యదవధి న పదం దధాతి చిత్తే*
*హరిణకిశోరదృశో దృశోర్విలాసః.* 13

తా :- చిన్న వయస్సులో నున్న జింకయొక్క కను చూపుల వంటి యామె చూపుల విలాస మెంత వరకు మనసున సాక్షాత్కరింపదో, అంత వరకును, పురాణములు- శాస్త్రములు- స్మృతులు, వీని చేత జనించిన వివేకము నకు క్షేమమే! ఆమె తలపునకు వచ్చినపుడివి యన్నియు జారిపోవునన్నమాట!

రం. గం:- కామినీ దృగ్విలాసము మనసున నడుగు పెట్టినది. ఇఁక వివేకమునకు కుశలము లేదు. ఇది యొక వస్తువు. కాని దృగ్విలాస కర్తృకమైన పదార్పణము లోకసిద్ధముగాదు. కనుక కవి ప్రౌఢోక్తి నిష్పన్నము. అది బాగుగా నడుగు పెట్టగా కుశలము యొక్క యూసెక్కడున్నదని వస్తువు ధ్వనించు చున్నది. ఇది ఒక వస్తువు చేత మరియొక వస్తువు ధ్వనించుట కుదాహరణము.

అగతః ప    ం జనైః
ప్రణ్యాతీ చకితమేత్య దేహలీమ్.
కౌముదీవ శిశిరీకరిష్యతే
లోచనే మమ కదా మృగేక్షణా. 14

తా :- మగడు వచ్చె నన్న మాటలు చుట్టు నున్న జనులు బల్కఁగా దానిని విని చకితముగాఁ గడపవరకు వచ్చి యా మృగేక్షణ యెప్పుడు నా కన్నులను వెన్నెల వలెఁ జల్లఁ జేయునో గదా!

వి :- "శిశిరీకరిష్యతి" = ప్రౌఢ మైన క్రియాపదము. "చకితమ్" = క్రియావిశేషణము.

ర.గం :- ఉపమాలంకారము.

అవధౌ దివసావసానకాలే
భవనద్వారి విలోచనే దధానా.
అవలోక్య సమాగతం తదా మా
మథ రామా వికసన్ముఖీ బభూవ. 15

తా :- సాయంకాల మైనది. నే నింటికి వత్తు నను నాశతో యింటి తల్పులకు చూపు లప్పగించి చూచుచున్నది. ఇంతలో నేనుఁ బోయితిని. నన్ను జూచి యామె మొగ మంతయు వికసించినది.

ర. గం :- హర్షమున కుదాహరణము. అవధికాలమున ప్రియుఁడు వచ్చుట విభావము; మొగము విప్పారు టనుభావము.

వక్షోజాగ్రం పాణినాస్పృశ్య దూరం
యాతస్యాద్రాగాననాబ్జం ప్రియస్య
శోణాగ్రాభ్యాం భామినీ లోచనాభ్యాం
జోషం జోషం జోషమేవావతస్థే. 16

తా :- స్తనమండలము స్పృశించి దూరముగఁ దొలగిపోయిన ప్రియుని ఆమె శోణాగ్రము లైన లోచనములతోఁ బుల్కు బుల్కునఁ జూచుచు నిలిచినది.

ర.గం :- రసధ్వని సందర్భములో నీ శ్లోక ముదాహరింపఁబడినది.

*గురుభిః పరివేష్టితాపి గణ్డ*
*స్థలకణ్డూయనచారుకైతవేన.*
*దరదర్శిత హేమబాహునాళా*
*మయి బాలా నయనాఞ్చలం చకార.* 17

తా :- గురుజనులు చుట్టు నున్నారు. అందుచే నామె ప్రియుని జూడ నొక నెపమును వెదకి కొన్నది. గండస్థలకండూయన మామె వ్యాజము. ఆ కైతవముతో యీషద్దర్శిత హేమబాహునాళయై నయనాంచలమును ప్రియునిపై సారించినది.

*గురుమధ్యగతా మయా నతాఙ్గీ*
*నిహతా నీరజకోరకేణ మన్దమ్.*
*దరకుణ్డలతాణ్డవం నతభ్రూ*
*లతికం మామవలోక్య ఘూర్ణితాసీత్* 18

తా :- ఆమె గురు మధ్యగత; నతాంగి; నీరజకోరకముచే మెల్లగా నే నామెను దాడించితిని. ఆవిడ దరకుండల తాండవముగా నతభ్రూలతికముగా ననుఁ జూచి ఘూర్ణమాన యైనది.

వి :- ''దరకుండల తాండవమ్'' = "నతభ్రూలతికమ్'' = రెండును క్రియావిశేషణములే !

ర.గం :- భావమున కుదాహరణముగ నీ శ్లోక మీయబడెను. ఇచ్చట ''ఘూర్ణమాన మైనది''-యని యిచ్చుటచే ముందు వెనుక లాలోచింపక యెంత

తగని పని చేసితివి ?-అను నర్థముతో గలిసిన యమర్షము. అస్వాద పర్యవసానము గనుక ప్రధానముగ నదియే వ్యంగ్యము

*వినయే నయనారుణప్రసారాః*
*ప్రణతౌ హస్తః నిరన్తరాశ్రుధారాః.*
*అయి జీవితసంశయః ప్రయాణే*
*న హి జానే హరిణాక్షి! కేన తుష్యేః.* 19

తా :- వినయమును జూపింప నయనారుణ ప్రసారములు; నమస్కరింప నిరంతరాశ్రుధార; ప్రయాణమును బూనగా జీవిత సంశయము: హరిణాక్షీ! నిన్ను నే నెట్లు సంతోష పెట్టవలెనో దెలియుట లేదు.

వి :- నాయిక కుపిత. ఆమె మనస్సులో భావశబలత.

*అకరుణ మృషాభాషాసిన్ధో! విముఞ్చ మమాఞ్చలం*
*తవ పరిచితః స్నేహః సమ్యఙ్మయేత్యభిధాయినీమ్.*
*అవిరళగళద్బాష్పాం తన్వీం నిరస్తవిభూషణాం*
*క ఇహ భవతీం భద్రే! నిద్రే! వినా వినివేదయేత్.* 20

తా :- ''ఓయీ! అబద్ధముల నల్లి చెప్పుటలో సముద్రుని వంటి వాఁడవు! నా కొంగు వదలుము. నీకు నాయందు గల స్నేహము దెలిసి వచ్చినది.'' అని యొకటే యేడ్చుట. సొమ్ములు దీసి వేసినది. ఇఁక నామె నోదార్చు టెట్లు? ఓదార్చు వారెవ్వరు? ఓ సీ! నిద్రా! నీవే దిక్కు. ''ఇట్టి నా ప్రియురాలిని నీవు దక్క నెవ్వరుఁ జూపింతురు?''

ర. గం :- ఇక్కడ నిద్ర తన కుపకార మొనర్చె నని యొక వస్తువు. విప్రలంభ శృంగారము. ఈ రెండును ధ్వనించును. కాని మున్ముందుగా స్వప్నమే స్ఫురించును గనుక స్వప్న ధ్వనియేఁ ప్రధానము.

*తీరే తరుణ్యా వదనం సహాసం*
*నీరే సరోజం చ మిలద్వికాసమ్.*

ఆలోక్య భావత్యుభయేత్ర ముగ్ధా
మరన్దలుబ్ధాలికిశోరమాలా. 21

తా:- ఒకానొక తరుణి యొక సరస్సుయొక్క గట్టునందు గూర్చొని యున్నది. ఆమె వదనముపై జిరునవ్వు. చిరునవ్వుతోఁ గూడిన యామె మొగము పద్మమువలె నున్నది. సరసి నీరమందు నిజమైన పద్మ మున్నది. అది చిరునవ్వుతో గూడిన పడతియొక్క మొగమువలెనే యున్నది. తుమ్మెదలకు తేనె వలయును గదా! ఈ కనపడు చున్న రెంటిలో నేది పద్మ మని వాని సందేహము. అందువలన ఇరు వైపులకును మార్చి-మార్చి బరువెత్తుచున్నవి. నిజమైన పద్మమును జూచినపుడు అది పద్మము గాదు, తీరమున కన్పడుచున్నదే పద్మ మని వానికి భ్రాంతి; అక్కడికిఁ బోయి చూచినప్పుడు సరస్సునం దున్నదే నిజమైన పద్మ మని భావన; అందుచే అక్క డిక్కడికి ఆసు వలె దిరుగు చున్నవి. భోజప్రబంధములో శూర్పణఖను భోజు డిట్లే వర్ణించెను. లక్ష్మణుని కడ కేగి యక్కడినుండి జూచినప్పు డతనికన్నను రాముఁడందగాడుగా గన్పించును; ఆమె రాముని వైపునకు బర్విడి వచ్చును. ఇక్కడినుండి జూచి నప్పుడు లక్ష్మణుడు సుందరుఁడుగా గన్పించును; మరల నక్కడికి బడబారును ఇట్లు—

"ఉభయకూలసమస్థితశాద్వల
క్రమగతాగతభిన్నగవీ దశాం" —

ఒక యేటి కిరు గట్టుల యందును పచ్చని గడ్డి యున్నది. ఒకవైపు నుండి జూచినపుడు ఆవతలి వైపు నున్న గడ్డి చాల పచ్చగాఁ గన్పడును. అచటినుండి చూచిన మొదటిదే పచ్చగా నుండును. దీనిచేత భ్రమసి అక్క డిక్కడికి దిరుగుచున్న నావు వలె నున్నదట శూర్పణఖస్థితి.

రంగం:- ఇక్కడ, సహాసమైన వదన మొక వస్తువు. జలములంచలి సరోజ మొక వస్తువు. వీనిలో కమల మేదని భ్రమరములకు సందేహము. ఆ సంశయమే వ్యంగ్యము. సందేహాలంకార వ్యంగ్యమున కిది మచ్చు.

వీక్ష్య పక్షసి-వి పక్షకామినీ
హారలక్ష్మ దయితస్య భామినీ.

*అంసదేశవినివేశితాం క్షణా*
*దావకర్ష నిజబాహువల్లరీమ్.* 22

తా :- ప్రియుని యెదపైన సవతి యొక్క హార మొత్తుకొనిన గుర్తు లున్నవి. దానిని జూచి యీవిడకు కోపము వచ్చెను. వాని యంస దేశమం దుంచిన తన బాహువల్లరిని లాగి కొన్నది.

ర. గ:- రసధ్వనిలో భావోదయమున కిది యుదాహరణము. ప్రియుని రొమ్మున సవతి హారము గుర్తును చూచుట విభావము. వాని మెడను జుట్టి యున్న తన బాహులతను దీసివేయు టనుభావము. రోషోదయము వ్యంగ్యము.

*దరానమత్కంధరబంధమీష*
*న్నిమీలితస్నిగ్ధవిలోచనాబ్జమ్.*
*అనల్పనిశ్వాసభరాలసాంగం*
*స్మరామి సంగం చిరమంగనాయాః.* 23

తా :- దరాన మత్కంధరమై, ఈషన్నిమీలితస్నిగ్ధవిలోచనాబ్జమై, అనల్ప నిశ్వాస భరాల సాంగమై, హృదయ మాకర్షించు నంగనాంగ సంగమమును స్మరింతును.

ర. గం :- రసధ్వనిలో భావమున కుదాహరణము.

*రోషావేశాన్నిర్గతం యామయుగ్మా*
*దేత్య ద్వారం కాంచిదాశ్యాం గృహ స్తమ్.*
*మామాజ్ఞాయైవాయయౌ కాతరాక్షీ*
*మనం మన్దం మన్దిరాదిన్దిరేవ.* 24

తా :- నేను రోషముతో నిర్గమించితిని. మరల రెండు యామము లకు దిరిగి వచ్చినాను. మొగసాలలో దాసి యున్నది. దానితో మాటలాడు

చున్నాను. నా పల్కు సవ్వడి దెలిసి మెల్ల మెల్లగా నామె గృహాంతర్భాగము నుండి యిందిర వలె బయటికి వచ్చినది.

వి :- "కాతరాక్షి!" = వీడు వెడలి పోయినాఁడు. వచ్చునో రాఁడో యను భయ మామె కన్నులయందు స్పష్టముగ గన్పించు చున్న దన్న మాట.

*హృదయే కృతశైవలానుషఙ్గా*
*ముహురఙ్గాని యతస్తతః క్షిపన్తీ.*
*ప్రియనామపరే ముఖే సఖీనా*
*మతిదీనామియమాదధాతి దృష్టిమ్.* **25**

తా :- నాయిక ప్రియవిరహముతో బాధ పడుచుండెను. చెలికత్తెలు శైత్యోపచారము లొనర్చినారు. చల్లగా నుండుట కెదపై నీచి పాచి నుంచిరి. చుట్టుజేరిన చెలికత్తెలు ప్రియుని గూర్చిన గాథలే జెప్పికొనుచున్నారు. ఆమె పడకపై నిలిచిన చోట నిలువదు. ప్రియు వార్తలు జెప్పికొనుచున్న చెలులపై దీన దీనమైన దృష్టిని సారించుచున్నది.

రం. గం:- ఇది గూడ రసధ్వని ఘట్టములోనిదే. ప్రియుని విరహము విభావము. చేతులు, కాళ్ళు, మొదలగునవి అటు నిటు కొట్టుకొను టనుభావము.

*ఇత ఏవ నిజాలయం గతాయా*
*వనితాయా గురుభిః సమావృతాయాః.*
*పరివర్తితకంధరం నతభ్రు*
*స్మయమానం వదనామ్బుజం స్మరామి.* **26**

తా :- ఆమె యిచటి నుండియే నిజాలయమునకు వెళ్ళినది. అక్కడఁ బెద్దలచే సమావృత యైనది. కాని నన్ను మెడ మలఁపి చూచుచున్నది. పరివర్తిత కంధరమై నతభ్రూయుగ్మమై స్మయమాన మైన యామె వదనాంబుజమును స్మరింతును.

రం. గ :- స్మరణాలంకార చర్చలోని కీ శ్లోకము వచ్చును. ఇక్కడ స్మరణము చింతోద్బుద్ధ సంస్కార ప్రయోజ్యమైనందుచే నలంకారము గాదు. వ్యంగ్యత్వము లేదు గనుక భావము గాదు. మరి మేమి? వస్తు మాత్ర మని పండితుని యభిప్రాయము.

కథయ కథమివాశా ధాయరాం జీవితే మే
మలయ భుజగవాన్తా వా న్తి వాతాః కృతాన్తాః.
అయమపి ఖలు గుఞ్జన్మఞ్జు మాకన్దమౌళౌ
చులుకయతి మదీయాం చేతనాం చఞ్చరీకః. 27

తా:- నాకు జీవితముపై నాశ యెట్లుండునో దెల్పుము. మలయ భుజగ వాంతములై వాతములు వీచుచున్నవి. అవి నా పాలికి కృతాంత స్వరూపములు. ఈ చంచరీక మేమి చెప్పుదును? అది కూడ మాకందమౌళి యందు మధురముగ ఝుంకరించుచు నా జీవితము నాపోశనము జేయుచున్నది.

రం. గం:- సమాధ్యలంకారచర్చలో నిది వచ్చును. ఇచ్చట సమాధ్య లంకారము సంభవింప దని పండితుల యభిప్రాయము.

నిరుధ్య యాన్తీం తరసా కపోతీం
కూజత్కపోతస్య పురో దధానే.
మయి స్మితార్ద్రం వదనారవిన్దం
సా మన్ద మన్దం నమయాంబభూవ. 28

తా :– ఆడు పావురము మగ పావురము నుండి దూరముగఁ బోయెను. దానిని బట్టి మరల కూజత్కపోతము దగ్గర నుంచితిని. అపు డావిడ నావైపు స్మితార్ద్ర మైన వదనారవిందమును వ్రాల్చి చూచినది.

ర. గం :– రసధ్వని ఘట్టములో దీనిని లజ్జ కుదాహరణముగా నిచ్చినాఁడు.

తిమిరం హరన్తి హరితాం పురః స్థితం
తిరయన్తి తాపమథ తాపశాలినామ్.

*వదనత్విష స్తవ చకోరలోచనే!*
*పరిముద్రయన్తి సరసీరుహశ్రియః.* 29

తా :- చకోరలోచనా! పురస్థితమై దిక్కుల తిమిరము లడంచుచున్నది. తాపముచేఁ గుందువారి తాపము బోకార్చుచున్నది. సరసీరుహములయొక్క కాంతిని ముకుళీభవింప జేయుచున్నది. నీ వదనకాంతిపుంజము నేమని జెప్పుదును ?

ర. గం :- రూపకాలంకారసందర్భములో నీ శ్లోక మున్నది. ముఖము చంద్రుఁ డని యిచట గమ్యమానము. వాచ్యముగా లేదు గనుక నలంకారము గాదు.

*కుచకలశయుగాన్త ర్మామకీనం నఖాఙ్కం*
*సపులకతను మన్దం మన్దమాలోకమానా.*
*వినిహితవదనం మాం వీక్ష్య బాలా గవాక్షే*
*చకితనతనతాఙ్గీ సద్మ సద్యో వివేశ.* 30

తా :- కుచకలశయుగాంతర్నిహితము లైన నఖాంకములు పులక రించిన తనువుతో మెల్లగాఁ జూచికొను చుండెను. గవాక్ష వినిహితవదను డైన నన్ను జూచి, చకితనతనతాంగియై, వెంటనే సద్మమును బ్రవేశించినది.

ర. గం :- రసధ్వని ఘట్టమందు, లజ్జ కుదాహరణముగా నీ శ్లోక మీయఁ బడినది.

*విధాయ సా మద్వదనానుకూలం*
*కపోలమూలం హృదయే శయానా.*
*తన్వీ తదానీ మతులాం బలారేః*
*సామ్రాజ్యలక్ష్మీమధరీచకార.* 31

తా ;- ఆమె మద్వదనాఽనుకూలముగఁ దన కపోల మునిచి నా హృదయమందు శయనించినదై, బలారి యొక్క సామ్రాజ్యలక్ష్మి నధరీక రించినది.

ర. గం :- ఇదియును రసధ్వనిఘట్టమందలి శ్లోకమే. క్రమ కుదాహరణము.

ముహురర్థితయాద్య నిద్రయా మే
బత యామే చరమే నివేదితాయాః.
చిబుకం సుదృశో మృశామి యావత్
మయి తావన్మిహిరోఽపి నిర్దయోఽభూత్. 32

తా:- నేను ప్రార్థింపగా ప్రార్థింపగా నిద్ర ఆమెను రాత్రి చరమ యామమున చూపించినది. నే నామె చుబుకమును బుడుకుచునే యున్నాను. ఇంతలో సూర్యుఁడు గూడ నాపై నిర్దయుఁ డయ్యెను.

శ్రుతిశతమపి భూయః శీలితం భారతం వా
విరచయతి తథా నో హన్త! సన్తాపశాన్తిమ్.
అయి! సపది యథాఽయం కేలివిశ్రాన్తికాన్తా
వదనకమలనిర్యాత్కాంతిసాంద్రో నకారః. 33

తా:- శ్రుతి శతములను మరల మరల వివేకించితిని. భారతమునుఁ బలుమారు జదివితిని. కాని యవి యేవియు కేలివిశ్రాంతి నాశించుచున్న కాంతావదన కమలమునుండి వెలువడు నిషేధరూప "న"కారమువలె నాకు సంతాప శాంతి నివ్వలేక పోయినవి.

లవలీం తవ లీలయా కపోలే
కవలీకుర్వతి కోమలత్విషా.
పరిపాండురపుండరీకఖణ్డై
పరివేతుః పరితో మహోదయః. 34

తా:- ఓసీ! బాలా! నీ కపోలము కోమలకాంతులచే లవలీలత యందమును మ్రింగుచుండెను. అది చూచి పరిపాండురపుండరీకఖండములను మహోదు లాక్రమించినవి,

యౌవనోద్గమనితాన్తశఙ్కితాః
శీలశౌర్యబలకాన్తిశోభితాః.
సంకుచన్తి వికసన్తి రాఘవే
జానకీనయననీరజశ్రియః. 35

తా :- యౌవనోద్గమ నితాంత శంకితములును, శీల శౌర్య బల కాంతి శోభితములును నై, జానకీనయననీరజశోభాలక్ష్మలు రాఘవుని యందు సంకోచ వికాసముల నందుచున్నవి.

ర. గం :- ఇది రసధ్వనిలో భావసంధి కుదాహరింపఁబడినది. భావసంధి యనగా నొకదాని నొకటి ద్రోసివేసికొను నట్లున్నను, ద్రోసివేసికొనని రెండు భావముల కలయిక. ఈ శ్లోకములో దాశరథి యందలి లోకోత్తర మైన యౌవనోదయమును, అట్టిదే యైన శీలశౌర్యాదికమును, జూచుట విభావము. కనులు మూయుట, విస్తరించుట, యనుభావము. సిగ్గు - ఔత్సుక్యముల సంధి వ్యంగ్యము.

అధిరోప్య హరస్య హన్త ః చాపం
పరితాపం ప్రశమయ్య బాన్ధవానామ్.
పరిణేష్యతి వా న వా యువాఽయం
నిరపాయం మిథిలాధినాథపుత్రీమ్. 36

తా :- ఈ యువకుఁడు, హరశరాసము నెక్కిడునో లేదో! బాంధవుల పరితాపము ప్రశమింపఁజేయునో లేదో! నిరపాయముగ మిథిలాధినాథపుత్రిని బరిణయ మాడునో లేదో!

ర. గం :- ససందేహాలంకార సందర్భములోనిది. ఇక్కడ సంశయము మాత్రమే యున్నది;అది సాదృశ్యమూలకము గాదు.అందుచే ససందేహాలంకారము గానేరదు.

భుజపఞ్జరే గృహీతా
నవపరిణీతా వరేణ రహసి వధూః,

*తతాఽలజాలపతితా*
*బాలకురఙ్గీవ వేపతే నితరామ్.* 37

తా :- ఆమె నవపరిణీత! అది యేకాంత స్థలము. వరుని భుజ పంజరములచే గృహీత యైనది; గృహీతయై, తతాఽలజాలపతితయైన, బాలకురంగి వలె వణకుచున్నది.

ర. రం :- రసాభాసమున కుదాహరణ మిచ్చినాఁడు.

*ఉపనిషదః పరివీతా*
*గీతాపి చ హన్త మతిపథం నీతా.*
*తదపి న హా! విధువదనా*
*మానససదనాత్ బహిర్యాతి.* 38

తా:- ఉపనిషత్తులు పాన మొనర్చితిని. గీత నవలోడించితిని. ఏమి లాభము? ఆ విధువదన మానససదనమునుండి గడ్డకు బోవుటయే లేదు.

*అకరుణహృదయ! ప్రియతమ!*
*ముఞ్చామి త్వామితః పరం నాహమ్.*
*ఇత్యాలపతి కరామ్బుజ*
*మాదాయాలీజనస్య వికలా సా.* 39

తా:- 'ఓరీ! దయలేనివాడా! ప్రియతముడా! ఇఁకమీద నేను నిన్ను విడువను'' అని యావిడ చెలికత్తె కరాంబుజమును బట్టికొని యేడ్చుచున్నది. ఆ నాయిక వికల.

ర గక:- రసధ్వనిలో ఉన్మాదమున కుదాహరించినాఁడు.

*లోభాద్వరాటికానాం*
*విక్రేతుం తక్రమానిశమటన్త్యా.*
*లబ్ధో గోపకిశోర్యా*
*మధ్యేరథ్యం మహేన్ద్రనీలమణిః.* 40

తా:- ఆ గోపకిశోరి పరాటికలకై పెరుగు నమ్ముచు రాత్రి వరకు దిరుగుచున్నది. త్రోవలో నామెకు మహేంద్ర నీలమణిఁ జిక్కెను.

ర.గం:- విశేషాలంకారచర్చా సందర్భములో నీ శ్లోక మున్నది. దీని యందు విశేషాలంకారమా, విషమాలంకారమా, యని చర్చ. విషమాలంకార మని నిర్ణయము. ప్రహర్షణాలంకారము గూడ నగును.

*రూపారుచిం నిరసితుం*
*రసయన్త్యా హరిముఖస్య లావణ్యమ్.*
*సుదృశః శివ శివః సకలే*
*జాతా సకలేవరే జగత్యరుచిః.* 41

తా:- తన రూపమునందలి అరుచిని నిరసించుటకై హరి ముఖలావణ్యము నామె రసించుచున్నది. శివ! శివా! సకలేబరమైన సకల జగత్తునం దామె కరుచి యే యేర్పడినది.

వి:- ''సుదృశః'' = చూచుటలోని యందమును దెల్పును.

ర.గం:- విషమాలంకారము. ''అననురూప సంసర్గము'' విషమ మని లక్షణము. రూపమునందలి యరుచిని బోగొట్టి కొనుటకు ఆమె హరి ముఖ లావణ్యమునందు రసించినది. తత్ఫలముగా జగత్తునందంతయు నరుచియే భాసించెను.

*గరిమాణమర్పయిత్వా*
*లఘిమానం కుచతటాత్కురఙ్గదృశామ్.*
*స్వీకుర్వాతే నమస్తే*
*యూనాం ధైర్యాయ నిర్వివేకాయ.* 42

తా:- స్త్రీల కుచతటములను జూచినప్పుడు దమ గౌరవమెన్నడోఁ బోయినది. 'లఘిమ' యాక్రమించినది. నిర్వివేక మైన యువకుల ధైర్య మట్టిది. దానికి సమస్కారము.

వి :- అనగా వారి కుచతటములను జూచి దమ గుణగౌరవములను గోల్పడి లఘుత్వము జెంది రని భావము.

ర. గం :- పరివృత్త్యలంకారము. ఒకరికి తన వస్తువు నొక టిచ్చి వారి నుండి మరి యొక వస్తువును స్వీకరించుట పరివృత్తి. క్రయ మని తాత్పర్యము. ఇది రెండు రీతులు. సమ పరివృత్తి, విషమ పరివృత్తి. ఈ శ్లోకము విషమ పరివృత్తి కుదాహరణము.

ని
నతాఙ్గ్యా నయనద్వయమ్.
అన్యోన్యాలోకనానన్ద
విరహాదివ చఞ్చలమ్. 43

తా :- నిస్సీమశోభాసౌభాగ్యమైన, ఆ నతాంగి నయనద్వయము, అన్యోన్యాలోకనానందము లేకపోవుటతో వలెఁ జంచల మైనది. ఒక కన్ను మరి యొక కంటిని జూడలేదు గదా!

ర. గం :- హేతూత్ప్రేక్ష.

నయనాఞ్చలావమర్శం
యా న కదాచిత్పురా సేహే.
ఆలిఙ్గితాఽపి జోషం
తస్థౌ సా గన్తుకేన దయితేన. 44

తా :- ఆమె యింతకు ముందు నయనాంచలావమర్శము గూడ సహించెడిది గాదు. ప్రియుడు ప్రయాణమై పోవుచున్నాఁడు. అందుచే నాలింగనము జేసికొన్నను ఊరకున్నది.

ర. గం :- రసధ్వనియందు జడత కుదాహరణముగా నివ్వఁబడినది.

మానవరాగ్వాదనాపి
ప్రియా శయానేవ దయితకరకమలే.

ఉద్వేల్లద్భుజమలస
గ్రీవాబంధం కపోలమాధత్తే. 45

తా :- ఆమె హీనపరాగ్వదనయయ్యును, నిదురించినది వలె దయితుని కరకమల మందు, అలసగ్రీవాబంధముగా, కపోలము నుంచినది. ఆమె భుజము లుద్వేల్లితములు.

కిం జల్పసి ముగ్ధతయా
హన్త ! మమాఙ్గం సువర్ణమితి.
తద్యది పతతి హుతాశే
తదా హతాశే ! తులాం తవారోహేత్. 46

తా:- ఓసీ ! ముగ్ధా! నీవు తెలియక నీ యంగము సువర్ణ మనుచున్నావు. ఓసీ ! సువర్ణమునకు నీ యంగసామ్య మెక్కడ నున్నది ! అది యగ్నిలో బడి యింకను కాంతి సంపదను జేకూర్చి కొన్నపుడు నీ తనూసామ్యమందునేమో ! అంతవరకు నీవు హతాశవే !

వ గం:- ప్రతీపాలంకారము. పూర్వార్ధమునందు సువర్ణ వర్ణాధిక్యముఁ జెప్పబడెను. ఉత్తరార్ధమునందు దానిని దిరస్కరించి బాలాంగవర్ణాధిక్యమే వివరింపఁబడినది. ప్రసిద్ధోపమ నుపమేయముగా జెప్పుట ప్రతీపము.

లోచనఫుల్లామ్భోజ
ద్వయలోభాన్దోలితైకమనాః.
కస్తూరీతిలకమిషా
దయమలికేఽలి స్తవోల్లసతి. 47

తా:- ఓసీ ! చూడుము. నీ లోచన ఫుల్లాంభోజద్వయలోభాందోలిత మానసము, ఆ తుమ్మెద, కస్తూరీ తిలకవ్యాజముతో నీముఖము నాశ్రయించినది.

చిన్తామీలితమానసో మనసిజః సఖ్యో విహీనప్రభాః
ప్రాణేశః ప్రణయాకులః పునరసావాస్తాం సమస్తా కథా.

ఏతత్త్వాం ప్రతిబోధయామి మమ చేదుక్తం హితం మన్యసే
ముగ్ధే! మా కురు మాన మాననమిదం రాకాపతిర్జేష్యతి. 48

తా :- ముద్దరాలా! మన్మథుఁడు చింతామీలితమానసుఁ డైనాఁడు. నీ చెలికత్తెల మొగములు వాడినవి. ప్రాణేశుఁడు ప్రణయాకులు డైనాఁడు. నీ వివేమియు లెక్క పెట్టుట లేదు. అదట్లుండనీ! మానముతో నీ మొగము వాడినప్పుడు, పున్నమచంద్రుడు నీ ముఖమును గెల్చును. దానినైనను గమనింపుము.

ర. గం :- రసధ్వనిలో నీ శ్లోక ప్రసక్తి. దీనిలో మొత్తముపైన ప్రసాద గుణ మున్న దన్నాఁడు. కొద్దిచోట్ల మాత్రము ఓజస్సుగూడ నున్నది.

ఆలంకర్తుం కర్ణౌ భృశమనుభవన్త్యా నవరుజం
ససీత్కారం తిర్యగ్వలితవదనాయా మృగదృశః.
కరాబ్జవ్యాపారానతిసుకృతసారాన్రసయతో
జనుస్సర్వశ్లాఘ్యం జయతి లలితోత్తంస! భవతః. 49

తా :- ఓ లలితోత్తంసమా! నీ పుట్టుక సర్వజన శ్లాఘ్య మైనది; నీచే దన శ్రవణముల నలంకరింపఁ జేసికొనుటకు ఆమె నానా యాతన పడుచున్నది. మొగము నడ్డముగా ద్రిప్పినది. సీత్కారములు వెలార్చుచున్నది. అతిసుకృత సారములైన కరాబ్జ వ్యాపారము లొనర్చుచున్నది. వాని నన్నిటి ననుభవించుచున్నావు; నీ యదృష్టమునకు మేర యేమున్నది?

ఆయాతైవ నిశా నిశాపతికరైః కీర్ణం దిశామన్తరం
భామిన్యో భవనేషు భూషణగణైరఙ్గాన్యలంకుర్వతే.
ముగ్ధే మానమపాకరోషి న మనాగద్యాపి రోషేణ తే
హా! హా! బాలమృణాళతోఽప్యతితరాం తన్వీ తనుస్తామ్యతి. 50

తా :- ముగ్ధా! రాత్రి రానే వచ్చినది. చంద్రకిరణములు దిక్కుల నావరించికొన్నవి. భామినులు తమ సొమ్ము లలంకరించి కొనుచున్నారు.

నీ వింకను కొంచె మైన కోపమును వదలుట లేదు. బాలమృణాళమునకన్న లలిత మైన నీ శరీరము ఇంకను నలతను బొందుచున్నది.

ర. గం :- వైదర్భీరీతి కుదాహరణము.

వాచో మాఙ్గలికీః ప్రయాణసమయే జల్పత్యనల్పం జనే
కేలీమన్దిరమారుతాయనముఖే విన్యస్తవక్త్రామ్బుజా.
నిఃశ్వాసగ్లపితాధరం పరిపతద్బాష్పార్ద్రవక్షోరుహా
బాలా లోలవిలోచనా శివ శివ ప్రాణేశమాలోకతే. 51

తా :- ప్రాణేశుఁడు ప్రయాణ మై పోవుచున్నాడు. చుట్టును జనులు వల్కు శుభ వాక్యములు. ఆమె మాత్రము క్రీడామందిరగవాక్ష మందు మొగ ముంచి ప్రాణేశ్వరునిఁ జూచుచున్నది. నిట్టూర్పులతోఁ బెదవి యంతయు వాడినది. కన్నీటితో స్తనమండలము దడిసినది; కనులు తత్తఱ పడుచున్నవి. శివ ! శివా ! ఆమె గూఢ దుఃఖము నోర్వరానిదిగా నున్నది.

ర. గం :- విప్రలంభ శృంగారము.

దారిద్ర్యం భజతే కలానిధిరయం రాకాధునా మ్లాయతి
స్వైరం కైరవకాననేషు పరితో మాలిన్యమున్మీలతి
ద్యోతన్తే హరిదన్తరాణి సుహృదాం బృన్దం సమానన్దతి
త్వం చేదఞ్చసి కాఞ్చనాఙ్గి వదనామ్భోజే వికాసశ్రియమ్. 52

తా :- ఓ ! కాంచనాంగీ ! నీ వదనమునందు వికాసలక్ష్మి గన్పట్టినచో నిఁక నేమున్నది? చంద్రుడు దారిద్ర్యమును భజించును; పున్నమ వాడిపోవును. కైరవకాననములందు మాలిన్యము ఆవరించును. దిక్కులు వికసించును. నీ సుహృజ్జనములు సంతోషింతురు.

పాటీరద్రుభుజఙ్గపుఙ్గవముఖాయాతా ఇవాతాపినో
వాతా వాన్తి దహన్తి లోచనమమీ తామ్రా రసాలద్రుమాః.
ఏతే హన్త కిరన్తి కూజితమయం హాలాహలం కోకిలా
బాలా బాలమృణాలకోమలతనుః ప్రాణాన్కథం రక్షతు. 53

తా :- మలయాచలమందలి పాటీరద్రుమముల వసించు సర్పరాజముల ముఖములనుండియే గాలులు వీచుచున్నవి. లేకున్న నింత తాపమెట్లు గల్గించును? ఎఱ్ఱగా విరియ బూచిన యీ మామిడి కండ్లను గాల్చివేయుచున్నది. కోకిలలు హాలాహలమును వెదజల్లుచున్నవి. బాలమృణాలకోమలతనువు గల్గిన యీ బాల ప్రాణములెట్లు రక్షించుకొనునో!

ర.గం :- సముచ్చయాలంకారము. పదార్థముల కొకటే సారి యన్వయము సముచ్చయము. పై శ్లోకములో నాయికా జీవనాశము కొఱకు అరమణీయములైన మూఁడు సన్నివేశము లొకటే సారి వచ్చిపడినవి.

*ఆయాతైవ నిశా మనో మృగదృశామున్నిద్రమాతన్వతీ*
*మానో మే కథమేష సంప్రతి నిరాతఙ్కం హృది స్థాస్యతి.*
*ఊహాపోహ మిమం సరోజనయనా యావద్విధత్తే తరామ్*
*తావత్కామనృపాతపత్రసుషమం బిమ్బం బభాసే విధోః. 54*

తా :- రాత్రి రానే వచ్చినది. మృగనేత్రల మనస్సులు కామోన్ముఖములై లేచినవి. మానము నా మనమునందు నిర్విఘ్నముగా నెట్లుండగలదు? మరి దానిని వదలుకొను టెట్లు? ఈ రీతి ఊహాపోహలతో నా నాయిక ముందు వెనుకలాడు చునే ఉన్నది. ఇంతలో కామనృపాతపత్ర సదృశమై గగనమున విధుమండలము భాసించినది.

ర.గం :- ఒక కారణముచే నొక కార్యము సిద్ధించుట. ఆ కార్యము సిద్ధించుటకు ఆకస్మిక కారణాంతర సమవధాన మేర్పడును. దానిచేత నా కార్యము కల్గుట కింకను సౌకర్యము వచ్చును. అట్టివానికి సమాధ్యలంకార మని పేరు. పై దానిలో రాత్రి సన్నిధానము చేతనే మానవినాశము సిద్ధించుచున్నది. కాని చంద్రోదయ కారణాంతరముచే ఆ సిద్ధి యింకను ననాయాసమైనది.

*ప్రభాతసమయప్రభాం ప్రణయిని హ్నువానా రసా*
*దముష్య నిజపాణినా దృశమమీలయల్లీలయా.*
*అయం ను ఖలు పద్మినీపరిమలాలిపాటచ్చరై*
*రవే రుదయమధ్యగాదధికచారుతైర్మారుతైః. 55*

తా :- తెల్లవారినది; తెల్లవారుట ప్రియునకుఁ దెలియకూడదని నాయిక భావము. ఆమె హృదయ మింకను రసావిష్టము. ఆ పడతి లీలావ్యాజముతోఁ బ్రియుని కనులు మూసినది. కాని వానికి తెల్లవారినదని తెలియనే దెలిసెను. ఎట్లు ? పద్మినీ పరిమళ పాటచ్చరములై చారుతాసీమలై మారుతములు వీచినవి.

*విదూరాదాశ్చర్య స్తిమిత మథ కించిత్పరిచయా*
*దుదఞ్చచ్చాఞ్చల్యం తదను పరితః స్ఫారితరుచి.*
*గురూణాం సంఘాతే సపది మయి యాతే*సమజని*
*త్రపాఘూర్ణత్తారం నయనమిహ సారఙ్గజదృశః.* 56

తా :- దూరమునుండి నేను గన్పడితిని. అపు డామె కను లాశ్చర్య స్తిమితము లైనవి; పిదప కించిత్పరిచయముతో నుదంచచ్చాంచల్యము లైనవి. ఆపై నల్గడల విస్తరించిన కాంతులు గల వైనవి; సమీపమున నున్న గురుజనులు వెళ్ళిపోయినారు. ఆమె నన్ను విలోకించినది. ఆమె కనులు త్రపాఘూర్ణ త్తారకము లైనవి.

ర. గం :- పర్యాయాలంకారము. ఒక యధికరణమునందు ఒక యాధేయమును జెప్పుట యొక పర్యాయాలంకారము. ఏకాధికరణమందే అనేకా ధేయములను జెప్పుట రెండవ పద్ధతి, నాయిక గురువులకు శుశ్రూష యొనర్చు చున్నది. ప్రోషితుఁ డైన నాయకుఁడు హఠాత్తుగా వచ్చెను. వాని నకస్మాత్తుగా జూచిన స్త్రీయొక్క నేత్రయుగ మను నధికరణమందు స్తిమితత్వాదులగు ననే కాధేయము లేర్పడినవి. అన్నియు నొక్కసారి సిద్ధింపవు గనుక కారణ క్రమవశమున క్రమికత్వము.

*కపోలావున్మీలత్పులకనికురమ్బౌ మయి మనాక్*
*స్పృశత్యే స్తః స్మేర స్తబకిత ముఖామ్బోరుహరుచః.*
*కథంకారం శక్యాః పరిగదితుమిన్దీవరదృశో*
*దశద్వారిశానిర్యద్రసభరసపక్షా భణితయః.* 57

తా :- ఉన్మీలత్పులకనికురంబము లైన కపోలములను నేను, దిన్నగాఁ దాకితిని. తాకుటయే తడ వామె ముగ మంత స్మేరస్తబకిత మైనది. ఆమె

* ఆమె గురుసంఘాతమధ్యమునం దుండగా నేను వెళ్ళితిని.

యేమేమియో మాటలాడెను. అవి దళద్ద్రాక్షానిర్యద్రసభరసపక్షములు. ఆ యిందీవరాక్షి మాటల నెట్లు వర్ణింతును ?

*రాజానం జనయాంబభూవ సహసా జైవాతృక త్వాం చ యః*
*సోయం కుణ్ఠిత సర్వశక్తి వికలో జాతో జరాతో విధిః.*
*సంప్రత్యున్మదఖఞ్జరీటనయనావక్త్రాయ నిత్యశ్రియే*
*దాతా రాజ్యమఖణ్డమస్య జగతో ధాతా నవో మన్మథః. 58*

తా :- ఓ! జైవాతృకా! నిన్ను బ్రహ్మదేవుడు రాజుగా నొసర్చెను. ఆతనిలో విజ్ఞత యేమున్నది ? ముసలితనము గప్పినది. అందుచే బలహీనత యేర్పడినది; బుద్ధి సరిగాఁ బనిచేయలేదు. ఇప్పుడు నవ మన్మథు డను విధాత దయార్ద్రైనాఁడు; ఉన్మదఖంజరీటనయన వక్త్రమునకు జగద్రాజ్యపట్టాభిషేక మొనర్చినాఁడు. ఇది బాగున్నది.

వి॥ ''అబ్జో జైవాతృకస్సోమః'' — అమరము. జైవాతృకు డనగా చంద్రుడు. ''జరాతః'' = పంచమ్యర్థమందు ''తసిల్'' ప్రత్యయము.

''ఖంజరీట'' = మనగా కాటుకపిట్ట. ''ఖంజరీటస్తు ఖంజనః'' = అమరము. స్త్రీల కన్నులను వీనితోఁ బోల్తురు.

*క॥ ఖంజనయనావిలోచన*
*ఖంజనయుగ మెదకు ప్రాలఁగని వసువాలో*
*రంజిలుట డెలిసి'' —* [వసుచరిత్ర]

''నిత్యశ్రియే'' = ఈమె ముఖ మండలకాంతి యెన్నడును దరిగిపోనిది. చంద్రుని కాంతి వృద్ధిక్షయములు గలది.

*ఆవిర్భూతా యదవధి మధుస్యన్దినీ నన్దసూనోః*
*కాన్తిః కాచిన్నిఖిలనయనాకర్షణే కార్మణజ్ఞా.*
*శ్వాసో దీర్ఘస్తదవధి ముఖే పాణ్డిమా గణ్డమూలే*
*శూన్యా వృత్తిః కులమృగదృశాం చేతసి ప్రాదురాసీత్. 59*

తా :- ఆ నంద సూనుని కాంతి మధుస్యందిని. అట్టి దిట్టి దని చెప్పరానిది. నిఖిల నయనాకర్షణ మందు సమర్థమైనది. దాని యావిష్కార మైనప్పటి నుండి యింకే మున్నది? కులీనలైన హరిణ నేత్రలకు మొగములపై దీర్ఘ నిశ్వాసము, కపోలముపైఁ దెల్లదనము, మనస్సున శూన్యవృత్తి.

ర.గం :- రసధ్వనిలో జడత కుదాహరణము.

ప్రసఙ్గే గోపానాం గురుషు మహిమానం యదుపతే
రుపాకర్ణ్య స్విద్యత్పులకితకపోలా కులవధూః.
విషజ్వాలాజాలం ఝటితి వమతః పన్నగపతేః
ఫణాయాం సాశ్చర్యం కథయతితరాం తాణ్డవవిధిమ్. 60

తా :- యదువృద్ధులు కృష్ణుని మహిమలను గూర్చి చెప్పికొనుచున్నారు. అచటనే కులవధు వున్నది. ఇఁక చెప్పెడిదేమి? అమె కపోలముల యందు జెమటలు: కిక్కిరిసిన పులకలు. విషజ్వాలాజాల మైన పన్నగపతి ఫణముల యందుఁ గృష్ణుఁడు తాండవ మొనర్చిన పద్ధతి మాటిమాటికి నాశ్చర్యముగా జెప్పుచున్నది.

ర. గం :- రసధ్వనియం దవహిత్థ.

కైశోరే వయసి క్రమేణ తనుతామాయాతి తన్వ్యాస్తనా
వాగామిన్యఖిలేశ్వరే రతిపతౌ తత్కాలమస్యాజ్ఞయా.
ఆస్యే పూర్ణశశాఙ్కతా నయనయోస్తాదాత్మ్య మమ్భోరుహాం
కించాసీదమృతస్య భేదవిగమః సాచిస్మితే తాత్త్వికః. 61

తా :- కైశోర మైన వయస్సు క్రమముగాఁ దగ్గినది. అఖిలేశ్వరుఁ డైన రతిపతి యామె శరీరము నాక్రమింపఁబోవుచున్నాఁడు. అంతకు ముందే వాని యాజ్ఞతో నామె ముఖము బూర్ణ శశాంకరుచి యాక్రమించినది. నయనములందు అంభోరుహముయొక్క కాంతి తాదాత్మ్యము గుదురుకొన్నది. సాచిస్మితమందు తాత్త్విక మైన అమృతభేదవిగమము నెలకొన్నది.

వి :- కిశోరసంబంధము కైశోరము; ''అఖిలేశ్వరే'' = సమస్త ప్రపంచములకునుఁ జక్రవర్తి యైనవాఁడు.

"రతిపతౌ" = ఆ చక్రవర్తి తన మహారాణితో గూడ వచ్చుచున్నాఁడని యర్థము; "తనౌ" = ఈమె తను వను తన సామ్రాజ్యము; ఒకానొక చక్రవర్తి పట్టణప్రవేశము జేయునపుడు ఆ పట్టణమున యలంకారవిశేషములు జరిగినట్లని ధ్వని.

ర. గం :- రూపకాలంకార సందర్భములోని దిది. దీనిపైఁ గొంత చర్చ యున్నది.

శయితా శైవలశయనే
సుషమాశేషా నవేందులేఖేవ.
ప్రియమాగతమపి సవిధే
సత్కురుతే మధురవీక్షణై రేవ. 62

తా :- ఆమె శైవలశయనమందుఁ బండుకొన్నది. సుషమాశేష యై నవేందురేఖ వలె నున్నది. ప్రియుడు సమీపించినాఁడు. లేచుటకు శక్తి లేదు. అందుచే మధురవీక్షణములతోనే సత్కరించుచున్నది.

ర. గం :- దైన్యమున కుదాహరణము.

విరహేణ వికలహృదయా
విలపన్తీ దయిత దయితేతి.
ఆగతమపి తం సవిధే
పరిచయహీనేవ వీక్షతే బాలా. 63

తా :- ఆమె విరహముతో వికలహృదయయై "ప్రియుడా-ప్రియుడా" యని విలపించుచున్నది. ఆతఁడు దగ్గరకు వచ్చినప్పటికిని పరిచయము లేని దాని వలె వెలితి చూపులఁ జూచుచున్నది.

ర. గం :- మోహము.

అధరద్యుతిరస్తపల్లవా
ముఖశోభా శశికాన్తిలఙ్ఘినీ.
తనురప్రతిమా చ సుభ్రువో
న విధేరస్య కృతిం వివక్షతి. 64

తా :- దీని యధరద్యుతి అస్తపల్లవము; ముఖశోభ శశికాంతిలంఘిని; తనువు సాటి లేనిది; ఇది బ్రహ్మదేవుని సృష్టిగాఁ దోచుట లేదు.

ర. గం :- చింత.

వ్యాత్యస్తం లపతి క్షణం క్షణమహో! మౌనం సమాలంబతే
సర్వస్మిన్విదధాతి కిఞ్చ విషయే దృష్టిం నిరాలమ్బనామ్.
శ్వాసం దీర్ఘమురీకరోతి న మనాగఙ్గేషు ధత్తే ధృతిం
వైదేహీవిరహవ్యథావికలితో హా హన్త! లఙ్కేశ్వరః. 65

తా :- క్షణకాలము వ్యత్యస్తముగ మాట్లాడును, కొంతసేపు మౌనమును వహించును. సర్వవిషయములందును, నిరాలంబమైన దృష్టినిఁ బూనును. దీర్ఘ దీర్ఘ శ్వాసములు విడుచును. అంగముల నే మాత్రము ధృతి లేదు. అయ్యో! లంకేశ్వరుఁడు వైదేహీ విరహ వ్యథా వికలితుఁ డైనాఁడు.

ర. గం :- రసాభాస ధ్వని.

ముఞ్చసి నాద్యాపి రుషం
భామిని ముదిరాలిరుదియాయ.
ఇతి సుదృశః ప్రియవచనై
రపాయి నయనాబ్జకోణశోణరుచిః. 66

తా :- “ఓసీ ! భామినీ! నీ వింకను కోపము వదల లేదు. ఆకసమును మేఘముల గుమి యాక్రమించినది.” ప్రియుని యీ వచనములు విని ఆ నాయిక నయనాబ్జకోణములందు శోణరుచి వీగిపోయినది.

వి :- వర్షాకాలము ప్రాప్తించిన దనుటకు మారుగా మేఘము లాక్రమించిన వనుచున్నాడు; నయనశోణకోణరుచి యామెకు కోపముచే నేర్పడినది; కోపము పోయినదని చెప్పుటకు మారు "శోణరుచి" పోయినదన్నాఁడు.

ర. గం. :- భావశాంతి.

ఆలోక్య సున్దరి ! ముఖం తవ మన్దహాసం
నన్దన్త్యమన్దమరవిన్దధియా మిలిన్దాః.
కిం చాऽసితాక్షి మృగలాఞ్ఛనసమ్భ్రమేణ
చఞ్చూపుటం చటులయన్తి చిరం చకోరాః. 67

తా:- ఓసీ ! సుందరీ ! నీ ముఖమును జూచి యరవిందబుద్ధితో తుమ్మెదలాక్రమించికొనుచున్నవి. అసితాక్షీ ! నల్లని నీ కన్నులు చూచి మృగలాంఛన సంభ్రమముతో చకోరములు చంచూపుటములను సారించుచున్నవి.

వి:- తుమ్మెదలకును చకోరములకును భ్రాంతి; ముఖమును చూచి పద్మ మని తుమ్మెదలకు భ్రాంతి; ఆ ముఖమందు నల్లని కన్నులను చూచి చకోరములకు మృగలాంఛనుఁడను భ్రాంతి : "అసితాక్షి" = కాటుక కన్నుల దని యర్థము.

ర.గం:- ఉల్లేఖాలంకారము. ఒకటే వస్తువును నిమిత్త భేదములతో ననేకు లనేక రీతులుగా గ్రహించుట యుల్లేఖము.

స్మితం నైతత్కిన్తు ప్రకృతిరమణీయం వికసితం
ముఖం బ్రూతే కో వా కుసుమమిదముద్యత్పరిమలమ్.
స్తనద్వన్ద్వం మిథ్యా కనకనిభమేతత్ఫలయుగం
లతా రమ్యా సేయం భ్రమరకులనమ్యా న రమణీ. 68

తా:- ఈమె స్త్రీ కాదు. భ్రమర కుల సేవ్యమానయైన లత. అది చిరునవ్వని యెవరు చెప్పగలరు ? ప్రకృతి రమణీయ మైన వికసనము. అది

ముఖము గాదు. ఉద్యత్పరిమళ మైన కుసుమము. కనక నిభమైన యిది స్తన ద్వంద్వము కాదు. ఆ లతపై నున్న ఫల ద్వంద్వము.

ర.గం. :- అపహ్నుత్యలంకారము. ఉపమేయతావచ్ఛేదకనిషేధసామానాధికరణ్యముతో ఆరోప్యమాణమైన ఉపమానతాదాత్మ్యము అపహ్నుతి. ఈ లక్షణము చాల శాస్త్రీయముగా నున్నది; ఆ పరిభాష తెలియనిది లక్షణ నిర్వచన మర్థముగాదు. అవచ్ఛేద మనగా తద్గతజాతి యని సామాన్యముగా నర్థము జెప్పి కొనవచ్చును. 'గోవు'నందు 'గోత్వము' 'గుణి' యందు 'గుణిత్వము', ఇట్లు, ఇది తర్కశాస్త్రమునకు సంబంధించిన మాట! సామానాధికరణ్య మనగా ఒక్కొక్క శాస్త్రములో నొక్కొక్క యర్థమున్నది; ఒకటే విభక్తిలో నుండుట సామానాధికరణ్య మని వైయ్యాకరణులు; ఏకాశ్రయత్వము సామానాధికరణ్య మని యితరులు. ఇక్కడ స్మితమును స్మితము గాదని మరి యొకటిగా చెప్పుచు న్నాఁడు.

*సంగ్రామాఙ్గణసంముఖాహతకియద్విశ్వంభరాధీశ్వర*
*వ్యాదీర్ణీకృతమధ్యభాగవివరోన్మీలన్నభోనీలిమా,*
*అఙ్గారప్రఖరైః కరైః కవలయన్నేతన్మహీమణ్డలం*
*మార్తణ్డోయ ముదేతి కేన పశునా లోకే శశాంకీకృతః.* **69**

తా :– యుద్ధరంగములందు వాని నెందరో మహారాజు లెదిరించిరి. ఎదిరించి మరణించిరి. వారితో వీఁడు యుద్ధము లొనర్చినపుడు వారి బాణములచే వీని యెద చీల్చబడి గండి యేర్పడినది. ఆ గండినుండి యాకాశము గన్పించుచున్నది. క్రూరము లైన యంగార ప్రకరములతో వీఁడు మహీమండలమునే గబళించుచున్నాఁడు. నిజమునకు వీఁడు సూర్యుఁడు చంద్రుఁ డని యెవఁడో పశువు భావించును. *

ర.గం. :– పైశ్లోకమందు అపహ్నుత్యలంకారము గాదనియు భ్రాంతి మంత మనియు పండితుని సిద్ధాంతము.

---

* సంగ్రామాంగణ సంముఖాహత = యుద్ధరంగమున వెన్నీయ కుండ నిలచి పోరి మరణించినవారని అర్థము. అట్టి వీరు సూర్యమండల మును భేదించుకొని ఉత్తమలోకములకు వెళ్లుదురని శాస్త్రము.

శ్యామం సితం చ సుదృశో న దృశోః స్వరూపం
కిం తు స్ఫుటం గరలమేతదథామృతం చ.
నో చేత్కథం నిపతనాదనయో స్తదైవ
మోహం ముదం చ నితరాం దధతే యువానః. 70

తా :- శ్యామమును సితము నైన ఈమె కన్నుల జంట కన్నుల జంట గాదు. గరళామృతముల జంట. అటు గాకున్నచో యీ కన్ను లెవరిపైనం బడునో ఆ యువకు లొకటే సారి మోహమోదముల నెట్లు గాంతురు?

ర.గం. :- హేత్వపహ్నుతి కుదాహరణము.

అలిర్మృగో వా నేత్రం వా
యత్ర కించిద్విభాసతే.
అరవిన్దం మృగాఙ్కో వా
ముఖం వేదం మృగీదృశః. 71

తా :- ఆ రప్వంత ప్రకాశించునది భ్రమరమో! హరిణమో! లేక కాంతయొక్క చూపో! అదుగో ఆ వెల్గెడునది అంబుజమో లేక చంద్రుడో కాక యామె ముఖమో!

దయితే రదనత్విషాం మిషా
దయి తేఽమీ విలసన్తి కేసరాః.
అపిచాలకవేషధారిణో
మకరన్దస్పృహయాలవోఽలయః. 72

తా :- దయితా! రదనకాంతుల మిషతో కేసరములు ప్రకాశించుచున్నవి. మకరంద స్పృహతో తుమ్మెదలు అలకలై నీ ముఖమున భాసించుచున్నవి.

వి :- ఆమె ముఖమును జూచి తుమ్మెదలకు పద్మ మను భ్రాంతి. రదములయొక్క కాంతులు కేసరములై ఆ భ్రాంతిని మరింత రెచ్చగొట్టినవి.

"అలక......ధారిణః" - ఆమె ముంగురులు తుమ్మెదల వలె నున్న వని యుపమాలంకారము.

ర గం. :- ఈ శ్లోకమందు పూర్వార్ధమందును ఉత్తరార్ధమందును రెండపహ్నుతు లున్నవి. వీనితో నీవు స్త్రీవి కావు; తామరతీగ వని మూడవ యపహ్నుతి వ్యంగ్యముగా దోచుచున్నది. ఇది ప్రౌఢోక్తి నిష్పన్న మైన వస్తువుచేత అలంకార ధ్వని.

అనిశం నయనాభిరామయా
రమయా సంమదినో ముఖస్య తే.
నిశి నిస్సరదిన్దిరం కథం
తులయామః కలయాపి పఙ్కజమ్. 73

తా :- నిరంతరము నీ ముఖమందు నయనాభిరామముగా సౌందర్యలక్ష్మి ప్రకాశించుచున్నది. ఇట్టి నీ వదనముతో రాత్రులందు నిస్సరదిందిరమైన పంకజమును లవ మైన నెట్లుఁ బోల్పగలము ?

వి :- రాత్రులందు పద్మములు ముకుళించును. అందుచే వాని యందు కాంతిలక్ష్మి యుండదు. నీ ముఖము రేలయందును గూడ వికసించియే యుండును.

ర.గం. :- ఉపమానమున కన్నను ఉపమేయమునకు గుణవిశేషవత్త్వముతో ఉత్కర్షమును ప్రతిపాదించిన వ్యతిరేకాలంకారము. ఇక్కడ ముఖమునకు పంకజము లేశమును పోల దనుచున్నాడు.

అఙ్గైః సుకుమారతరైః
సా కుసుమానాం శ్రియం హరతి.
వికలయతి కుసుమబాణో
బాణాలీభిర్మమ ప్రాణాన్. 74

తా :- ఓ ! స్నేహితుడా ! సుకుమారతరము లైన యంగములతో నామె కుసుమశ్రీలను హరించినది. కుసుమ బాణుఁడు నా ప్రాణములను బాణములతో హరించుచున్నాఁడు.

వి :- ఆమె యంగములు కుసుమములు. మన్మథుఁడు కుసుమబాణుఁడు. ఆమె యంగములనే కుసుమములుగా నొనర్చి నన్ను జంపుచున్నాఁ డని పిండితార్థము.

ర.గం. :- హేతుకార్యములకు వైయధికరణ్యము అసంగతి. ఈ వైయధికరణ్యము ఆపాతపరిభాసమానమే. సుకుమారతరము లైన అంగములు హేతువు. కుసుమశోభను హరించుట కార్యము. ఈ రెండును భిన్నము లయిన యధికరణముల నాశ్రయించినవి.

*ఖిద్యతి సా పథి యాన్తీ*
*కోమలచరణా నితమ్బభారేణ.*
*ఖిద్యామి హన్త పరితః*
*తద్రూపవిలోకనేన వికలోఽహమ్.* 75

తా :- ఆమె కోమలచరణ; దారిని నడచుచు కటిభారమున నడువలేక ఖేద మందుచున్నది; నేను సర్వదిక్కులయందును దాని రూపమునే జూచుచు వికలుఁడనై ఖేదమందుచున్నాను.

ఇది కూడ నసంగత్యలంకారమున కుదాహరణమే ఖేదము జనించుటకు గారణ మైన గమనశ్రమ ఆమెయందు న్నది. యువకులు ఖేదమును వహించుచున్నారు.

*మథురాగమనోన్ముఖే మురారా*
*వసుధారాలి భృతాం వ్రజాఙ్గనానామ్.*
*ప్రలయజ్వలనాయతే స్మ రాకా*
*భవనాకాశ మభూ యతామ్బురాశిః.* 76

తా :- మురారి మథురా నగరమునకుఁ బోవుచున్నాఁడు. గోపకాంతలకు ప్రాణములు భరించుట కష్ట మైపోయినది. పున్నమ ప్రళయకాలమునందలి యగ్నిగా భాసించినది. భవనాకాశ మంబురాశి యైనది.*

*కేలీమన్దిరమాగతస్య శనకైరాలీరపాస్యేఙ్గితైః*
*సుప్తాయాః సరుషః సరోరుహదృశః సంవీజనం కుర్వతః.*

* భవనావచ్ఛిన్న మైన పరిమితాకాశముకూడ అనంతప్రళయసముద్రమైనది అని భావము.

జానస్త్యావ్యనభిజ్ఞయేవ కపటవ్యామీలితాక్ష్యా సఖి !
శ్రాన్తాసీత్యభిధాయ వక్షసి తయా పాణిర్మమాసజ్జితః. 77

తా :- ఆమె కోపము గొని శయనాగారమందు బండుకొని యున్నది. నేను వోయితిని. చెలికత్తెలను సైగతో బయటి కంపి కోపముగొన్న యామెకు వీవ మొదలు పెట్టినాను. నే వచ్చిన దామె యెఱుగును. ఎరిగియు యెఱుగనట్లే కన్నులు మూసికొని మాటలాడు చున్నది. "సఖీ ! ఎంత పొద్దునుండి వీచు చున్నావు ! అలసిపోయితివి. పాపము !" అని ఆమె నా చేయి తీసికొని హృదయమం దుంచికొన్నది.

మాన్థర్యమాప గమనం సహ శైశవేన
రక్తం సహైవ మనసాధరబిమ్బమాసీత్.
కిం చాభవన్మృగకిశోరదృశో నితమ్బః
సర్వాధికో గురురయం సహ మన్మథేన. 78

తా :- శైశవముతో పాటు గమనము గూడ మంథరత్వము వహించినది; మనస్సుతోఁ బాటు అధరబింబము రక్త మైనది. హరిణాక్షియొక్క నితంబము మన్మథునితో పాటు సర్వాధిక మైన గురుత్వమును వహించినది.

వి :- శైశవము మంథరత్వమును వహించిన దనఁగా దాని ప్రభావము తగ్గిన దని యర్థము. యౌవనోదయమందు మదమంథరగమనత్వ మలవడినది.

"రక్తమ్" = రాగయుక్త మని భావము. మనస్సు అనురాగయుక్త మైనది. పెదవి ఎఱ్ఱ నైనది.

శ్వాసోఽనుమానవేద్యః
శీతాన్యఙ్గాని నిశ్చలా దృష్టిః.
తస్యాః సుభగ కథేయం
తిష్ఠతు తావత్కథాన్తరం కథయ. 79

తా :- ఓయీ ! ఆమె శ్వాసము అనుమానవేద్య మైనది; అంగములు శీతలము లైనవి. దృష్టి నిశ్చలము. "సరి ! సరి ! - ఈ కథ యుండనీ లెమ్మ ! మరి యొక వృత్తాంతము చెప్పుము."

పాణౌ కృతః పాణిరిలాసుతాయాః
సస్వేదకమ్పో రఘునన్దనేన.
హిమామ్బుమన్దానిలవిహ్వలస్య
ప్రభాతపద్మస్య బభార శోభామ్. 80

తా :- మైథిలిపాణియందు రఘునందనుఁడు వివాహసమయమున దన పాణి నుంచినాఁడు. అతని (ఆమె) చేయి సాత్త్విక భావముతో, స్వేదకంపమైనది. సీతాదేవి పాణితలము హిమాంబుమందానిలవిహ్వల మైన ప్రభాతపద్మము యొక్క శోభను వహించినది.

వి :- మందానిలమునకు కమలము కదలిన ట్లామె చేయి గదలు చున్నది. హిమాంబువు లట్లు సాత్త్వికోదయ మైనది.

అరుణమపి విద్రుమద్రుం
మృదులతరం చాపి కిసలయం బాలే.
అధరీకరోతి నితరాం
తవాధరో మధురిమాతిశయాత్. 81

తా :- నీ పెదవి ఎఱ్ఱదనములో పవడము నెదిర్చినది. మార్దవమునందు పల్లవము నెదిర్చినది. మాధుర్యముతో వీనికిసాటి నీ పెదవికి లేనేలేదు.

పరపూరుష దృష్టిపాతవజ్రా
హతిభీతా హృదయం ప్రియస్య సీతా.
అవిశత్పరకామినీభుజఙ్గీ
భయతః సత్వరమేవ సోపి తస్యాః. 82

తా :- పరపురుషుని దృష్టిపాత మనెడు వజ్రాహతికి దలకి వలె సీత రాముని హృదయమునుఁ జొచ్చెను. పరభామినీభుజంగభయమున వలె అతడును ఆమె హృదయమును జొచ్చెను.

జమ్బీరశ్రియమతిలంఘ్య లీలయైవ
వ్యానమ్రీకృతకమనీయహేమకుమ్భౌ.
నీలామ్భోరుహనయనేఽధునా కుచౌ తే
స్పర్ధేతే కిల కనకాచలేన సార్ధమ్. 83

తా :- తరుణీ ! నీ స్తనములు లీలగా జంబీరఫల లక్ష్మిని గెలిచినవి. వ్యానమ్రీకృతకమనీయహేమకుంభము లైనవి. ఇపుడు నీలాంభోరుహనయనా ! కనకాచలముతో స్పర్ధించుచున్నవి.

అఙ్గాని దత్త్వా హేమాఙ్గి !
ప్రాణాన్ క్రీణాసి చేన్నృణామ్.
యుక్తమేతన్నతు పునః
కోణం నయనపద్మయోః. 84

తా :- ఓసీ హేమాంగీ ! అంగముల నొసగి నరుల ప్రాణములను విలిచి కొంటి వేని యది యుక్తమే ! కాని నయనకోణములతో విలిచి కొనుట యుక్తము గాదు.

జితమౌక్తిక సమ్పదాం రదానాం
సహ వాసేన పరాం ముదం దధానమ్.
విరసాదధరీకరోతి నాసా
మధునా సాహసశాలి మౌక్తికం తే. 85

తా :- మౌక్తికముల శోభలు గెలిచిన రదములతోడి సహవాసముచేత నితాంత సంతోషమును ధరించి నీ నత్తు ముత్యము అది నాసనే యధరీకరించినది; మహాసాహసశాలి.

నిశామ్య భూయో నిజగౌరిమాణం
మా నామ మానం సహసైవ యాయాః.
గృహే గృహే పశ్య తవాఙ్గవర్ణా
ముగ్ధే సువర్ణావలయో లుఠన్తి. 86

తా :- తరుణీ! నీ దేహము యొక్క గౌరవర్ణమును దలచికొని పెద్దగా గర్వింపకుము. నీవే చూడుము. ప్రతి గృహమునందును నీ యంగ వర్ణము గలిగి సువర్ణము దొరలుచునే యున్నది.

కరికుమ్భతులామురోజయోః
క్రియమాణాం కవిభిర్విశృఙ్ఖలైః.
కథమాలి శృణోషి సాదరం
విపరీతార్థవిదో హి యోషితః. 87

తా :- సఖీ! కవులందరు స్తనమండలములను కరికుంభములతోఁ బోల్చుచున్నారు. వారు విశృంఖలులు గనుక అట్లుఁ బోల్చుటలోని యౌచిత్యము నూహించుటలేదు; నీవును గూడ వాని వాక్యములు వినుచునే యున్నావు. కరికుంభములు సాటికావని నీ భావమేమో! సామాన్యముగా స్త్రీలు విపరీతార్థమును గ్రహించువారు గదా!

తిరస్కృతో రోషవశాత్పరిష్వజ
న్ప్రియో మృగాక్ష్యా శయితః పరాఙ్ముఖః.
కిం దుఃఖితోఽసావితి కాందిశీకయా
కయా చిదాచుమ్బ్య చిరాయ సస్వజే. 88

తా :- అతఁ డామెను గౌగిలించెను. ఆమె రోషముతోఁ దిరస్కరించినది. వాఁడు మారుమొగమై పరుండెను. ఇంతలో వాఁడు దుఃఖపడు నేమో యని యామెకు భయము; వెంటనే ప్రియు నిటు ద్రిప్పి చుంబించినది.

వేలాప్లుతేనావనశీతరశ్మిం
సంప్రజ్వలతీనాం హరిదృశ్వరీణామ్,

వ్రజాఙ్గనానాం స్మరజాతకమ్పా
దకాణ్డసంపాత మియాయ నీవీ. 89

తా :- ఆ వ్రజాంగనలు పైటకొంగులతో తమ ముఖచంద్రులను దాచి హరిని జూచుచుండిరి. ఇంతలో స్మరజాతకంపములై అకాండముగ వారి నీవులు వదలినవి.

వి :- "దృశ్వరీణాం = చూచుచున్నవారికి: పటిష్ఠమైన పదము.
"అకాండసంపాతం" = మంచి సమాసము.
"సంవృణ్వతీనాం" = శత్రంతశబ్దముపై స్త్రీప్రత్యయము.

అధరేణ సమాగమాద్రదానా
మరుణిమ్నా విహితోపి శుక్లభావః.
హసితేన సితేన పక్ష్మలాక్ష్యాః
పునరుల్లాసమవాప జాతపక్షః. 90

తా :- ఆమె పండ్లు తెల్లనివి; పెదవి ఎఱ్ఱనిది. పలువరుసయొక్క తెలుపు రంగు పెదవి రంగుతోఁ గప్పఁబడినది. ఇంతలో యామె చిరునవ్వు బూనెను. మరల పలువరస యొక్క తెల్లని రంగు ప్రకాశింపఁ జొచ్చినది.

శయితా సవిధేఽప్యనీశ్వరా
సఫలీకర్తుమహో మనోరథాన్.
దయితా దయితాననామ్బుజం
దరమీలన్నయనా నిరీక్షతే. 91

తా :- ఆమె సెజ్జపైననేఁ బండుకొన్నది. లేవలేదు. మనసులోఁ గోర్కె లేమో యున్నవి. అవి సఫల మగుటకై దరమీలన్నయనములతోఁ బ్రియునిఁ జూచుచున్నది.

నయనే వహతాం సు ఖఞ్జనానా
మిహ నానావిధమఙ్గభఙ్గభాగ్యమ్.

ముఖమేతు తులాం కథం సుశోభం
సుదృశోభఙ్గుర సమ్పదామ్బుజేన. 92

తా :- నయనములు ఖంజన పక్షుల యంగభంగసౌభాగ్యమును బొందుగాక ! ముఖము భంగురసంపద గల యంబుజముతో నెట్లు సంవదించును ?

ఉదితం మణ్డలమిన్దో
రుదితం సద్యో వియోగివర్గేణ.
ముదితం చ సకలలలనా
చూడామణిశాసనేన మదనేన. 93

తా :- చంద్రమంతల ముదయించినది. వియోగులు దుఃఖితులు. సకలలలనాచూడామణి శాసనుడై మన్మథుఁడు సంతోషించినాఁడు.

ఇదమప్రతిమం పశ్య
సరః సరసిజైర్వృతమ్.
సఖే! మా జల్ప నారీణాం
నయనాని దహన్తి మామ్. 94

తా :- చెలికాఁడా ! సరసిజములచేత పరివృత మైన యీ సరస్సును జూడుము. అప్రతిమముగా నున్నది. స్త్రీల యొక్క నయనములు నన్ను దహించుచున్న వని యిఁక మీద ననకుము. *

గురుమధ్యే హరిణాక్షీ
మార్తికశకలైర్నిహన్తుకామం మామ్.
రదయన్తి 9తరసనాగ్రం
తరలితనయనం నివారయాంచక్రే. 95

* మిత్రమా ! ఇక చెప్పకుము. నారీనయనములు నన్ను దహించి వేయుచున్నవి.

తా :- ఆ హరిణాక్షి గురుమధ్య మందుండెను. నేను మంటిబెడ్డలతో నామెను వేయఁ దలఁచితిని. నా యభిప్రాయ మామె యెఱిగి రదయంత్రిత రసనాగ్రముగా నిషేధించెను. తరళిత నయనముగా నివారించెను.

అధిరజని ప్రియసవిధే
కథమపి సంవేశితా గురుభిః.
కిం భవితేతి సశఙ్కం
పఙ్కజనయనా పరామృశతి. 96

తా :- రాత్రి యైనది. ప్రియుని యొక్క సన్నిధానమునఁ బెద్ద లామెను గూర్చుండ బెట్టిరి. ఆ పంకజనయన పై నేమి జరుగునో యని గజిబిజిపడి నిరీక్షించుచున్నది.

న్యాఞ్చతి వయసి ప్రథమే
సముదఞ్చతి తరుణిమని సుదృశః.
దధతిస్మ మధురిమాణం
వాచో గతయశ్చ విభ్రమాశ్చ భృశమ్. 97

తా :- ప్రథమ వయస్సు. నూతనోదయ మైన యవ్వనము. ఆమె వాక్కులు గతములు, విభ్రమములు, మాధుర్యములతో నిండినవి.

ఔత్సుక్యాత్పరిమిలతాం
త్రపయా సఙ్కోచమఞ్చతాం చ ముహుః.
నవసంగమయోర్యూనో
ర్నయనానాముత్సవో జయతి. 98

తా:- ఔత్సుక్యముతోఁ బరస్పరము గలిసికొనుచున్నవి; సిగ్గుతో సంకోచము నందుచున్నవి! నూత్న సంగమమందు యువతీ యువకుల నయనోత్సవము లప్రతిహతములు.

సుదృశో జితరత్నజాలయా
సురతాన్తశ్రమ బిన్దుమాలయా.

*అలికేన చ హేమకాన్తినా*
*విదధే కాపి రుచిః పరస్పరమ్.* 99

తా :- ఆ తరుణిని శ్రమబిందుమాల యాక్రమించినది; అది జిత రత్నమాల; హేమకాంతి గల నుదు రున్నది; శ్రమబింపు మాలాకాంతులు నుదుటి హేమకాంతులు పరస్పరము గలిసికొని క్రొత్త కాంతిని వెలార్చు చున్నవి.

వి :- బంగారులో రత్నములుఁ బొదిగిగసట్లున్న దని పిండితార్థము.

*కిమితి కృశాసి కృశోదరి*
*కిం తవ పరకీయవృత్తాన్తైః.*
*కథయ తథాపి ముదే మమ*
*కథయిష్యతి పథిక తవ జాయా.* 100

తా :—ఓసీ! కృశోదరీ! ఎందు కిట్లు గృశించితివి? పరకీయల వృత్తాంతము నీ కెందుకు? అయినను నా సంతోషమునకుఁ జెప్పుము. ఓరీ! పాంథుఁడా! నీ భార్య చెప్పును పొమ్ము.

వి :- నా నాథుఁడు పరదేశమున కేగుటచే నేను గృశించినాను. నీవు యిల్లు విడిచి వచ్చుటచే నీ భార్యయు నిట్లే గృశించి యుండును. పోయి యామె నడుగు మనుచున్నది.

*వదనారవిన్దసౌరభ*
*లోభాదిన్దిన్దిరేషు నిపతత్సు.*
*మయ్యధరార్థిని సుదృశో*
*దృశో జయన్త్యతిరుషా పరుషాః.* 101

తా :- వదనారవిందసౌరభమునందలి యాశతో తేంట్లు పై పై వ్రాలుచున్నవి; ఇంతలో నే నధరార్థినై మొగముపై వ్రాలితిని; ఆమె కోపముతో నా వైపుఁ జూచినది. ఆ ఎఱ్ఱని కాంతులకు జయమగు గాక.

సరసిరుహోదరసురభా
వధరితబిమ్బాధరే మృగాక్షి తవ.
వద వదనే మణిరదనే
తామ్బూలం కేన లక్షయేమ వయమ్. 102

తా :- ఓసీ! నీ మొగము సరసిరుహోదరకాంతిని ధిక్కరించుచున్నది. దాని నెత్తావిని గూడ గల్గి యున్నది. నీ యోష్ఠరక్తిమ బింబమునుఁ దిరస్కరించుచున్నది. ఇంక మేము తాంబూలరక్తిమనుఁ గనుగొను టెట్లో జెప్పుము.

# కరుణా సముల్లాసము

దైవే పరాగ్వదనశాలిని హన్త! జాతే
యాతే చ సంప్రతి దివం ప్రతి బంధురత్నే.*
కస్మై మనః కథయితాసి నిజామవస్థాం
కః శీతలైః శమయితా వచనైస్తవాధిమ్. 1

తా :- దైవము పరాఙ్ముఖుఁ డైనాఁడు. నీకుఁ గావలసిన బంధువర్గము వెడలిపోయినారు. ఓ మనసా ! ఇఁక నెవరితో సీ గోడును చెప్పికొందువు ? చల్లని వాక్కులతో నీ హృదయదుఃఖమును బోగొట్టువా రెవ్వరు ?

ప్రత్యుద్గతా సవినయం సహసా పురేవ
స్మేరైః స్మరస్య సచివైః సరసావలోకైః.
మామద్య మఞ్జురచనైర్వచనైశ్చ బాలే
హా లేశతోపి న కథం శిశిరీకరోషి. 2

తా :- బాలా! యింతకు ముందు సవినయముగా నా కెదురువచ్చుచుంటివి. సరసావలోకములతో నన్నుఁ జూచెడిదానవు. మన్మథున కనుంగు నెచ్చెలి యైన చిరునవ్వులతో నన్నలరించుచుంటివి. మంజురచనము లైన వచనములతో నోదార్చుచుంటివి. ఇపుడు నన్ను లేశము గూడ చల్లబరుపవు.

సర్వేపి విస్మృతపథం విషయాః ప్రయాతా
విద్యాపి ఖేదగలితా విముఖీబభూవ.
సా కేవలం హరిణశావకలోచనా మే
నైవాపయాతి హృదయాదధిదేవతేవ. 3

---

* బంధురత్నమనగా శ్రేష్ఠమైన బంధువు - భార్య.

తా :- సర్వ విషయములును విస్మృతిపథము నందికొన్నవి. చదివిన విద్యయు ఖేదగళితమై విముఖీభావమును వహించినది. కేవలహరిణశాబకలోచన మాత్రము అధిదేవతవలె నా హృదయమునుండి బోవుటయేలేదు.

నిర్వాణమఙ్గలపదం త్వరయా విశన్త్యా
ముక్తా దయావతి! దయాపి కిల త్వయాసౌ.
యన్మాం న భామిని నిభాలయసి ప్రభాత
లీలారవిన్దమదభఙ్గిమదైః* కటాక్షైః. 4

తా :- త్వరగా నిర్వాణమంగళ పదము నందికొనుచున్న నీ చేత దయ గూడ యిక్కడనే వదలిపెట్టఁబడినది. అందుచేతనే ప్రభాత లీలారవిందమద భంగిమదముగలిగిన కటాక్షములతో నన్నుఁ జూడకున్నావు.

ధృత్వా పదస్ఖలనభీతివశాత్కరం మే
యారూఢవత్యసి శిలాశకలం వివాహే.
సా మాం విహాయ కథమద్య విలాసిని ద్యా
మారోహసీతి హృదయం శతధా ప్రయాతి. 5

తా :- వివాహకాలమందు పడిపోవుదు నను భయముచేత నా కరము నూతగా గొని సన్నెకల్లు ద్రొక్కితివి; విలాసినీ! అట్టి నీవు నన్ను వదలి యొంటిగా స్వర్గమున కేగితి వను నూహ గూడ నా హృదయమును వేయి వ్రక్క లొనర్చుచున్నది.

నిర్దూషణా గుణవతీ రసభావపూర్ణా
సాలంకృతిః శ్రవణకోమలవర్ణరాజిః.
సా మామకీనకవితేవ మనోభిరామా
రామా కదాపి హృదయాన్మమ నాపయాతి. 6

తా:- ఆమె నా కవితవంటిది. నిర్దోష; గుణవతి; రసభావపూర్ణ; సాలంకృతి; శ్రవణముల నలరించు వర్ణరాజి గలిగినది. మనోభిరామ; ఆమె నా హృదయము నెప్పుడును బాసిపోదు.

* "మదభఞ్జకరైః" అని పాఠాంతరము.

వి :- కవిత్వముతోఁ గూడ దోషము లుండరాదు; రసానుగుణము లైన గుణము లుండవలెను. రసస్ఫోరకము లైన భావములు గావలెను. అలంకారము లుండవలెను. మధురమైన వర్ణముల కూటమి రావలెను. అప్పుడే యా కవిత మనోభిరామ మగును.

చిన్తాం జహామ సకలాపి సరోరుహాణా
మిన్దోశ్చ బిమ్బమసమాం సుషమామయాసీత్.
అభ్యుద్గతాః కలకలాః కిల కోకిలానాం
ప్రాణప్రియే ! యదవధి త్వమితో గతాసి. 7

తా: :- ప్రాణప్రియా ! నీ విటనుండి వెడలిపోయితివి. ఇఁక నేమున్నది. పద్మముల చింత దొలగినది; చంద్రబింబము కాంతిని వహించినది; కోకిలల కలకల లారంభ మైనవి.

వి :- అనఁగా నామె బ్రతికియున్నప్పుడు సరోరుహముల కాంతి దోచుటలేదు. ఆమె కన్నులచే వాని కాంతి క్రింద పరుపబడినది. ఇట్లే తక్కినవి.

సౌదామినీవిలసితప్రతిమానకాణ్డే
దత్త్వా కియన్త్యపి దినాని మహేన్ద్రభోగాన్.
మన్త్రోజ్ఝితస్య నృపతేరివ రాజ్యలక్ష్మీ
ర్భాగ్యచ్యుతస్య కరతో మమ నిర్గతాఽసి. 8

తా :- మెఱపుల పంటి కాంతి గలిగిన కొన్ని దినములు మహేంద్ర భోగము నందించితివి. మంత్రము లేని మానవాధిపుని రాజ్యలక్ష్మి వలె నా కరమునుండి జారిపోయితివి.

వి :- సుఖములలో దినములు తెలియకనే మెఱపుల వలె గడచిపోవును. దుఃఖములలో దీర్ఘములుగా భాసించును. మంత్రమనగా మంత్రులతో నాలోచించుట.

కేనాఽపి మే విలసితేన సముద్గతస్య
కోపస్య కిం ను కరభోరు వశంవదాభూః.[1]
యన్మాం విహాయ సహసైవ పతివ్రతాఽపి
యాతాసి ము క్తిరమణీసదనం విదూరమ్. 9

తా:- కరభోరూ ! నీ కోపము నే నేవిధమున బోగొట్టఁగలను ? ఏ యుపాయమున నిన్ను వశంవద నొనర్చుకొనెదను ? పతివ్రత వైనను నన్ను వదలి ము క్తిరమణీసదనమునకు వెడలితివి. అది చాల దూరముగ నున్న దాయెను.

కావ్యాత్మనా మనసి పర్యణమన్పురా మే
పీయూషసారసరసా స్తవ యే విలాసాః.
తాన న్తరేణ రమణీరమణీయశీలే
చేతోహరా సుకవితా భవితా కథం నః. 10

తా :- నీయొక్క యనర్ఘము లైన విలాసములె నామనస్సున కావ్యాత్మగా భాసించినవి. అవి పీయూషసారములైన రచనలుగా వెలికి వచ్చినవి. రమణీ రమణీయశీలా! ఆ విలాసములు లేనిది ఆ కవిత మా మనస్సు నెట్లు లోగొనును?[2]

యా తావకీనమధురస్మితకా న్తికా న్తే
భూమండలే విఫలతాం కవిషు వ్యతానీత్.
సా కాతరాక్షి ! విలయం త్వయి యాతవత్యాం
రాకాధునా వహతి వైభవమిన్దిరాయాః. 11

తా :- కాతరాక్షి! నీవున్నయపుడు తావకీనమధురస్మితములచే భూమండల మంతయు కాంతివంతముగ నుండెను. అప్పుడు పున్నమ దన శోభను జూపుట లేదు; నీవు బోయిన వెంటనే పున్నమ పున్నమయై కాంతిని వెలార్చుచున్నది.

మన్దస్మితేన సుధయా పరిషిచ్య యా మాం
నేత్రోత్పలైర్వికసితైరనిశం సమీక్షె

1 ''నే నేదో అపరాధము చేయుటచే నీకు కోపము వచ్చినదా ?'' అని అక్షరార్థము.

2 అట్టి చేతోహర మగు కవిత నాకిక ఎట్లు లభించును ?

*సా నిత్యమఙ్గలమయీ గృహదేవతా మే*
*కామేశ్వరీ హృదయతో దయితా న యాతి.* 12

తా:- సుధామయ మైన చిరునవ్వులతో నన్నభిషేకించెను. వికసితములైన నేత్రోత్పలములతో నన్నుఁ బూజించెను. ఆమె నా నిత్యమంగళమయి నా గృహదేవత; నా కామేశ్వరి; నా హృదయమునుండి యామె దొలగిపోవుటయే లేదు.

*భూమౌ స్థితా రమణ నాథ మనోహరేతి*
*సమ్బోధనైర్యమధిరోపితవత్యసి ద్యామ్.*
*స్వర్గం గతా కథమివ క్షిపసి త్వమేణ*
*శావాక్షి తం ధరణిధూలిషు మామిదానీమ్.* 13

తా:- ఓ ! హరిణాక్షీ ! నీవు బ్రతికి యున్నపుడు "రమణా ! నాథా! మనోహరా !" యిత్యాది సంబోధనములతో నన్నాకాశమున కెత్తుచుంటివి. నేడు స్వర్గగతవై నన్ను ధరణీధూళులందు ద్రోసిపోయితివి. ఇందుకు నీ మన సెటు లొప్పెను ?

*లావణ్యముజ్జ్వలమపాస్తతులం చ శీలం*
*లోకోత్తరం వినయమర్థమయం నయం చ.*
*ఏతాన్గుణానశరణానథ మాం చ హిత్వా*
*హా హన్త సున్దరి కథం త్రిదివం గతాసి.* 14

తా :- ఉజ్వల మైన లావణ్యము, అపాస్తతుల మైన శీలము, లోకోత్తర మైన వినయము,అర్థమయనయము,ఇవి లోకమున నొక్కచో నుండుట దుర్లభము; అవన్నియు నీ కమరి యుండెను. వానిని; నన్ను నీ ప్రపంచమునఁ ద్రోసి పోయితివి. *

* నీవు పోవుటతో ఆగుణములకును, నాకును ఇక శరణమేదియు లేదని యర్థము.

తాన్త్వా సువర్ణవరయా పరయా చ శుద్ధ్యా
నిత్యం స్వకాః ఖలు శిఖాః పరితః క్షిపన్తీమ్.
చేతోహరామపి కుశేశయలోచనే ! త్వాం
జానామి కోపకలుషో దహనో దదాహ. 15

తా :- కుశేశయలోచనా ! నీపై యా యగ్నికిఁ గోపము; నీవును వాని వలెనే సువర్ణమయకాంతిగలిగిన దానవు; వాని వలెనే పరిశుద్ధవు; కాని యొక్క భేదమున్నది. నీవు నిరంతరము చేతోహరవు. వాని వైపుఁ జూచుటకే సాధ్యము గాదు. తన్నుఁ బోలితి వన్న కోపముచే అగ్ని నిన్ను దహించినది.

కర్పూరవర్తిరివ లోచనతాపహన్త్రీ
ఫుల్లామ్బుజస్రగివ కణ్ఠసుఖైకహేతుః.
చేతశ్చమత్కృతిపదం కవితేవ రమ్యా
రమ్యా నరీభిరమరీవ హి సా విరేజే. 16

తా :- ఆమె కర్పూరవర్తి వలె లోచనతాపహంత్రి. ఫుల్లాంబుజస్రజము వలె కంఠసుఖైకహేతువు. చేతశ్చమత్కృతిపదమై కవిత వలె రమ్యమైనది ఆమె నరకాంతలలో దేవకాంత వలె భాసించినది.

స్వప్నేऽపి స్తరేపి ఖలు భామిని పత్యురన్యం
యా దృష్టవత్యసి న కం చన సాభిలాషమ్.
సా సమ్ప్రతి ప్రచలితాసి గుణైర్విహీనం
ప్రాప్తుం కథం కథయ హన్త వరం పుమాంసమ్. 17

తా :- ఓసీ ! భామినీ ! స్వప్నమందైనను, నీ పతిని దప్ప నితరులను సాభిలాషముగ జూచి యెఱుగవు. అట్టి దాని విప్పుడు గుణవిహీనుఁ డైన పర పురుషు నెట్లు బొందితివి ?

వి :- ''పరంపుమాంసమ్'' = పరాయి పురుషుఁడని యొక యర్థము, పరమపురుషుఁ డైన భగవంతుఁ డొక యర్థము. ''గుణైర్విహీనం'' = సద్గుణములు లేనివాఁ డని యర్థము. పరమేశ్వరున కే గుణమును లేదు గదా !

*దయితస్య గుణానమస్మరన్తీ*
*శయనే సప్రమృతి యా విలోకితాసీత్.*
*అధునా ఖలు హన్త సా కృశాఙ్గీ*
*గిరమఙ్గీకురుతే న భాషితాపి.* **18**

తా :- దయితుని గుణములనే దలపోసికొనుచు సెజ్జపై బరుండి యుండె డిది. ఆ కృశాంగి నేఁడు పలుకరించినను బల్కుటలేదు.

*రీతిం గిరామమృతవృష్టికరీం తదీయాం*
*తాం చాకృతిం కృతివరైరభినన్దనీయామ్.*
*లోకోత్తరామథ కృతిం కరుణారసార్ద్రాం*
*స్తోతుం న కస్య సముదేతి మనఃప్రసారః.* **19**

తా :- ఆమె వచోరీతి అమృతమును వర్షించినది. ఆమె యాకృతి మనస్సుగలవారిచే నభినందనీయము. ఆమె చేతలు కరుణారసార్ద్రములు. లోకోత్తరములు. ఆమెను నుతింప నెవరి హృదయ మిష్టపడదు ?



# శాంత సముల్లాసము

*విశాలవిషయాటవీవలయలగ్నదావానల*
*ప్రసృత్వరశిఖావలీవికలితం మదీయం మనః.*
*అమన్దమిలదిన్దిరే నిఖిలమాధురీమన్దిరే*
*ముకున్దముఖచన్దిరే చిరమిదం చకోరాయతామ్.* 1

తా :- విశాలవిషయాటవిని వలయాకారమున దావాగ్ని జుట్టికొన్నది. దానితో నా మనస్సు వికలము. అమందమిలదిందిరమై మాధురీమందిరమైన ముకుందుని ముఖచంద్రునియందు, నా మనస్సు చకోరమై లగించుగాక !

*అయే జలధినన్దినీనయననీరజాలమ్బన*
*జ్వలజ్జ్వలనజిత్వరజ్వరభరత్వరాభఙ్గురమ్.*
*ప్రభాతజలజోన్నమద్గరిమగర్వసర్వంకషై*
*ర్జగత్త్రితయరోచనైః శిశిరయాశు మాం లోచనైః.*

తా :- లక్ష్మీదేవియొక్క నయననీరజాలంబనము వలె పరమశాంతములై, సమస్త దుఃఖముల బోకార్చునవి నీ కన్నులు. స్వామీ ! అగ్నికన్నను వేడి యైన జ్వరముతో బాధపడుచున్నాను. ప్రభాతమునందు వికసించు పద్మములతో సమాన మైనవి, మూడు లోకములకును మనోమోహకములైనవి యైన నీ చూపులతో నా దుఃఖములఁ బోగార్చుము.

వి :- ''సర్వంకష'' = అలుక్ సమాసము.

*స్మృతాపి తరుణాతపం కరుణయా హరన్తీ నృణా*
*మభఙ్గురతనుత్విషాం వలయితా శతైర్విద్యుతామ్.*
*కలిన్దగిరినన్దినీతటసురద్రుమాలమ్బినీ*
*మదీయమతిచుమ్బినీ భవతు కాపి కాదమ్బినీ.* 3

తా :- మనుజులు తలంచినంత మాత్రముననే తరుణాతపమును బోగొట్టును; అభంగురము లైన తనూకాంతులను విద్యుల్లతలచేత చుట్టఁబడినది,[1] యమున యొడ్డున నున్న దేవతరువుల నాశ్రయించినది, ఒక యపూర్వ మైన మేఘమాల. అయ్యది నా మనస్సును చుంబించుగాక !

వి :- కృష్ణుఁడు పురుషోత్తముఁడు. అట్టి పురుషోత్తముని స్త్రీలింగ మైన 'కాదంబిని'తోఁ బోల్చినాఁడు. ఒక క్రొత్త యూహ.

*కలిన్దగిరినన్దినీతటవనాన్తరం భాసయన్*
*సదా పథి గతాగతశ్రమభరం హరన్ప్రాణినామ్.*
*లతావలిశతావృతో మధురయా రుచా సంభృతో*
*మమాప హరతు శ్రమానతితమాం తమాలద్రుమః.* 4

తా :- కళిందగిరినందినీ తటములందున్న వనాంతరము భాసింపజేయునది, పలుమారు యాతాయాతము లొనర్చు ప్రాణుల శ్రమభరమును బోకార్చునది, లతావలిశతావృతము[2] మధురకాంతిచేతఁ గూడియున్నది, కృష్ణుఁ డనెఁడు యొక తమాలద్రుమము నా శ్రమను హరించుగాక !

*వాచా నిర్మలయా సుధామధురయా యాం నాథ శిక్షామదా*
*స్తాం స్వప్నేఽపి న సంస్మరామ్యహమహంభావావృతో నిస్త్రపః.*
*ఇత్యాగశ్శతశాలినం పునరపి స్వీయేషు మాం బిభ్రత*
*స్త్వత్తో నాస్తి దయానిధిర్యదుపతే మత్తో న మత్తోఽపరః.* 5

తా :- సుధామధురమై, నిర్మలములైన వాక్కులతో, స్వామీ! నా కెన్నో తడవలు సదుపదేశ మొనర్చితివి, సిగ్గులేనివాఁడను; లౌకికము లైన భావములతో గూడిన వాఁడను. వానిని స్వప్నమునందు గూడ యొక సారి దలఁపకపోయితిని.

---

1 భంగురములు కాని శరీరకాంతి గల విద్యుచ్ఛతములచే పరివృత మైనది అనగా గోపికాశతపరివృతుడు అని అర్థము.

2 లతావలిశతము లనగా అనేకగోపకాంతలు,

నా తప్పు లెన్నని చెప్పుదును? మూర్ఖకొలది. నా వంటి మత్తుఁడు లేఁడు. నీ వంటి దయానిధి లేఁడు.

పాతాలం వ్రజ యాహి వా సురపురీమారోహ మేరోః శిరః
పారావారపరమ్పరాం తర తథాప్యాశా న శాన్తా తవ.
ఆధివ్యాధిజరాపరాహత యది క్షేమం నిజం వాఞ్ఛసి
శ్రీకృష్ణేతి రసాయనం రసయ రే శూన్యైః కిమన్యైః శ్రమైః. 6

తా :- ఓరీ ! ఆధివ్యాధిజరాపరాహతుఁడా ! పాతాళమునకు బొమ్ము; స్వర్గమున కేగుము; మేరుశిఖరము నధిష్ఠింపుము; సముద్రము లన్నియు దాఁటుము; ఏమి చేసినను నీ యాశ శాంతముగాదు. నిజముగా నీవు క్షేమము నిచ్ఛగించినచో ''శ్రీకృష్ణా'' యనెడు రసాయనమును ద్రావుము. ఇతర పరిశ్రమ లన్నియు వ్యర్థము.

మృద్వీకా రసితా సితా సమశితా స్ఫీతం నిపీతం పయః
స్వర్యాతేన సుధాప్యధాయి కతిధా రమ్భాధరః ఖణ్డితః.
సత్యం బ్రూహి మదీయజీవ ! భవతా భూయో భవే భ్రామ్యతా
కృష్ణేత్యక్షరయోరయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః. 7

తా :- ఓరీ ! జీవా ! ద్రాక్షఫలము లాస్వాదించితివి. చక్కెరలు గలిపి పాలెన్నిసారులో ద్రావితివి. స్వర్గమున కేగి యమృతము నెన్నిమారులో గ్రోలితివి. రంభాధరము నెన్నిసారులో ఖండించితివి. మాటిమాటికి నీ సంసారము నందు వచ్చి పోవుచున్నావు; నిజము చెప్పుము. ''కృష్ణా'' యనెడు నామము నందు గల మధురిమోద్గారము నెచ్చట నైనఁ జూచితివా !

వజ్రం పాపమహీభృతాం భవగదోద్రేకస్య సిద్ధౌషధం
మిథ్యాజ్ఞాననిశావిశాలతమసస్తిగ్మాంశుబిమ్బోదయః.
క్రూరక్లేశమహీరుహాముదతరజ్వాలాజటాలశ్శిఖీ
ద్వారం నిర్వృతిసద్మనో విజయతే కృష్ణేతి వర్ణద్వయమ్. 8

తా :- పాపము లనెడు కొండలకు వజ్రాయుధము, సంసారరోగమునకు సిద్ధౌషధము, మిథ్యాజ్ఞాననిశావిశాలాంధకారమునకు సూర్యోదయము, క్రూర క్లేశము లనెడు వృక్షములకు ఘోరమైన వహ్ని, ఆనందభవనమునకు ద్వారము- "కృష్ణా" యను రెండక్షరములు.

రే చేతః కథయామి తే హితమిదం బృన్దావనే చారయన్
వృన్దం కోఽపి గవాం నవామ్బుదనిభో బన్ధుర్న కార్యస్త్వయా.
సౌన్దర్యామృతముద్గిరద్భిరభితః సంమోహ్య మన్దస్మితై
రేష త్వాం తవ వల్లభాంశ్చ విషయానాశు క్షయం నేష్యతి. 9

తా :- మనసా ! హితము జెప్పుచున్నాను; వినుము. బృందావనవీథులయందు గోవులను దరలించుకొనుచు దిరుగుచున్న నవాంబుదసమానుఁ డైన వాఁడొక్కఁడే నీ బంధువు. తక్కినవారెవ్వరును కారు. వాని నవ్వులు - సౌందర్యామృతము లొలికించునవి. వానిచేతనే వాఁడు నీ యహంకారమును నాశ మొనర్చును; నీకుఁ బ్రియము లైన విషయములను నిర్నామము సేయును.*

అవ్యాఖ్యేయాం వితరతి పరాం ప్రీతిమన్తర్నిమగ్నా
కణ్ఠే లగ్నా హరతి నితరాం యాన్తరధ్వాన్తజాలమ్.
తాం ద్రాక్షాద్యైరపి బహుమతాం మాధురీముద్గిరన్తీమ్
కృష్ణేత్యాఖ్యాం కథయ రసనే యద్యసి త్వం రసజ్ఞా. 10

తా:- ఓసీ ! నాలుకా! ఇట్టి దట్టి దని చెప్పుట కసాధ్య మైన ప్రీతి నొలుక బోయును. ఆ ప్రీతి, లౌకిక మైన దాని వలె నోటినుండి వచ్చునదిగాదు. హృదయమునుండి వచ్చునది. అది కంఠమునందు మొదటనున్నచోఁ జాలును హృద

* ఆతనితో నీ వెన్నడును సంబంధము పెట్టుకొనకుము. నిన్ను చిరునగవులతో మోసగించి నీ కిష్టమైన విషయముల నన్నింటిని కాజేయును అని చమత్కార వచనము.

యమం దున్న చీకటియంతయుఁ బటాపంచలగును.* ద్రాక్షాఫలాది సమస్త మధురములకంటెను మధుర మైనది. నీకు 'రసజ్ఞ' యను పే రున్నది. ఆ పేరును సార్థకపరుపఁ దలచికొన్నచో కృష్ణనామము నుచ్చరించుము.

వి:- ''రసజ్ఞ'' = నాలుక. ఇది రూఢ్యర్థము. రసము నెఱుగునది యని యౌగికార్థము.

సన్త్యేవాస్మి ఞ్జగతి బహవః పక్షిణో రమ్యరూపా
స్తేషాం మధ్యే మమ తు మహతీ వాసనా చాతకేషు.
యైరధ్యక్షై రథ నిజసఖం నీరదం స్మారయద్భిః
చిత్తారూఢం భవతి కిమపి బ్రహ్మ కృష్ణాభిధానమ్. 11

తా:- లోకమం దనేకపక్షు లున్నవి. అవన్నియు రమణీయము లైనవే! కాని నాకెందుకో వానిలో చాతకము లన్న చాల యిష్టము. దానికి గారణ మున్నది. అవి కృష్ణ మైన నీరదమునే కన్నుల యెదుట నుంచికొని వేకారుచుండును. వానినిఁ జూచి నంతనే నాకు కృష్ణాభిధాన మైన పరబ్రహ్మ చిత్తమందు మెదలును.

వి:- కృష్ణనీరద మనగా నల్లగా నుండెడి మేఘ మని యర్థము.

విష్వద్రీచ్యా భువనమఖిలం భాసతే యస్య భాసా
సర్వాసా మప్యహమితి విదాం ప్రత్యయాలంబనం యః.
తం పృచ్ఛన్తి స్వహృదయతలావేదినో విష్ణుమన్యా
నన్యాయోఽయం శివశివ నృణాం కేన వా వర్ణనీయః. 12

తా:- సమస్తమునందు వ్యాపించిన ఎవని తేజస్సుచే సమస్తమునుఁ బ్రకాశించుచున్నదో, ఎవడు సమస్తజీవుల కహంప్రత్యయాలంబనమో వానిని

* శ్రీకృష్ణనామము మనస్సులో నిలిచినచో వర్ణనాతీత మగు ప్రీతిని కలిగించును. పైపైన కంఠములో ఉన్నపుడుగూడ ఆంతర మగు అంధకారము నంతను తొలగించును.

గూర్చి ఇతరులను- ''వాఁడెక్కఁడున్నాఁడని"- ప్రశ్నింతురు. ''శివ ! శివా!'' తమ హృదయతలమునే గుర్తింపజాలని ఇట్టి వారికెట్లు తెలియఁజెప్పవలెను?

*సేవాయాం యది సాభిలాషమసి రే లక్ష్మీపతిః సేవ్యతాం*
*చిన్తాయామసి సస్పృహం యది తదా చక్రాయుధశ్చిన్త్యతామ్.*
*ఆలాపం యది కాంక్షసి స్మరరిపోర్గాథా తదాలప్యతాం*
*స్వాపం వాఞ్ఛసి చేన్నిరర్గలసుఖే చేతః సఖే సుప్యతామ్. 13*

తా:- ఓ చిత్తమా! సేవించుటయందు నీకభిలాష యున్నచో లక్ష్మీపతిని సేవింపుము; ధ్యానమందు స్పృహయున్నచో చక్రాయుధునిఁ జింతింపుము. పలుక వలె ననెడి యాశ యున్నచో పరమశివుని గాథలు వర్ణింపుము. నిద్రాసక్తి యున్నచో మౌనివై ఆత్మావలోకనసుఖమున నిద్రింపుము.

*భవగ్రీష్మప్రౌఢాతపనివహసంతప్తవపుషో*
*బలాదున్మూల్య ద్రాఙ్నిగడమవివేకవ్యతికరమ్.*
*విశుద్ధేఽస్మిన్నాత్మామృతసరసి నైరాశ్యశిశిరే*
*విగాహన్తే దూరీకృతకలుషజాలాః సుకృతినః. 14*

తా:- కొందరు సుకృతు లున్నారు. వారు గజేంద్రుల వంటి వారు. భవగ్రీష్మప్రౌఢాతపములు వారి శరీరములను దహించును. అపుడు వారు అవివేక మనెడు బంధమును బలవంతముగాఁ ద్రెంచికొందురు. ఆత్మ యనెడు అమృతసరస్సున దోగెదరు. అది నైరాశ్యశిశిర మైనది. పాపము లా వంకకు బోనేరవు.

*బన్ధోన్ముక్త్యై ఖలు మఖముఖాన్ కుర్వతే కర్మపాశా*
*నన్తఃశాన్త్యై మునిశతమతానల్పచిన్తాం భజన్తి.*
*తీర్థే మజ్జన్త్యశుభజలధేః పారమారోఢుకామాః*
*సర్వం ప్రామాదికమిహ భవభ్రాన్తిభాజాం నరాణామ్. 15*

తా :- బంధములనుండి విముక్తు లగుటకొరకు అనేకయజ్ఞము లొనర్తురు. అవన్నియు కర్మపాశములే ! అంతశ్శాంతికొరకు పరశ్శతఋషు లొనర్చిన

వివిధమార్గములను చింతింతురు. అశుభజలధియొక్క తీరమును జేరుటకై వివిధ తీర్థములందు మునింగెదరు. ఇవన్నియు సంసారభ్రాంతి దూషిత మానవుల ప్రామాదికచేష్టలు. *

ప్రథమం చుమ్బితచరణా
జఙ్ఘాజానూరునాభిహృదయాని.
ఆలిఙ్గ్య భావనా మే
ఖేలతు విష్ణోర్ముఖాబ్జశోభాయామ్. 16

తా :- నా భావన కృష్ణపరమాత్మని పాదములను స్పృశించుగాక! తరువాత వాని జంఘాజానూరునాభిహృదయములయందు రమించుగాక! కడపట తన్ముఖాబ్జశోభలోఁ గ్రీడించుగాక !

శరణోపాయ మపశ్యన్
అయి మామక జీవ తామ్యసి కుత స్త్వమ్.
చేతఃసరణావస్యాం
కిం నాగ న్తా కదాపి నన్దసుతః. 17

తా :- ఓయీ ! జీవా ! సంసారమునుండి తప్పించికొను నుపాయమునకై వెదకి వెదకి యలయుచున్నావు. నందసూనుఁడు నీ చేతస్సరణియం దెప్పుడునుఁ దగుల లేదా యేమి ?

శ్రియో మే మా స న్తు క్షణమపి చ మాద్యద్గజఘటా
మదభ్రామ్యద్భృంగావలిమధుర ఝుంకారసుభగాః.
నిమగ్నానాం యాసు ద్రవిణరసపర్యాకులహృదాం
సపర్యాసౌకర్యం హరిచరణయోర స్తమయతే. 18

* బంధవిముక్తి కోరుచు క్రొత్తపాశములు తగల్చుకొనుట, సర్వచింతా రాహిత్యరూప మైన శాంతిని కోరి అనేకమునిమతచింత చేయుట, అశుభ జలధిలో మునిగిపోకుండుటకై మరొకనీటిలో మునుగుట ఇవన్నియు భ్రాంతచేష్టలు.

తా :- శ్రీమంతుల యిండ్ల ముందు మదించిన యేనుగులు; వాని నాశ్రయించిన తుమ్మెదల ఝంకారములు; మరెన్నెన్నియో వైభవములు; వీనిలో వారు మునిఁగి తేలుచుందురు. వారి మనస్సులు వికలములు. మాకు సంపదలు వలదు. అవి గల్గినపుడు హరిచరణసేవాసక్తి యస్తమించును.

కిం నిఃశంకం శేషే
శేషే వయసి త్వామాగతే మృత్యౌ.
అథవా సుఖం శయీథా
నికటే జాగర్తి జాహ్నవీ జననీ. 19

తా :- ఓయీ ! ముసలితనము వచ్చినది. మృత్యుకాలము సమీపించినది. నాయనా ! నిశ్శంకముగ నిద్రించుచున్నావే ! పండుకొమ్ము ! సమీపమందే సర్వ పాపహారిణి గంగానది పారుచున్నది.

సంతాపయామి కిమహం
ధావం ధావం ధరాతలే హృదయమ్.
అస్తి మమ శిరసి సతతం
నన్దకుమారః ప్రభుః పరమః. 20

తా:- ఈ ప్రపంచమున పరువెత్తి బరువెత్తి నా హృదయమును బాధ పెట్టవలసిన యవసర మేమున్నది? నా శిరస్సుపై నెప్పుడును నందకుమారుఁడు కొలువు దీర్చినాఁడు.

రేరే మనో మమ మనోభవశాసనస్య
పాదామ్బుజద్వయమనారతమానమంతమ్.
కిం మాం నిపాతయసి సంసృతిగర్తమధ్యే
నైతావతా తవ గమిష్యతి పుత్రశోకః. 21

తా:- ఓ మనసా ! మనోభవుని శాసించిన పరమశివుని పాదాంబుజములను భావించుచుండగా నన్ను మాటిమాటికిన్ని సంసృతి గర్తమునఁ ద్రోయుచున్నావు. దీనితో నీపుత్రశోకము దీరిపోవునా యేమి ?

వి:- మన్మథుఁడు మనోభవుఁడు; అనగా మనస్సునందు గలుగు కోర్కెలే యాధారముగా గలవాఁడు; వానికి మనోభవుఁ డను పేరుండుటచే మనస్సునకుఁ బుత్రుఁడని కవి చమత్కరించినాఁడు.

*మరకతమణిమేదినీధరో వా*
*తరుణతర స్తరురేష వా తమాలః.*
*రఘుపతిమవలోక్య తత్ర దూరాత్*
*ఋషినికరై రితి సంశయః ప్రపేదే.* 22

తా:- మహర్షులు రామచంద్రుని దూరమునుండిఁ జూచిరి. అతని శరీరము మేఘవర్ణముగదా ! దూరమునుండి జూచిన యా మునులకు "యిది మరకతమణిపర్వత మగునా!" యని యొక సందేహ మేర్పడినది. లేక "తమాల వృక్షమా!" యని మఱి యొక సంశయము.

*తరణితనయా కిం స్యాదేషా న తోయమయీ హి సా*
*మరకతమణిజ్యోత్స్నా వా స్యాన్న సా మధురా కుతః.*
*ఇతి రఘుపతేః కాయచ్ఛాయావిలోకనకౌతుకై*
*ర్వనవసతిభిః కైఃకై రాదౌ న సందదిహే జనైః.* 23

తా:-రఘుస్వామిని దండకావనిలోని ఋషులు దూరమునుండి జూచినారు. ఆయన శరీరచ్ఛాయ వారిని భ్రమగొల్పినది. "యమునానదియా !" యనుకొన్నారు.కాదు; అది జలమయమైనది గదా! "మరకతమణిజ్యోత్స్న యగునా! అది యింత మధురముగ నుండదే !" ఇట్లు వారి కెన్నియో సందేహములు.

*చపలా జలదాచ్చ్యుతా లతా వా*
*తరుముఖ్యాదితి సంశయే నిమగ్నః.*
*గురునిఃశ్వసితైః కపిర్మనీషీ*
*నిరణైషీదథ తాం వియోగినీతి.* 24

తా:- అశోకవనవాటికలో సీత యుండెను. ఆమెను కపిప్రవరుఁడుఁ జూచినాఁడు. ఈమె "జలదమునుండి జారి పడిన మెఱపగునా! కల్ప

వృక్షమునుండి జాఱిపడిన తీగె యగునా!'' యనుకొన్నాఁడు. ఆమె దీర్ఘ దీర్ఘముగా నిట్టూర్చుచున్నది; దానిని బట్టి యీామె విరహిణి యైన స్త్రీ యని నిర్ణయించికొన్నాఁడు.

*భూతిర్నీచగృహేషు విప్రసదనే దారిద్ర్యకోలాహలో*
*నాశో న సతామసత్పథజుషామాయుః శతానాం శతమ్.*
*దుర్నీతిం తవ వీక్ష్య కోపదహనజ్వాలాజటాలోపి స*
*న్కిం కుర్వే జగదీశ యత్పునరహం దీనో భవానీశ్వరః. 25*

తా:- నీచగృహములందు సంపదలు; విప్రులయందు దారిద్ర్యకోలాహలము; సత్పురుషులకు వినాశము; దుర్మార్గులకుఁ బూర్ణాయుస్సు; ఇది యంతయు నీ దుర్నీతి. భవానీపతీ ! దీనిని దలచికొన్న కోపము, నా శరీరము నంతయు దహించును; కాని నేనేమి చేయగలను ? దీనుఁడను. *

*ఆమూలాద్రత్నసానోర్మలయవలయితాదా కూలాత్పయోధే*
*ద్యావన్తః సన్తి కావ్యప్రణయనపటవస్తే విశంకం వదన్తు.*
*మృద్వీకామధ్యనిర్యన్మసృణరసఝరీమాధురీభాగ్యభాజాం*
*వాచామాచార్యతాయాః పదమనుభవితుం కోస్తి ధన్యో మదన్యః.*

తా:- రత్నసానువు మొదలుకొని మలయముచేతఁ జుట్టఁబడిన సముద్ర పర్యంతభూమియందున్న కావ్యనిర్మాణచతురు లందర కొక ప్రశ్న వేయుచున్నాను ! మీకు భయము లేదు. విశంకముగాఁ బలుకుఁడు. ద్రాక్షాఫలము లొలిచి నపుడు దాని మధ్య జేస ముండును గదా, దానితో సమాన మైన రసము గలిగిన వాక్కులతోడి కవిత్వముల్లగల కవులకు నే నాచార్యుడను. ఇది నిజము. వేరెవ్వరైన నున్నచోఁ జెప్పుడు.

* ఓ జగదీశా ! ఎంత కోపము వచ్చినను నేనేమి చేయగలను ? నేను దీనుఁడను; నీవు ఈశ్వరుడవు, సర్వసమర్థుడవు.

వి:- "ఆ చ కూలాత్పయోధేః" = ఇది యొక విచిత్ర మైన గ్రథనము. మర్యాదార్థకమైన "ఆఙ్" ప్రత్యయమునకు 'కూల' శబ్దమునకు నడుమ చకారము వచ్చినది. చాల ప్రౌఢిమ.

గిరాం దేవీ వీణాగుణరణనహీనాదరకరా
యదీయానాం వాచామమృతమయమాచామతి రసమ్.
వచస్తస్యాకర్ణ్య శ్రవణసుభగం పణ్డితపతే
రధున్వన్మూర్ధానం నృపపరథవాయం పశుపతిః. 27

తా:- నేను పండితోత్తముఁడను. సరస్వతీదేవి నా కవితామాధుర్యముల కలరి తన వీణాధ్వనులందు గూడ ననాదరమును వహించినది. నిరంతరము నా రచనలోని రసము గ్రోలుచున్నది. శ్రవణసుభగ మైన నా కవిత విని తల యూపనివాఁడు నరపశువు గాపలెను, లేక పశుపతి యైనఁ గా వలెను.

వి:- "పశుపతిః" = పరమశివుఁడు, పశువులలో బలిష్ఠమైన యెద్దనియు నొక యర్థము.

మధ్వ మా కురు విషాదమనాదరేణ
మాత్సర్యమగ్నమనసాం సహసా ఖలానామ్.
కావ్యారవిన్దమకరన్దమధువ్రతానా
మాస్యేషు ధాస్యసి తమాం కియతో విలాసాన్. 28

తా:- ఓ ! నా వాణీ! మాత్సర్య పూరితు లైన ఖలులు నిన్నాదరింతు రని దుఃఖింపకుము. కావ్యారవిందమకరంద మధువ్రతులుఁ గొంద రున్నారు; వారియందు నీ విలాసములు ప్రదర్శింపుము.

మధు ద్రాక్షా సాక్షాదమృతమథ వామాధరసుధా
కదాచిత్కేషాంచిన్న ఖలు విదధీరన్నపి ముదమ్.
ధ్రువం తే జీవన్తోఽప్యహహ మృతకా మన్దమతయో
న యేషామానన్దం జనయతి జగన్నాథభణితిః. 29

తా:- మధువు, ద్రాక్షలు, సాక్షాదమృతము, రమణీమధురాధరము యివి యైన నొక్కొక్కసారి మానవున కరుచిని గలిగింపవచ్చును. కా జగన్నాథకవి ఫణితి యట్టిది గాదు. సర్వకాలములం దానంద మిచ్చు నే మందమతులకు నా వాణియానంద మివ్వదో? వారు జీవన్మృతులు.

*నిర్మాణే యది మార్మికోఽసి నితరామత్యన్తపాకద్రవ*
*న్మృద్వీకామధుమాధురీమదపరీహారోద్ధురాణాం గిరామ్.*
*కావ్యం తర్హి సఖే సుఖేన కథయ త్వం సంముఖే మాదృశాం*
*నో చేద్దుష్కృతమాత్మనా కృతమివ స్వాన్తాద్బహిర్మా కృథాః.* 30

తా :- ఓయి ! చెలికాఁడా ! నీ కొక సలహా చెప్పుచున్నాను. అత్యంత మధురపాకము గల ద్రాక్షాఫలముల యొక్క మాధుర్యమును గూడ గ్రిందపరచు వచోవిలాసములు నీకున్నచో మావంటి వారి యెదుట నీ కావ్యములు జదివి వినిపింపుము. ఆ శక్తి లేనపుడు చేసిన దోషమును పైకి చెప్పకుండునట్లు నీ రచన నల్గురకును జూపింపవలదు.

*మధురైరపి మాధుర్యై*
*ర్ద్రాక్షాక్షీరేక్షుమాక్షికసుధానామ్.*
*వన్ద్యైవ మాధురీయం*
*పండితరాజస్య కవితాయాః.* 31

తా :- ద్రాక్షలో మాధుర్యమున్నది. క్షీరేక్షువులలోఁ దియ్యదన మున్నది. తేనెలో, నమృతములో రుచి యున్నది. కాని వీని యన్నింటికన్నను మధుర మైనది పండితరాజు కవిత.

*శాస్త్రాణ్యాకలితాని నిత్యవిధయః సర్వేఽపి సంభావితా*
*దిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః. **
*సంప్రత్యుజ్ఝితవాసనం మధుపురీమధ్యే హరిః సేవ్యతే*
*సర్వం పండితరాజరాజితిలకేనాకారి లోకాధికమ్.* 32

నవీనం వయః = యౌవనము.

తా :- శాస్త్రములు గ్రహింపఁబడినవి. నిత్యవిధులు సర్వములు సంభావితములు; ఢిల్లీవల్లభుని పాణిపల్లవమందే వయసంతయుఁ గడచిపోయినది. నేఁడు సమస్తవాసనలు వదలికొని, మధురానగరములో హరిని సేవించుచున్నాను. నా కేమి తక్కువ? పండితరాజతిలకాయమానుఁడైన జగన్నాథుఁడు సర్వమును లోకాధికముగనే సాధించినాఁడు.

దుర్వృత్తా జారజన్మానో
హరిష్యన్తీతి శంకయా.
మదీయపద్యరత్నానాం
మంజూషైషా కృతా మయా. 33

తా :- దుర్వృత్తులైన జారజన్ములు హరింతురను భయముతో, నా పద్యరత్నములకు యీ మంజూషను తయారుచేసితిను.

# పక్షిపశువులు

## అన్యోక్తి సముల్లాసము

*అయి బత గురు గర్వం మా స్మ కస్తూరి యాసీ*
*రఖిలపరిమళానాం మౌళినా సౌరభేణ.*
*గిరిగహనగుహాయాం లీనమత్యన్తదీనం*
*స్వజనకమమునైవ ప్రాణహీనం కరోషి.* 1

తా :- ఓ ! కస్తూరీ ! అన్ని పరిమళములకంటెను గొప్పది నా సువాసన యని గర్వింపకుము; నీ పరిమళము నీ కొంప దీసినది. నిన్ను గన్న కస్తూరి మృగము యెక్కడో గిరిగుహలయం దుండెను. అత్యంతము సాధు వైనది. నీ గొప్పతన మేమి ? దానినే జంపించితివి.

*హే హంసపక్షిప ! పయస్సలిలం వివేక్తుం*
*శక్తస్య సంప్రతి మతిః క్వ ను తే ప్రయాతా ?*
*కాసారవారిణి కళాం పతితాం యదిన్దో*
*రాదాతుమిచ్ఛసి బిసాఙ్కురవాంఛయా త్వమ్.* 2

తా :- హంసా ! నీవు పక్షులలో శ్రేష్ఠుఁడవు. నీటిని పాలను వేఱుపరచు శక్తి నీకున్న దని గొప్పలుఁ జెప్పికొందువు. ఆ చాతుర్యము నేఁడెక్కడఁ బోయినది? కాసారమునందు ప్రతిఫలించిన చంద్రకళను బిసాంకుర మని పట్టు కొనఁ జూచుచున్నావు.

*వదనే వినివేశితా భుజఙ్గీ పిశునానాం రసనామిషేణ ధాత్రా.*
*అనయా కథమన్యథావలీఢా న హి జీవన్తి జనా మనాగమన్త్రాః.* 3

తా :- బ్రహ్మదేవుఁ డెంత పని జేసినాఁడు? దుర్మార్గుల వదనములలో నాలుక అను మిషతో పాముల నుంచినాఁడు. అవి కరచినప్పుడే మంత్రములును ఘోరవు.

*సన్తః స్వయం ప్రకాశన్తే గుణా న పరతో నృణామ్*
*ఆమోదో న హి కస్తూర్యాః శపథేన విభావ్యతే.* 4

తా :- సత్పురుషులు దమగుణములతోనే ప్రకాశింతురు. వారి కితరుల సాయ మక్కఱలేదు. కస్తూరి కెవ్వరి తోడు గావలెను ?[1]

*గుంజన్తి మంజు పరితో గత్వా ధావన్తి సమ్ముఖం*
*ఆవర్తన్తే నివర్తంతే సరసీషు మధువ్రతాః.* 5

తా :- సరస్సులయందు వికసించిన పద్మము లున్నవి. తుమ్మెదలు ధ్వనించుచు వాని చుట్టును దిరుగుచున్నవి. సమ్ముఖముగాఁ బోవుచున్నవి; వెను దిరుగుచున్నవి; వెనుదిరిగి మరల బోవుచున్నవి.

*హే హేమకార పరదుః*
*కిం మాం ప్రతారయసి వారశతాని వహ్నౌ.*
*ఆతాపితేన మమ యాతి[2] గుణాతిరేకో*
*ధూమ స్తవైవ వదనే కిల భస్మపాతః.* 6

తా :- ఓయీ హేమకారుఁడా! ఇతరుల దుఃఖములందే నీవు విహరించు చున్నట్లున్నది: నన్ను దినముల తరబడి యగ్గిలో వేసి కాల్చుచున్నావు. నీవు కాల్చుకొలది నాకు గుణాతిరేకమే యబ్బుచున్నది; నీకో కంటినిండ పొగ మొగమునిండ బూడిద.

*అద్ధి రత్నమధో ధత్తే ధత్తే చ శిరసా తృణమ్*
*అబ్ధేరేవ హి దోషోయం రత్నం రత్నం తృణం తృణం.* 7

1 గుణము లున్నచో అవి తమంతట తామే ప్రకాశించును. కస్తూరీసువాసన తెలియుటకు ఒరులు శపథము చేయవలెనా ? అని కూడ భావము.

2 'యాతి' అను క్రియకు సమన్వయము సరిగా కుదురుట లేదు. 'మమచాతి' అను పాఠమున్నచో బాగుండును.

తా :- సముద్రము రత్నములు క్రిందుపరచుచున్నది. తృణములు నెత్తిపై నుంచికొనును. ఇది యెవరి దోషము ? సముద్రునిదే ! రత్నము రత్నమే! గడ్డిపోచ గడ్డిపోచయే !

తుఙ్గాత్మనాం తుఙ్గతరాస్సమర్థాః మనోరథాన్పూరయితుం న నీచాః
ధారాధరా ఏవ ధరాధరాణాం నిదాఘదాహప్రశమా న నద్యః.   8

తా :- గొప్పవారి కోర్కెలు గొప్పవారే దీర్చవలెను. ధరాధరముల యొక్క నిదాఘదాహమును ధారాధరములే దీర్చును గాని నదులు తీర్పగలవా ?

వి :- ''తుఙ్గాత్మనామ్'' = ఎత్తుగా నున్నవి కొండ లని యొక యర్థము, గొప్పవా రని వేఱొక యర్థము.

''తుఙ్గతరాః'' = అంతకన్నను గొప్పవారు. పర్వతములకన్న నెత్తులో నున్న మేఘములు.

రే రే బిడాల! పరిగర్జసి మాం విలోక్య
కీరం మనోహరరవం నిజపఞ్జరస్థమ్.
శ్వానం విలోక్య న హి దర్శయసి స్వవీర్యం
త్వద్దేహపాటనపటుం దశనైః కరాళైః.   9

తా :- బిడాలమా ! పంజరమునం దున్న నన్ను జూచి యేమో ఘనముగ గర్జించుచున్నావు నా మనోహరరవములు నీ కెట్లు వచ్చును ? అదిగో! కుక్క కాచికొన్నది కరాళము లైన దశనములచే నది నీ దేహమును జీల్చి వేయును. దాని యెదుట నీ విక్రమమును కనుపరపుము.

ఉచ్ఛిష్టపాత్రనిచయే నిజజాతివర్గై
ర్యుద్ధం కురుష్వ కలహప్రియ సారమేయ.
పూజ్యం విలోక్య నరదేవగృహే కరీంద్రం
ఘోరోదనం కురు ఫలం న హి తేఽస్తి కించిత్.   10

తా :- ఓసీ! సారమేయమా! కయ్యమునకుఁ గాలుద్రవ్వెదవు? ఎంగిలి యాకులకడ నీ జాతి కుక్కలతోఁ బోరాడుము. అంతే గాని రాజగృహములం దున్న కరీంద్రునిఁ జూచి మొత్తుకొన్నచో ఫల మేమి?

*గుణై రుత్తుంగతాం యాతి న తు సింహాసనాదినా*
*ప్రాసాదశిఖరస్థోపి కాకః కిం గరుడాయతే.* 11

తా :- గుణములచే గొప్పవాఁడు గావలెను గాని పెద్ద గద్దె నెక్కి కూర్చు న్నంత గొప్పవాఁడు గాలేడు; ప్రాసాదశిఖరముపై నున్నంత మాత్రమునఁ గాకి గరుడుఁ డగునా?

*అలిరసౌ నలినీకులవల్లభః*
*కమలినీకృతకేలిమదాలసః.*

*కుటజపుష్పరసం బహుమన్యతే* 12

తా :- ఈ తుమ్మెద నళినీకులవల్లభుఁడు; కమళినీకృతకేలిమదాలసుఁడు కాలము చెడి పరదేశములఁ వచ్చినాఁడు. కుటజపుష్పరసమునే గొప్పగా నెంచి కొనుచున్నాఁడు.

*చాతకస్త్రిచతురాన్పయఃకణా*
*న్యాచతే జలధరం పిపాసయా.*
*సోఽపి పూరయతి విశ్వమమ్భసా*
*హన్త హన్త మహతాముదారతా.* 13

తా:- చాతకము దప్పిఁగొని మూఁడు నాల్గు జలకణములకు మాత్రమే జలధరమును యాచించెను. అది నీటితో విశ్వము నంతయు నింపినది; గొప్ప వారి యౌదార్య మిట్లే యుండును.

ఫి:- "చాతకః" = పుల్లింగము.

''జలధరః'' = పుంల్లింగము. ఒకానొక యాచకుఁడు గొప్పవానిని కోర్కె దీర్పు మని యడిగి నప్పుడు వాఁడడిగిన దానికంటె యెక్కో రెట్లు గొప్పగ వాని కోర్కె దీర్చును.

*వనమార్జాలబీజస్తు దేవభోగాయ కల్ప్యతే*
*ఖరస్య వృషణః స్థూలః కస్య వా కిం ప్రయోజనమ్* 14

తా:- పునుగుపిల్లి బీజమును దేవపూజ కుపయోగింతురు. ఖరవృషణము దానికన్నను స్థూలమే; ఎవరి కుపయోగము ?

*గుణేషు యత్నః క్రియతాం కిమాటోపైః ప్రయోజనమ్*
*విక్రీయన్తే న ఘంటాభిః గావః క్షీరవివర్జితాః.* 15

తా:- గుణములను సంపాదింప యత్నింపుము. ఆటోపములతోఁ బ్రయోజన మేమున్నది ? పాలు లేని యావుయొక్క గంటల గలగలలు ఎవరికి ముద్దు ?

*గుణైరుత్తుజ్గతాం యాన్తి న తు జాతిప్రభేదతః*
*క్షీరోదధిసముత్పన్నః కాలకూటః కిముత్తమః.*

తా:- గుణములచే గొప్పతనము వచ్చును; జాతితో రాదు. కాలకూటము పాలసముద్రమునందుఁ బుట్టినది. అది గొప్ప దందువా ?

*ఫలవతి పిచుమన్దే మన్దబుద్ధే కిమర్థం*
*వససి మధురవాణీం వ్యర్థయన్ రాజకీర !*
*అతిపరుషరవాణాం వాయసానాం నివాసే*
*పరిణతసహకారప్రాన్తభోగం విహాయ.* 17

తా:- ఓసీ ! రాజకీరమా! నీ బుద్ధిమంద మైనదా ? ఈ పిచుమందపు కాయల గోరి యిక్కడ నీ మధురవాక్కులను వ్యర్థము జేసికొనుచు కాచికొన్ని

యున్నావు ! పరుషరవము లైన కాకు లుండదగిన దీ చోటు. నీకుఁ దగినది పరిణతసహకారప్రాంతము. ఆ భోగమును విడిచి యిచ్చట నేల యుందువు ?

*ప్రబన్ధనం పద్మవనే నిశాయాం మతఙ్గదానే మదకర్ణతాళః*
*స్వప్రాణభఙ్గః ఖలు చమ్పకేఽస్మిన్ సర్వత్ర దుఃఖం భ్రమరస్యలోకే.* 18

తా:- తుమ్మెదల కెల్ల చోటుల బాధలే యైనవి పాపము ! పద్మవనము లందు నిశాబంధనము; మతంగకపోలములయందుఁ గర్ణతాడనము; సంపెగపూల యందు ప్రాణభంగమే యగును.

*ప్రత్యఙ్గణం ప్రతితరుం ప్రతివారితీరం*
*కాకాశ్చర న్తు చలవఞ్చపుటా రట న్తః.*
*నో యాతి తృప్తిమథ మణ్డితపుణ్డరీక*
*షణ్డే వసన్నిహ హి తుష్యతి రాజహంసః.* 19

తా:- కాకులు ప్రతియిల్లు దిరుగును; ప్రతి వృక్షము నాశ్రయించును. ప్రతి యేటి గట్టు నాశ్రయించును. రెక్కల టపటపలతో నెంత దిరిగినను వానికిఁ దృప్తి లేదు. రాజహంసము మండితపుండరీకషండము నాశ్రయించి నిత్యతృప్తముగా నుండును.

*అయి ! కోకిలశ్రీపాక* కాకనీడే వస యావద్భవతో భవన్తి పక్షాః*
*బహవ స్తదనన్తరం నివాసాః పరితస్సన్తి రసాధికో రసాలః.* 20

తా:- బాల కోకిలా ! రెక్కలు వచ్చువరకు కాకి గూటిలో నిమ్మళముగా గడపుము. అనంతరము నీ సంచారమున కనుగుణములైన వెన్నియో యున్నవి. రసాధిక మైన రసాల మున్నది.

*జన్మస్థలీ వారణరాజమూర్ధా మహీపతీనాం మకుటే నివాసః*
*అనాదరం చేత్కురుతేఽనభిజ్ఞో ముక్తాఫలానామిహ కోఽపరాధీ.* 21

* కోకిలశ్రీపాక = ఓ బాలకోకిలా!

తా:- జన్మస్థానము కరీంద్రముల మూర్ధము; నివాసము రాజులకిరీటములు; తెలియని వారు ముక్తాఫలములను నిందించినచో తప్పెవ్వరిది ?

*గుంజారఞ్జితకబరీశబరీతతిభి ర్గరీయసీ నగరీ.*
*ఇహ న హి ముక్తావణిజః కో౽పి న ముక్తాగుణజ్ఞో౽పి.22*

తా:- గురివెంద పూసలు తలలో తురుముకొనిన శబరస్త్రీలే ఈ నగరములో అధికముగ ఉన్నారు. ముత్యముల వ్యాపారముచేయు వర్తకులు కాదు కదా; ముత్యములను పరీక్షింపకలిగినవాడు కూడ లేడు.

*యాతేయం భవతా సహైవ రజనీ భావీ వికాసో దిశాం*
*సూర్యేణాపి చిరం చకోరనికరైః స్థేయం క్వచిత్కాననే.*
*ఉద్యద్దారుణచణ్డభానుకిరణజ్వాలాజగన్మణ్డలే*
*కస్మై చన్ద్ర సమర్ప్య కైరవకులం వ్యోమాన్తమాలమ్బసే. 23*

తా :- ఓ ! చంద్రుఁడా ! నీ వెంటనే రాత్రియును గతించును; దిక్కులయందు సూర్యకిరణములు వ్యాపించును. చకోరనికరము యేదేని యడవిలోఁదల దాచికొనును. ఉద్యద్దారుణ చండభాను కిరణజ్వాల మైన జగన్మండలమందు కైరవకులము నెవరి కొప్పించి వ్యోమాంతమందు నిలిచితివి ?

*భో నారికేళ తవ మస్తకభేదకానాం*
*సాధ్యం భవేత్తవ జలం కఠినస్వరూప ।*
**నాహం త్వదీయసలిలగ్రహణే సమర్థః*
*ఇత్యాత్తభేదవిముఖశ్శుకరాజపోతః. 24*

తా :- నారికేళమా ! నీవు మహాకఠిన స్వరూపుఁడవు; నీ తల పగులగొట్టువారికే నీ జలము లభించుచున్నది. ఈ శుకరాజపోతము నీ సలిలమును బడయలేక ఖేదించుచున్నది చూఁడుము.

---

* నీ జలమును గ్రహించు సామర్థ్యము నాకు లేదు - అని శుకరాజపోతము ఖేదముచే విముఖ మైనది.

*సంత్యజ్య కోకిలశిశో మధురప్రవాళం*
*మాకన్దబృన్దమళిపోతమిళత్ప్రసూనమ్.*
*నిమ్బేతితిక్తహృదయే బలిభుక్కులాఢ్యే*
*మౌనేన తిష్ఠసి యదిహ వదాశు కార్యమ్.* 25

తా :- కోకిలశిశువా ! మధురప్రవాళమై అళిపోతమిళత్ప్రసూన మైన మాకందబృందమును వదలి యీ వేపచెట్టు నాశ్రయించితివి. ఇక్కడ నేమున్నది? దాని హృదయమంతయు చేదు. కాకులతోడి సహవాసము; నీవిక్కడ మౌన తపస్సు చేయుచున్నావు; నీ కిట నేమి పనియో చెప్పుము.

*ధ్యాయన్నంబుజతోయబు*ద్బుదకణప్రాయం స్వకం మస్తకం*
*పశ్యన్నాయసటంకకోటిఘటితత్రోటీపుటం వాయసమ్.*
*న స్థాతుం న పలాయితుం న చలితుం నోన్మీలితుం మీలితుం*
*నో మర్తుం న చ జీవితుం ప్రభవతి త్రాసాకులః కోకిలః.* 26

తా :- తానా ! చాలచిన్నవయస్సు. మెడ యైనను సరిగా నిలువలేదు; తమ్మిరేకుల పైని జలకణము బుద్బుదకణము; ఎప్పుడురాలిపోవునో ! ప్రక్కలో ఇనుప ముక్కుతోడి కాకి; కోకిలకేమియుఁ దోచుటలేదు. నిలువలేదు; పరువెత్త లేదు; కదలలేదు; కనులు మూయలేదు; తెరువ లేదు; చావలేదు; బ్రతుకలేదు; త్రాసాకుల మైన దాని యవస్థ వర్ణనాతీతము.

*భో భో వారిద వారిణా మమ ముఖం సమ్పూరయ ప్రేమవాన్*
*దాతా త్వం జగదేకరక్షణపరో జానాసి మామప్యలమ్.*
*త్వామేకం శరణం గతం నదనదీకూలేషు ముక్తస్పృహం*
*దీనం చాతకబాలకం నిజగృహం త్యక్త్వాన్తరాళే స్థితమ్.* 27

తా :- ఓయీ, మేఘుఁడా ! జలముతో నా ముఖమును నింపుము. నీవు జగదేకరక్షణపరుఁడ వైన దాతవు. నేను నీకుఁ దెలిసినవాఁడనే ! నీకు శరణా

---

* 'అంజనతోయబుద్బుదకణ' అనికూడ పాఠము. కాటుక నీటి బుడగపంటిది అని యర్థము.

గతుఁడను. నదనదీకూలములందు నా కాశ లేదు. దీనుఁ డైన చాతక బాలకుఁ డను. నా నీడమును వదలి యంతరాళమున నీకై వేచి యున్నాను.

*నార్ఘన్తి రత్నాని సముద్రజాని పరీక్షకా యత్ర న సన్తి దేశే*
*ఆభీరపల్ల్యాంచితపద్మరాగం ప్రతిభిర్వరాహైః పణయన్తి గోప్యః.* 28

తా :- రత్న పరీక్షకులు లేని చోట నున్న సముద్రజాతము లైన రత్నముల వెల యొక్కడిది ? గొల్లపల్లెలోని పద్మరాగమును గోపికలు మూఁడు గవ్వల కడుగుదురు.

*దృష్ట్వా హృష్టోఽభవదలిరసౌ చిత్రసంస్థే చ పద్మే*
*వర్ణం రూపం కిమితి కిమితి వ్యాహరన్నాజగామ.*
*నాస్మిన్గన్ధో న చ మధు చయో నాస్తి తత్సౌకుమార్యం*
*ఘూర్ణన్ ఘూర్ణన్నవనతముఖో వ్రీడయా నిర్జగామ.* 29

తా :- బొమ్మలో పద్మమున్నది. దానినిఁ జూచి తుమ్మెద మరులు గొన్నది! ఏమి వర్ణము ? ఏమి రూపము ! దగ్గరకు వచ్చినది. దానిలో రంగేది! తేనె లేవీ! సౌకుమార్య మేదీ! పేరాశతో తుమ్మెద చుట్టి - చుట్టి నిలిచినది. కడకు సిగ్గుతో తలవంచుకొని వెడలిపోయినది.

*ఛాయాభిః ప్రథమం తతశ్చ కుసుమైః పశ్చాత్ఫలైః సాధుభిః*
*ప్రీణాత్యేష తరుర్మహానితి పరిశ్రాంతైస్సమాసాద్యతే.*
*కో జానాతి యదత్ర కోటరపుటే ప్రత్యుగ్రహాలాహల*
*జ్వాలాజాలకరాళఫాలఫలకః ప్రౌఢః ఫణీ వర్తతే.* 30

తా :– "తొలుత నీడలతో తృప్తిపరచును. పిదప పూలతో! తదుపరి పండ్లతో నాకలి దీర్చును. ఈ వృక్షము చాల గొప్పది!" ఇట్లని పాంథులు దాని నాశ్రయించిరి. కాని దానితొఱ్ఱలోఁ బ్రత్యుగ్రహాలాహలజ్వాలాజాలకరాళఫాలఫలక మైన దొడ్డ పామున్న దని యెవ్వ రెఱుఁగుదురు ?

ప్రతినగరం ప్రతిరథ్యం భుజఙ్గసంవాసరుద్ధసంచారే.
మమ సఖి ! నమ్మతమేతత్ నకులప్రతిపాలనం శ్రేయః. 31

తా :- ప్రతి నగరమందును, ప్రతి రథ్యయందును, భుజంగ సంవాసమే! దీనితో సంచారమే రుద్ధ మైనది. సఖీ, ముంగిసను పెంచుట మంచిపనియే !

వి :- ''భుజంగ'' = పాములు; విటులు. ఎక్కడ చూచినను విటులు సంచరించుచున్నా రని యర్థాంతరము.

''నకుల ప్రతిపాలనం శ్రేయః'' = ముంగిసను పెంచుట మంచి దని యర్థము. ఇక్కడ సభంగశ్లేషచే ''న+కుల ప్రతిపాలనం శ్రేయః'' = వర్ణ ధర్మమును బాటించుట మంచిది గాదని యర్థము కూడ వచ్చుచున్నది.

స్నిగ్ధాఽభూదవనీ వనీ మరకతశ్యామా చ కల్లోలినీ
నానావర్తవిహారిణీ జలధరస్యాంకైర్నభో మేదురమ్.
సర్వం సాధు తవోదయే కిమిహ యద్దుర్నీతిమాలోకయే
యద్భేకా ముఖరీభవంతి విరసీభూతాశ్చ పుంస్కోకిలాః. 32

తా :- ఓ ! వర్షాకాలమా ! నీవు వచ్చుట మంచిదే యైనది. నీ రాకచే భూమి స్నిగ్ధ యైనది. వనభూములు మరకతశ్యామము లైనవి; నదులు నానావర్త విహారములలో చిందులు త్రొక్కుచున్నవి; ఆకాశ మంతయు నీలి మబ్బులు నిండినవి; అంతయు బాగనే యున్నది కాని, కప్పలు బెకబెక లాడుచున్నవి. పుంస్కోకిలములు మాత్రము మౌనము వహించినవి.

అన్తశ్ఛిద్రాణి భూయాంసి కంటకా బహవో బహిః.
కథం కమలనాళస్య మా భూవన్ భంగురా గుణాః. 33

తా :- లోపల నంతయు ఛిద్రములే ! బైట దిక్కులే నన్ని ముండ్లు. ఇఁక కమలనాళమునకు భంగురము లైన గుణము లెట్లుండవు ?

వి :- ''గుణాః'' = దారములు; ఒకానొక డుండును. వానిలో నన్నియు దోషములే. చుట్టును దుర్మార్గులు. ఇఁక నీచగుణము లెందు కుండవు?

యేన శైశవపదే మదేభరాడ్గండసీమ్ని నఖరైర్విదారితమ్.
యౌవనోత్సవమవాప్య కేసరీ కేషు దర్శయతి సోఽద్య పౌరుషమ్.

తా :- సింహము శైశవమందు మదించిన యేన్గుల గండస్థలమును నఖరములతోఁ జీల్చినది. ఇంతలో దానికి యౌవనోత్సవ మైనది; ఏన్గులయందు గాక మఱెవ్వరియందుఁ దన పరాక్రమముఁ జూపును ?*

భూమిపాలభవనేషు కేసరీ పంజరే స్ఫురతి యుద్ధపౌరుషః.
ఉన్మిషత్సు కరటేషు కుమ్భినాం కః కరోతి కరజార్పణోత్సవమ్. 35

తా :- భూమీశ్వర భవనములయందు, యుద్ధ పౌరుషమై కేసరి పంజరమందు బంధింపఁబడినది. బయట నేన్గులు విజృంభించుచున్నవి. వాని గండస్థలములపై కరజార్పణోత్సవము నెవ్వ రొనర్తురు ?

అరవిన్దాని విన్దంతి వ్యథాం విరహతో రవేః
తేషాం విరహతస్తస్య న జానే కీదృగన్తరమ్. 36

తా :- ఎక్కడో యాకాశమందు సూర్యుఁడు; భూమిపైన పద్మములు; వాని విరహముతో నివి బాధపడును. ఇఁక వీనికిని సూర్యునకునుఁ గల అంతరమేమో నే నెఱుఁగను.

త్రపాశ్యామా జమ్బూర్దళితహృదయం దాడిమఫలం
సశూలం సంధత్తే హృదయమభిమానేన పనసః.
భయాదస్తస్తోయం తరుశిఖరజం లాంగలిఫలం
సముద్భూతే చూతే జగతి ఫలరాజే ప్రసరతి. 37

తా :- ఫలరాజ మైన చూతము పొడసూపినది. జంబూఫలము సిగ్గుతో నల్లవాఱినది. దాడిమీ ఫలహృదయము పగిలినది. పనస మనసు అభిమాన

---

* ఇపుడిఁక తన పరాక్రమమును ఎవరిపై చూపవలెను ? మదేభములను శైశవమునందే పరాసము చేసినది కదా !

పూరితమైనది. అది సజాల మైనది. టెంకాయ లోలోననే నీరై పోయినది. దానికి భయ మైనది.

స్వైరం సైరిభయూథపైరిహ సరశ్శృంగేణ విక్షోభితం
తావన్న్యాం కుకులం చ హుంకృతిశతై ర్ద్వా ద్రావితం ద్వీపిభిః.
లీలాక్షి ప్రపదే పరాక్రమవిధావుజ్జృంభమాణే హరౌ
చిత్రం సైవ తథైవ చిత్రలిఖితేవాసీదరణ్యస్థలీ. 38

తా :- అడవి దున్నలుసరస్సులలోఁజొచ్చి కొల్లలాడుచున్నవి. బెబ్బులులు హరిణములను హుంకృతులతో నదల్చుచున్నవి. అడవియంతయు నల్లకల్లోలము. ఇంతలో హేలాక్షి ప్రపదముగా నాయరణ్యమున సింహము ప్రవేశించినది. ఇంకేమున్నది ? అందరి పరాక్రమము లాగిపోయినవి. ఆ యరణ్యము బొమ్మ గీచినట్లున్నది.

విష్టోఽపి దష్టోఽపి చ కాలసర్పైః ఛిన్నోఽపి భిన్నోఽపి విదారితోఽపి.
కిం బ్రూమహే చన్దన! సౌమ్యతాం తే లోకోత్తరం సౌరభమేవ ధత్సే. 39

తా :- ఓ ! చందనమా ! నీ శాంత మేమందును ? నూరఁబడితివి. పాముల కోఱలఁ బడితివి. విదళిత మైతివి. ఛిన్నాభిన్న మైతివి. ఇంత యయ్యు నీ లోకోత్తర సౌరభమును నీవు వదలలేదు.

గర్భాన్ స్వాతో విదళయంతి కరేణుకానాం
గండూషయన్తి గజగణ్డతటీమదామ్బుః.
యద్గర్జయంతి* జరయా ముషితస్స ఏవ
కణ్ఠీరవః పరిభవం సహతే మృగీభ్యః. 40

---

* 'యద్గర్జనాని' అను పాఠమున్న బాగుండును. దేని గర్జనములు ఆడలకు గర్భస్రావము కలిగించినవో, మద గజముల మదోదకమును ఇంకింప చేసినవో...అని యర్థము.

తా :- మదపుష్టేభుల గర్భముల నెన్నిటినో విదళించెను. గజగండతటీ మదాంభస్సులనే ఉక్కిళించెను. ఇపుడ దేమైనది? ముసలితనము గ్రమ్మినది. ఆ కంఠీరవము హరిణముల యవహేళనమును సహించుచున్నది.

*అయే మధుప ! మా కృథా బత వృథా మనోవేదనాం*
*తుషారసమయే లతాశతనిషేవణవ్యాకులః.*
*ఇయం సురనిషేవితే సరసపుష్పమాసోదయే*
*రసాలనవమఞ్జరీ మధురి (జరి) జృంభతే.* 41

తా :- ఓరీ! తుమ్మెదా! హేమంతమునందు లతాశతముల నిషేవణముతో నొసగితి నని బాధపడకుము. దేవతలకే భోగ్య మైన పుష్పమాసము సమీపించినది; రసాలనవమంజరి విజృంభించినది.

*మరన్దలోభాచ్చ మిళిన్దమాలా ఖేటేఽమ్బుజం సూర్యకరైర్వికస్వరమ్*
*హా హన్త! నాళీకమిదం పురస్తు ప్రాలేయపాళీ కబళీచకార.* 42

తా :- మరన్దలోభముతో, మిళింద మాల సూర్యకరములచే వికసించిన పద్మమునుఁ జేరెను. అయ్యో! ఇంతలో నా పద్మమును తుషారజాలముఁ గబళించివేసినది.

*ఆయాన్తి నిర్యాన్తి చ వా కియన్తో ద్విజాస్సమాదాయ ఫలం దళం చ*
*త్వయ్యేవ పుంస్కోకిల భాజితేస్య పరోపకారప్రథితో రసాలః* 43

తా :- మామిడి చెట్ల నెన్నియో పక్షు లాశ్రయించును. వాని ఫలములను భుజించును. దళములను మెసవును. వానిపాటి కవి పోవును. ఓరీ! పుంస్కోకిలమా! నీచేత మాత్రమే రసాలము యొక్క పరోపకారకీర్తి దశదిశలకు వ్యాపించినది.

*దయితోసి తత స్తతః పృథివ్యా*
*మయి జీమూత జనస్య జీవనేన.*

విషయాదపి గచ్ఛతః కిమేతాన్
ధ్వనిభిర్భీషయసీహ రాజహంసాన్. 44

తా :- జీమూతా! జనములకు జీవన ప్రదాన మొనర్చుచున్నావు. అందుచే పృథివి కెంతో యాప్తుఁడవు. కాని నీ దేశమే విడిచి యేగుచున్న రాజహంస లను నీ గర్జలతో నెందు కట్లు బెదరించెదవు ?

ఊషరేషు వివరేషు చాంభసాం వీచయోఽపి భవతా ప్రవర్తితాః.
క్షేత్రసీమ్ని నిహతాస్తు బిందవో వారివాహ భవతో నవానయః. 45

తా :- మేఘమా ! ఊషరక్షేత్రములలో వర్షింతువు. భూరంధ్రములపై వర్షింతువు. పంటచేలలో నీటి బిందువు వర్షింపవు; ఇది నీయొక్క దుర్నయము.

తాపం సంప్రతి సర్వతోఽపహరసే ముక్తాఫలం శుక్తిషు
క్షేత్రం సించసి కించ పల్లవయసి శ్రీఖణ్డముఖ్యాన్ ద్రుమాన్.
క్షారం క్షారమిదం జలం జలనిధేరాస్వాద్య జీమూత ! హే !
విశ్వం జీవయసి బ్రవీతి జగతి ప్రౌఢోఽపి కస్తే గుణాన్. 46

తా :- సముద్రమందలి యుప్పు నీటినే త్రావి మేఘమా! ఎన్నియుపకారము లొనర్తువు ! లోకతాపమును బోకార్తువు ! ముత్తెపుచిప్పలలో ముత్తెములు నింపుదువు. పంటపొలములలో వర్షింతువు! చందనాది వృక్షములకు చిగురుటాకుల నిత్తువు ! ప్రపంచమునే బ్రతికింతువు. ఎవ్వఁడు నీ గుణములను సంపూర్తిగాఁ బొగడగలఁడు ?

పపాత పాథఃకణికా న భూమౌ సమాప శాన్తిం కకుభాం న తాపః.
దృష్ట్వైవ జీవాతురయం తటిత్వాన్ కృషీవలానాం ముదముద్వవామ 47

తా :- భూమిపై చినుకు రాలలేదు ! దిక్కుల తాప మారలేదు ! మెఱుపు లేమో కొల్లలు. కృషీవలులు లాశతో జూచుచున్నారు. మేఘము యొక్క వట్టి యాడంబరము.

సంపాతయసి సపది దర్దురదీర్ఘనాదా
యస్మింశ్చ కోకిలరుతాని నిరాకృతాని.
నిష్పీతమమ్బు లవణం న తు దేవనద్యాః
పర్జన్య! తేన న కృతో భవతా వివేకః 48

తా :- కప్పల బెక బెకలను వర్ధింతువు. కోకిలల కూజితములను నిరాకరింతువు. గంగానదిలోని నీటిని త్రాగవు. సముద్రములోని యుప్పు నీటిని గ్రోలెదవు ! ఓ మేఘమా నీ వివేకము దెలిసినట్లే యున్నది.

యత్తాదృశేషు నలినేషు న పక్షపాతో
జాతో బత స్పృహమసా కుటజానురాగః.
విశ్వైకజీవనపుషోఽపి చ వారివాహ
దుర్వార వాయువశగోఽసి న తద్విచిత్రమ్. 49

తా :- అట్టి నలినములపైఁ బక్షపాతము లేదు. కుటజముల వెంటఁ బడెదవు. విశ్వమునకు జీవము లిచ్చు వాడవే ! కాని వివేకము లేదు. నీవు వాయువశుఁడ వైనావు; ఇందులో విచిత్ర మేమున్నది? పాపఫలమును దప్పించి కొనలేరు గదా !

ఉద్దామద్యుమణిమయూఖమూర్ఛితానా
మేతేషామహహ మహామహీరుహాణాం.
ఆలమ్బః క ఇహ భువ స్తలే పయోధే
స్సిఞ్చ స్త్వం జగతి విహాయ వారివాహమ్. 50

తా :- సూర్యుఁడు తీక్ష్ణముగ వెల్గుచున్నాఁడు. ఎండలతో వృక్షములు మల మల మాడుచున్నవి; వాని గోడు విను నాథుఁ డెవ్వడు? మేఘ మేమో సముద్రము నందు వర్షించుచున్నది. అయినను వానికి వాఁడే దిక్కు.

శ్రేయాన్సిన్ధోర్బహుళపక్ష పరిక్షయోఽపి
నో పూర్ణతా జలనిధేరిహ వర్ణనీయా.

యద్వారి న స్పృశతి హన్త పృథగ్జనోపి
యస్యాఽమృతే మఖభుజోఽపి ముదం లభన్తే. 51

తా :- చంద్రునకు బహుళ పక్ష పరిక్షయము కూడ నలంకారమే! సముద్రుని పూర్ణత్వము గూడ వర్ణ నీయము గాదు. దాని జలము లెవ్వఁడును రుచి చూడఁడు గదా! చంద్రుని యమృతమునకు దేవతలే వేకారుదురు.

ఉత్సాహం వనితానభేషు విరహగ్లానేషు దైన్యం శశీ
శోకం కోకకుటుంబినీషు దిశతి క్షేమం చకోరేషు చ.
లక్ష్మీం లుమ్పతి పంకజస్య కుముదామోదాయ సంపద్యతే
జం భ్రువమత్ర దైవవిహితం ద్వేషస్య రాగస్య వా. 52

తా :- చంద్రుడు ప్రియురాండ్రతో నున్న వారి కుత్సాహ మొసఁగును. విరహులకు దైన్యమును బంచును. కోకములకు శోకప్రదాయకుఁడు. చకోరములకు సంతోష మొసఁగును. పంకజలక్ష్మీలుంపాకుఁడు. కుముదముల కామోద మిచ్చును. కనుక స్నేహ వైరములకు దైవమే కారణము.

ధునోతి ధ్వాన్తాని వ్యపనయతి నీహారపటలం
కులం రాజీవానాం దళయతి రథాఙ్గం రమయతి.
జగద్వ్యాపీ దేవో జనయతి జనానాం చ నయనం
న యాతి స్థేమానం యది తదిహ దైవం జయతి కః. 53

తా :- సూర్య భగవానుఁడు చీకటులఁ బారద్రోలును. నీహారమును నశింపఁజేయును. పద్మములను వికసింపజేయును. రథాంగముల కానంద దాయకుఁడు. సమస్త జగములను వ్యాపించిన దేవుఁడు. జనులకు నయన ప్రదాయకుఁడు. వాఁడును శాశ్వతము గాదు. ఇఁక దైవమును జయించిన వాఁడెవ్వఁడు?

*రాజానః కతి వా న సంతి జగతి ఖ్యాతా నిజాంత్రియా**
*యే పుష్ణంతి బలీయసః పరిచితాంశ్చిత్రం న మన్యామహే.*
*రాజా రాజతి కేవలం హిమకరః పుష్ణాతి దూరస్థితాన్*
*జ్యోత్స్నాభి ర్గ్లపితాన్దినేశమహసా యో౽స్తౌ చకోరానిమాన్.* 54

తా :- భూమిపై నెందరో రాజు లున్నారు. వారు తమ్మా శ్రయించిన భాగ్య యుతు లైన బలాఢ్యులనే పోషింతురు. ఇతరుల కథ వారికిఁ గాబట్టదు. చంద్రుఁడే నిజ మైన రాజు. దూరస్థితములై సూర్యుని కిరణములచేఁ దప్తము లైన చకోరములకు గూడ నాతఁడు పుష్టి నొసఁగును.

వి :- చంద్రునకు రాజని పేరు; కాంతి చేత ప్రకాశించు వాఁడని వ్యుత్పత్తి క్షత్రియునకును రాజని పేరు.

''రాజా ప్రకృతి రంజనాత్'' = ప్రజలను వాఁడు రంజింప జేయును.

*సన్తాపం జగతాం విలుంపసి పునర్ధారాభిరాసించసి*
*క్షేత్రాణ్యంకురయస్యమూన్ముకుళయస్యాహ్నాయ నీపద్రుమాన్*
*సారంగస్య నభో నివేశితదృశశ్చంచూపుటాపూరణే*
*వైముఖ్యం వ్రజసి త్వమంబుద! యది ప్రత్యేతి*కో నామతత్.* 55

తా :- ఓ, మేఘమా! నీ వెంతో గొప్పవాఁడవు. జగముల తాపములను బోకార్తువు. నీటి ధారలతో భూములను నింతువు. క్షేత్రముల నంకురములఁ బెంతువు. నీపముల ముకుళములను నింతువు. కాని ఈ సారంగమున కొక నీటి బొట్టునురాల్పవు. అది యాకాశమందే చూపులను నిగిడించి యున్నది. దాని యపరాధ మేమి?

*గ్రీష్మోష్మా దళితో వనం వికసితం ధారాభిషిక్తా ధరా*
*దావాగ్నిశ్శమితో హరిత్సు రసితైరానర్తితాః కేకినః.*
*ప్రాణోచ్చైః పదముచ్చదేన విహితం యద్వా త్రిలోకీహితం*
*తత్కీర్తిం పరివర్తితామిహ శరన్మేఘా వహన్తి భ్రమాత్.* 56

---

* ''ఖ్యాతా నిజాఖ్యాశగాన్'' అని పాఠాంతరము.

* 'ప్రత్యేతి' అని పాఠమైయుండును, నీవిట్లు చేసెదవని ఎవరు నమ్ముదురు అని అర్థము.

తా :- వేసవి యుష్మ్ర తగ్గినది. వనము వికసించినది. కొండలు ధారాసిక్తము లైనవి. దావాగ్ని శమించినది. మయూరములు నర్తించినవి. ఎలుగించినవి. ముల్లోకములకు హితకర మైన యీ పుణ్య మంతయు వర్షాకాలముదే ! కాని లోకము భ్రమతో శరన్మేఘమున కంటగట్టుచున్నది.

గాహితమఖిలం గహనం పరితో దృష్టాశ్చ విటపినః సర్వే
సహకార న ప్రపేదే మధుపేన భవత్సమం జగతి. 57

తా :- ఓ! సహకారమా! ఈ తుమ్మెద వన మంతయు వెదకినది. అన్ని చెట్లను గాలించినది. కాని నీతో సమాన మైన వృక్షము లభింపనే లేదు.

కృతమపి మహోపకారం పయ ఇవ పీత్వా నిరాతఙ్కః
ప్రత్యుత హన్తుం యతతే కాకోదరసోదరః ఖలో జగతి. 58

తా :- చేయబడిన యుపకారమును పాల వలె ద్రాగి కొంచెమైనను జంకు లేక యుపకారినేఁ జంపుటకుఁ బ్రయత్నించును. దుర్మార్గుఁడు కాకోదర సోదరుఁడు.

పాండిత్యం పరిహృత్య యస్య హి కృతే వందిత్వమాలంబితం
దుష్ప్రాపం మనసాపి యో గురుతరైః క్లేశైః పదం ప్రాపితః.
రూఢస్తత్ర స చేన్నిగీర్య సకలాం పూర్వోపకారావళీం
దుష్టః ప్రత్యవతిష్ఠతే తదధునా కస్మై కిమాచక్ష్మహే. 59

తా :- పాండిత్యమును బరిత్యజించితిని. వందిత్వము నవలంబించితిని. అనేక క్లేశములతో వానిని గొప్పతనమున కెత్తితిని; వాఁడా యెత్తు సింహాసనముపై గూర్చున్నాఁడు; మేము ముందు జేసిన యుపకారముల నన్నిటిని మరచెను; మాపైకే కాలుద్రవ్వుచున్నాఁడు. మేమెవ్వరితోఁ జెప్పికొందుము ?

ఖలః కాపట్యదోషేణ దూరేణైవ విసృజ్యతే
అపాయశంకిభిర్లోకైః విషేణాఽఽశీవిషో యథా

తా :- ఖలుఁడు కాపట్యదోషముతో నందరిచేతను దూరముననే పరిహ రింపఁబడును. దగ్గరఁ జేర్చినచో నపాయ మని వారి భయము. పాముల నెవ్వరు దగ్గరఁ జేర్తురు ?

*కిమహం వదామి ఖల దివ్యమతే గుణపక్షపాతమభితో భవతః.*
*గుణశాలినో నిఖిలసాధుజనాన్ యదహర్నిశం న ఖలు విస్మరసి. 61*

తా :- ఓయీ, ఖలుఁడా! నీ వివేకము నెంతని బొగడుదును? నీ గుణపక్ష పాతము చాల గొప్పది. సద్గుణవంతు లైన సజ్జనుల నొక్క నిమేష మైనను మరువవు గదా !

వి :- దుష్టుడు సత్పురుషుల నెప్పుడు బాధించువాడు గదా! వాఁడెప్పుడును వారందరిని జ్ఞాపక ముంచికొని యుండును, సమయము వచ్చినపుడు కాటువేయు టకు.

*రే ఖల ! తవ ఖలు చరితం ! విదుషాం మధ్యే వివిచ్య వక్ష్యామి.*
*అథవాఽలం పాపాత్మన్ ! కిలాభిస్తే పురస్తు కథితాభిః. 62*

తా :- ఓయి, దుర్మార్గుఁడా! పండితుల దగ్గర నీ దుర్మార్గము లన్నిటిని వేరుగా వర్ణింతునా! దుష్టాత్ముఁడా! పలికినవి చాలులెమ్ము; నాకే విసు గైనది.

*ఆనందమృగదవాగ్నిః శీలశాఖిమదద్విపః.*
*జ్ఞానదీపమహావాయురయం ఖలసమాగమః.*

తా :- దుర్మార్గుల సహవాసము ఆనందమృగదావాగ్ని ! శీలశాఖిమద ద్విపము, జ్ఞానదీపమహావాయువు.

*ఖలాస్తు కుశలాః సాధుహితప్రత్యూహకర్మణి*
*నిపుణాః ఫణినః ప్రాణానపహర్తుం నిరాగసామ్.*

తా :- దుర్మార్గులు సాధుహితములు బోకార్చుటలో నిపుణులు; పాములు నిరాగసులను జంపుటలో గొప్పవి.

*కృతం మహోన్నతం కృత్యమార్జితంచామలం యశః.*
*యావజీవం సఖే ం దాస్యామో విపులాశిషః.* 65

తా :- చెలికాఁడా! మహోన్నతకృత్య మొనర్చితివి. అమల మైన యశ మార్జించితివి! నీకు యావజ్జీవము మా దివ్య మైన దీవెనలు.

*అవిరతం పరకార్యకృతాం సతాం మధురమాతిశయేన వచోఽమృతం*
*అపి చ మానసమమ్బునిధిర్యశో విమలశారదపార్వణచంద్రికా.* 66

తా :- నిరంతరము పరకార్యముల సాధించు సత్పురుషుల గొప్పతన మెంతని జెప్పుదును? వారి వచోమృతము సర్వాతిశయ మైన రసముగలది; వారి మనస్సు సముద్రము.వారి కీర్తి పర్వదినమందలి వెన్నెల.

*ఏష్యా కుసుమాకరో మే సంజీవయితా గిరం చిరం మగ్నామ్*
*ఇతి చింతయతో హృదయే పికస్య సమధాయి శౌభిగేన శరః.* 67

తా :- ''వసంతము వచ్చును;చిరకాలమునుండి నిద్రింపుచున్ననా పంచమ స్వర మునింక నిద్ర మేల్కొల్పును.'' ఇట్టి వెన్నో కోకిల మనస్సులో నూహలు! ఇంతలో బోయ దాని నొక్క శరముతోఁ బడగూల్చినాఁడు.

*నిర్గుణశ్శోభతే నైవ విపులాడమ్బరోఽపి వా.*
*అపాతరమ్యపుష్పశ్రీశోభితా శాల్మలీ యథా* 68

తా :- గుణములేని వాడాడంబర మెంత యున్నను శోభింపఁడు. శాలశీ వృక్ష మున్నది. ఆ చెట్టు నిండ బూలే!కాని యవి యాపాతరమ్యములు.

*పఙ్కైర్వినా సరో భాతి సదః ఖలజనైర్వినా.*
*కటువర్ణైర్వినా కావ్యం మానసం విషయైర్వినా.* 69

తా :- బురదద లేకున్న సరస్సు భాసించును. సభ దుర్మార్గులు లేకున్న ప్రకాశించును. కటువర్ణములు లేకున్న కావ్యము సంతోష మొసగును. విషయచింత లేని మానసము శోభించును!

యథా తానం వినా రాగో యథా మానం వినా నృపః
యథా దానం వినా హస్తీ తథా జ్ఞానం వినా యతిః. 70

తా :- తానము లేనిది రాగము శోభించదు. అభిమానము లేనిది రాజు శోభింపఁడు. మదజలము లేని హస్తి శోభింపదు. జ్ఞానము లేని యతిఁ ప్రకాశింపఁడు.

తత్త్వం కిమపి కావ్యానాం జానాతి విరళో భువి.
మార్మికః కో మరన్దానామంతరేణ మధువ్రతమ్. 71

తా :- కావ్యతత్త్వమును గొందరే గ్రహింతురు. మకరందములోని మాధుర్యమును గ్రహించునవి మధుకరములే గదా!

సరజస్కాం పాణ్డువర్ణాం కణ్టకప్రకరాన్వితామ్.
కేతకీం సేవసే హన్త! కథం రోలమ్బ నిస్త్రప. 72

తా :- ఓసీ, తుమ్మెదా! నీకు సిగ్గు లేదు. కేతకి నాశ్రయించుచునే యున్నావు. అది సరజస్క; పాండువర్ణ; కంటకప్రకరాన్విత.

వి :- మొగలిపూవు నిండ పుష్పధూలి యుండును. అది తెల్లగా నుండును. కంటకము లనఁగా ముండ్లు. వానిచేతఁ గూడి యుండును. ''కేతకీ'' = స్త్రీలింగస్వారస్యముచేత నొకానొక నాయిక ధ్వనించుచున్నది. ఆమె సరజస్క; అనగా అంటరానిది. లేక రజోగుణముతో గూడిన దనియు నర్థము.

''పాండువర్ణా'' = చెక్కులు మొదలైన వన్నియు తెల్లబాఱినవి.
''కంటకవృతా'' = ఆమె చుట్టు నున్నవారు దుర్మార్గులు.

అనవరతపరోపకారవ్యగ్రీభవదమలచేతసాం మహతామ్
ఆపాతకాటుకాని స్ఫురన్తి వచనాని భేషజానీవ. 73

తా :- నిరంతరమును పరులకుపకారము జేయ గోరు సత్పురుషుల వాక్కులు వీర్యవంతము లైన మందులవంటివి. అవి తినునప్పుడు చేదుగనే యుండును; గొప్ప గుణమును గలిగించును.

వ్యాగుఞ్జన్మధుకరపుఞ్జమఞ్జుగీతా
నాకర్ణ్య ప్రతిలవప్రస్తుతిప్రసంగాన్.
ఆభూమీతలనతకన్ధరాణి మన్యేఽ
రణ్యేఽస్మిన్నవనిరుహాం కుటుంబకాని. 74

తా :- అరణ్యములలో తుమ్మెదలు మధురమధురముగ ఝుంకరించు చున్నవి. ఆ ఝుంకారములలో ప్రతిరవమును వృక్షముల గూర్చిన ప్రస్తుతియే! వానిని విని చెట్లు వినయముతో భూమిని దాకు వరకు శిరములను వ్రాల్చినవి.

వి :- వసంతఋతువులోఁ జెట్లు పుష్పించి ఫలించును. వాని భారముచే కొమ్మలు నేలకు వంగును. ఆ వంగుటను వినయమునఁ దల వ్రాల్చుటగా కవి యుత్ప్రేక్షించుచున్నాఁడు. వసంతమం దెక్కడ జూచినను తుమ్మెదలు మ్రోగుచుండును.

ఉత్తమానామపి స్త్రీణాం విశ్వాసో నైవ విద్యతే.
రాజప్రియాః కైరవిణ్యో రమన్తే మధుపైస్సహ.

తా :- ఉత్తమవంశమునందు జనించి నను స్త్రీలకు విశ్వాస ముండదు. చంద్రునకు ప్రియము లైన కలువలు తుమ్మెదలతోఁ గూడి యుండును.

వి :- ''కైరవిణ్యః'' = నల్లగలువలు; స్త్రీలింగస్వారస్యముతో స్త్రీలనియు నర్థము.

''రాజప్రియాః'' = చంద్రునకు ప్రియ మైనది. ఉత్తములైన రాజులకు ప్రియము లైన వని వేఱొక యర్థము.

''మధుపైస్సహ'' = మధువును సేవించువారని యర్థాంతరము.

మృతస్యా లిప్సా కృపణస్యా దిత్సా విమార్గగాయాశ్చ రుచిస్స్వకాన్తే.
సర్పస్య శాన్తిః కుటిలస్య మైత్రీ విధాతృసృష్టౌ న హి దృష్టపూర్వా. 76

తా :- మృతున కాశయును, కృపణునకు దానమిచ్చుటయందు మమతయు, చెడినదానికి మగనియందు ప్రీతియు, సర్పములకు శాంతియు, కుటిలునకు మైత్రియు, బ్రహ్మదేవుని సృష్టియందు యింతవరకు లేదు.

అయాచితస్సుఖం దత్తే యాచితశ్చ న యచ్ఛతి
సర్వస్వం చాపి హరతే విధిరుచ్ఛృంఖలో నృణామ్. 77

తా :- అడుగకుండగనే సుఖము నిచ్చును. అడిగి నప్పు డివ్వదు. ఒకొక్కొక్క సారి సర్వస్వమును హరించును. విధి విశృంఖలమైన ప్రవృత్తి గలది.

దోర్దణ్డద్వయకుణ్డలీకృతలసత్ కోదణ్డ చణ్డధ్వని
ధ్వస్తోద్దణ్డ విపక్షమణ్డలమథ త్వాం వీక్ష్య మధ్యేరణమ్.
వల్గద్గాండీవము క్తకాణ్డవలయజ్వాలావళీతాణ్డవ
భ్రశ్యత్ ఖాణ్డవరుష్టపాణ్డవ మహోఽకో నక్షితీశః స్మరేత్. 78

తా :- మహారాజా! రెండు బాహువులచేతను కుండలీకృత మైన కోదండము యొక్క చండధ్వనిమాత్రము చేతనేశత్రువులు ధ్వంస మగుదురు. యుద్ధమధ్య మందు నిన్ను జూచిన జనులకు గాండీవ నిర్ముక్తబాణజ్వాలావళీతాండవముచే భ్రష్టమగుచున్న ఖాండవము గలిగి రోషించిన యర్జును నెవ్వరు స్మరింపరు ?

ఖణ్డితా నేత్రకంజాళి మఞ్జు రఞ్జన పణ్డితాః
మణ్డితాఖిల దిక్ప్రాంతాశ్చణ్డాంశోఃపాంతు భానవః. 79

తా:- ఖండితలయొక్క నేత్రకంజములకు ఆనందమును గలిగించునవి, దిగంగనలకు మండనములు, చండాంశుని కిరణములు మమ్ము రక్షించుగాక !

అలభత బత బన్ధం గన్ధమాఘ్రాతుమాగా
ద్యదపి (తదపి) ముక్తో గాయతి త్వద్యశోలిః.

తవ సరసిజ సర్వ్వస్వం సమాదాయ వాయుః.
సురభిరితి యశ స్తు స్వీయమావిష్కరోతి 80

తా:- పద్మమా ! నీ గంధము నాస్వాదించుటకై తుమ్మెద నీయందు జేరినది. కాని యది నీవు రేకులు ముడిచికొని బంధించుటచే, అందే యణగి యుండినది తెల్లవారినదే విముక్తమై, నీ యశమును గీర్తించుచునే పోయినది. ఈ వాయువు కథ యేమి చెప్పెదవు ? తాను నీ గంధము నెల్ల హరించి తన వాసనలుగా వానిని దిక్కులం జాటికొనుచున్నది.

మా గర్వముద్వహ బిడాల మహీపతీనా
మన్తర్గృహం మణిమయం నిలయం మమేతి.
పట్టాభిషేకసమయే తు మహీపతీనాం
బాహ్యాస్థితస్య కలభస్య హి మండనశ్రీః.

తా:- బిడాలమా ! నీవు మణిమయమైన రాజుల నంతఃపురములో నున్నా నని గర్వింపకుము. రాజుల పట్టాభిషేకసమయమందు బయట నున్న కరికలభమునకే గదా యలంకారము !

బంధనస్థోపి మాతఙ్గః సహస్రభరణక్షమః.
శ్వాఽపి స్వచ్ఛన్దనిలయః స్వోదరం నైవ పూర్యతే. 82

తా:- మాతంగము బంధనములో నున్నను, వేయిమందిని బ్రతికించును. కుక్క స్వతంత్రముగ నున్నను, తన పొట్టనే దాను బూరించికొనలేదు.

ధూమాయితా దశ దిశో దళితారవిందాః
దేహం దహన్తి దహనా ఇవ గంధవాహాః.
త్వామన్తరేణ మృదుతామ్రదళామ్రమఞ్జు
గుఞ్జన్మధువ్రతమహో !* కిలకోకిలస్య. 83

* 'మధో' అని పాఠము. మృదువైన ఎఱ్ఱని దళములతో కూడిన ఆమ్ర వృక్షములు గల, గుంజన్మధువ్రత మగు ఓ వసంతమా ! నీవు లేకున్నచో కోకిలకు, దళితారవిందము లగు దశదిశలు పొగ క్రమ్మినట్లున్నవి ...

తా :- దళితారవిందములతో దశ దిక్కులు ధూమాయితములు. గంధ వాహములగ్నివలె దేహమును గాల్చుచున్నవి. మ్నదుతామ్ర దళామ్రములు పెచ్చురేగినవి; ఎక్కడ జూచినను తుమ్మెదలధ్వనులు ! నిన్ను విడిచిన కోకిల కయ్యో!- పాపము!

వి:- పై శ్లోకములో ''త్వాం'' అనుటచేత కవి యెవ్వరిని నిర్దేశించు చున్నాడో సందేహముగా నున్నవి. ఆడుకోకిలను నిర్దేశించుచున్నాఁడని నా యను మానము. కొందరు ''త్వామంతరేణ'' -యనుటకు- ''వసంతమంతరేణ''-యని యర్థము నిచ్చినారు. నాకది రుచింపలేదు.

మూలం భుజఙ్గైశ్శిఖరం విహఙ్గైః
శాఖాః ప్లవఙ్గైః కుసుమాని భృఙ్గైః.
సంసేవతే చందనపాదపోఽయం
పరోపకారాయ సతాం ప్రవృత్తిః. 84

తా :- ఈ చందనవృక్షము సత్పురుషుల ప్రవృత్తి వలె నున్నది. వారి జీవిత మంతయు పరోపకారమునకే గదా ! అట్లే దీని మూలమందు పాములు; శిఖరమందు విహంగములు; శాఖలందు వానరములు; పూవులందు భృంగములు.

సపంకముదకం పీత్వా భేకో బకబకాయతే.
దివ్యచూతరసం పీత్వా గర్వం నాయాతి కోకిలః. 85

తా :- సపంక మైన యుదకమును ద్రావి కప్పలు బెకబెక లాడును. దివ్య మైన చూతరసమును గోలి కోకిల గర్వము నందుటలేదు.

మలయానిలసంసర్గాన్న వేణుశ్చందనాయతే
అంతస్సారవిహీనానాం రసః కేనోపజాయతే 86

మలయానిల సంసర్గముతో వెదురు చందన మగునా? అంతస్సార విహీనులకు రస మెట్లు గల్గును ?

ప్రాప్య యత్ర మధు యాపితా నిశా భృఙ్గ! సర్వమచిరేణ విస్మృతమ్.
హీయమానసుషమాం హిమాగమే పద్మినీం యదిహ నావలోకసే. 87

తా :- ఓరీ! భృంగమా! ఈ పద్మమం దున్న తేనె గ్రోలి, రాత్రులు దీనియందు గడపితివి. ఆ కథయంతయు నిమిషములలో మరచినావు. హిమాగమమందు, అది మంచు గప్పి కాంతిని గోల్పోయినది. నేఁడు దాని వైపు నీవు జూచుటయే లేదుగదా!

అపసర మధుకర దూరం పరిమళబహులేఽపి కేతకీకుసుమే.
ఇహ న హి మధులవలాభో భవతి పరం ధూళిధూసరం వదనమ్. 88

తా :- మధుకరమా! ఇటనుండి తొలఁగుము. కేతకీకుసుమము పరిమళబహుళ మైనను గావచ్చును. కాని దానిలో నీకు మధులవ మైన లభింపదు. ధూళిధూసరమైన వదనమే దక్కును. *

ఖద్యోతో ద్యోతతే రాత్రౌ యావన్నోదేతి చంద్రమాః.
ఉదితే తు సహస్రాంశౌ న ఖద్యోతో న చంద్రమాః. 89

తా :- చంద్రోదయమువరకును మిణుగురు పురుగులు ప్రకాశించును. చంద్రుఁడు బుట్టినదే వాని కాంతికి వెలలేదు. సూర్యుఁ డుదయించెనా! చంద్ర కాంతి లేదు; మిణుగురుల మెఱపు లేదు.

వృథా కథం నృత్యసి చాతక త్వమకాలమేఘోఽయమిభో మదాన్ధః.
న త్వాదృశానాం స దదాతి కించిత్ మాతఙ్గదానం మధుపౌఘ ఏవ. 90

తా :- ఓ, చాతకమా! మదాంధ మైన యేనుగు అకాలమేఘోదయ భ్రాంతిని నీకు గల్గించినది; అందుచే సంతోషించి వృథా నాట్య మాడుచున్నావు; అది మేఘము గాదు, మాతంగమే సుమా! దాని మదధార నీ వంటి వారికి బొట్టు లభింపదు; అది మధుపౌఘములకే!

* నీ వదనము ధూళిదూసర మగును.

*వ్యాసతు స షు గౌతమతు వ్యాళేంద్రతు యో న వేత్తి సాహిత్యమ్.*
*తం ప్రతి సంప్రతి కంప్రతి శిరో మదీయం పురశ్చ న తిరశ్చ న. (91)*

తా : సాహిత్యజ్ఞానము లేనివాడు వేదాంతశాస్త్రపాండిత్యములో వ్యాసుడంతటివాడు ఆయినచో కావచ్చును; న్యాయశాస్త్రమున గౌతముడంతటివాడు కావచ్చును; -వ్యాకరణమున పతంజలిఅంతటివాడు కావచ్చును. కాని అట్టివానిని గూర్చి నా తల, ఇపుడు, ముందుకు గాని, అడ్డముగా గాని ఊగదు.

వి. వ్యాసతు = ''వ్యాస ఇవ ఆచరతు'' = వ్యాసుడువంటివాడు అగుగాక. గౌతమతు = ''గౌతమ ఇవ ఆచరతు.'' వ్యాళేంద్రతు = ''వ్యాళేంద్ర ఇవ ఆచరతు''. వ్యాంళేంద్రుడనగా సర్పరాజైన ఆదిశేషుడు. పతంజలి ఆదిశేషుని అవతారము. వ్యాసుడు బ్రహ్మసూత్రములను, గౌతముడు న్యాయసూత్రమును, పతంజలి అష్టాధ్యాయిపై మహాభాష్యమును రచించిరి. కంప్రతి = ''కంప్రమివ ఆచరతి' (ఇక్కడ 'భవతి' అను అర్థము వివక్షితము). కదలునట్లు అగును. అనగా కదలును. 'పురః + చ + న' ''తిరః + చ + న'' పురః = ముందుకు. తిరః = అడ్డముగా. తల ముందుకు ఊపిన ఆమోదించుటను సూచించును. అడ్డముగా ఊపిన నిషేధమును సూచించును. సాహిత్య జ్ఞానము లేనివా డెంత మహాపండితు డైనను అతని విషయమున మాకు ఉపేక్షాభావమే కాని వాని నామోదింపము;నిరాకరింపము అని భావము ''వ్యాసతు గౌతమతు, వ్యాళేంద్రతు, కమ్ప్రతి'' అనునవి ''సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః''అను వార్తికముచే ఆచారార్థమున 'క్విప్' ప్రత్యయము చేర్చుటచే సిద్ధించిన నామధాతు రూపములు.

*హంసో న భాతి బలిభోజనబృన్దమధ్యే*
*గోమాయుమండలగతో న విభాతి సింహః.*
*జాత్యో న భాతి తురగః ఖరయూథమధ్యే*
*విద్వాన్న భాతి పురుషః నిరక్షరేషు. (92)*

తా :- కాకుల మధ్య హంస శోభింపదు! గోమాయువులలో సింహము శోభింపదు! ఖరములలో తురగము శోభింపదు! నిరక్షరులలోఁ బండితుఁడు శోభింపడు.

*ఉడుగణపరివారో నాయకోఽప్యోషధీనా*
*మమృతమయశరీరః కాన్తియుక్తోఽపి చన్ద్రః.*
*భవతి విగతరశ్మిర్మణ్డలం ప్రాప్య భానోః*
*పరసదననివిష్టః కో లఘుత్వం న యాతి.* 93

తా :- చంద్రుఁడు నక్షత్రపరివారుఁడు; ఓషధీశ్వరుఁడు; అమృతమయ శరీరుఁడు; కాంతియుతుఁడు; కాని సూర్యమండలము నాతఁడు పొంది నపుడు వాని వైభవము లన్నియు లేనట్లగును. పరుల యిండ్లలో నున్నవాఁడెవ్వఁడు చులకన గాడు?

వి :- అమావాస్యనాడు చంద్రుఁడు సూర్యునిలో నుండును.

*గర్జతి శరది న వర్షతి వర్షతి వర్షాసు నిస్స్వనో మేఘః*
*నీచో వదతి న కురుతే న వదతి సుజనః కరోత్యేవ* 94

తా :- నీచుడు జంభములు వల్కుటయే గాని కార్య మొనర్పడు. సత్పురుషుఁడు పలుకకయే పను లొనర్చును. శరన్మేఘము గర్జించుటయే గాని వర్షించుట లేదు. వర్షాకాలమునందు నిస్వనముగా మేఘము వర్షించును.

*కర్పూరధూళిరచితాలవాలః కస్తూరికాచన్దనకర్దమశ్రీః.*
*పునః పునః పుష్కరసేనయుక్తః ప్రాచం గుణం ముఞ్చతి కిం పలాణ్డుః.* 95

తా :- కర్పూరధూళితో బాదు కట్టితిని. మృగమదము, చందనము జేర్చి యెరువు వైచితిని. నీటికి బదులు పుష్పరసమునే బోసితిని. ఇంత యైనను యెఱ్ఱిగడ్డ తన ప్రాత గుణమును వదలినదా!

*అంజలిస్థాని పుష్పాణి వాసయన్తి కరద్వయమ్.*
*అహో సుమనసాం ప్రీతి ర్వామదక్షిణయోస్సమా.* 96

తా :- పుష్పము లంజలిస్థములై రెండు చేతులకును సువాసన గూర్చును. సత్పురుషులయొక్క మనః ప్రీతి యిట్టిది. వామదక్షిణములం దొక్కటే.

అతిపరిచయాదవజ్ఞా సంతతగమనాదనాదరో భవతి
మలయే భిల్లపురంధ్రీ చన్దనతరుకాష్ఠమింధనం కురుతే. 97

తా :- అతిపరిచయముతో నవజ్ఞ యేర్పడును. పలుమారుఁ బోవుచున్నచో ననాదరము గలుగును; మలయపర్వతమునందు భిల్లయువతి చందనపు కట్టెలతో బ్రొయ్యి మండజేయును.

అప్యాసర్వాన్ సటాటోపమగర్జన్నపి కేసరీ
భూభృతాం కురుతే శోభాం గర్జన్నపి న కుఞ్జరః. 98

తా :- సటాటోపము బ్రకటింపకున్నను, గర్జింపకున్నను, కొండలకు సింహ మందము గూర్చును. ఏనుగు గర్జించుచున్నను, యానందము లేదు.

మృగమద ! మా కురు గర్వం పరిమళమాత్రేణ తత్త్వాముపయాసి
పరిమళశీతలతే నిర్మలతా సుకుమారతా చ కర్పూరే. 99

తా :- ఓసి, కస్తూరీ! ఒక్క పరిమళముతో నీ కెంత టెక్కులు! కర్పూరమందు పరిమళ మున్నది. శైత్య మున్నది; నైర్మల్య మున్నది; సౌకుమార్య మున్నది.

వి :- కస్తూరి నల్లగా నుండును; అందుచే నిర్మలత లేదు; గట్టిగా నుండును; సౌకుమార్యము లేదు; ఉష్ణమును గల్గించును; అందుచే శీతలత లేదు.

యే తపనకిరణతప్తా స్తదను చ దావానలేన సందగ్ధాః
జలధర ! శిఖినోఽప్యేతే త్వత్సలిలసేకేన జీవన్తి. 100

తా :- జలధరమా! ఈ వృక్షములు గొప్పవే గావచ్చును కాని యవి నీచేతనే బ్రతుకుచున్నవి. తొలుత నిదాఘసూర్యకిరణతప్తములు; పిదప దావానలసందగ్ధములు; వానిని నీవే బ్రతికించుచున్నావు.

వి :- ''శిఖినః'' = పెద్దకిరీటమును బెట్టుకొన్న గొప్పవారే కావచ్చు నని భావము.

''జీవంతి'' = నీచేతనే బ్రతుకుచున్నారు.

నిరర్థకం జన్మఫలం నళిన్యా యయా న దృష్టః తుహినాంశుబిమ్బః
ఉత్పత్తిరిన్దోరపి నిష్ఫలా హి దృష్టా వినిద్రా నళినీ న యేన. 101

తా :- తుహినాంశుబింబమును జూడలేని నళినియొక్క జీవనము నిష్ఫలము; ఆమెను జూడలేని చంద్రుని యుత్పత్తియు నిష్ఫలమే!

కిం తేన మేరుగిరిణా రజతాద్రిణా వా
యానాశ్రితా హి తరవర స్తరవ స్త ఏవ.
మన్యామహే మలయమేవ నగాధిరాజం
కాకోలనిమ్బకుటజా అపి చన్దనన్తి. 102

తా :- మేరుగిరియు, రజతపర్వతమును, నగాధిరాజములట! కాని సార్థకమేమి? వాని నాశ్రయించిన ఆయా వృక్షములు ఆయా వృక్షములుగనే ఉండిపోవుచున్నవి. మలయపర్వతమే నగాధిరాజమని మా అభిప్రాయము. దాని నాశ్రయించిన ముష్టిచెట్టును - వేపచెట్టునుగూడ చందనవృక్షములవలె నవుతున్నది.

వి :- ''చన్దనన్తి'' = నామధాతువు. చందనవృక్షములవలె నౌచున్నవని భావము.

ఒకడెంతగొప్పవాడైననేమి? వాని నాశ్రయించిన వానికిగూడ ఎవని చేత గౌరవము సిద్ధించునో వాఁడే గొప్పవాఁడు.

రే రే శిఖావళ శిఖాభరణాయ బర్హ
మేకం దిశేత్యనునయాన్మమ కిం దదాసి?
భిల్లాయ వామచరణం హృదయే నిధాయ
నిర్లూనపత్రిణి నిర్దయమర్ప్యమానః. 103

తా :- ఓ, నెమలీ ! తలపైన సొమ్ముగాఁ జెక్కి కొనుట కొక యీక నిమ్మని ప్రార్థించితిని. నీవు నాకెందు కిత్తువులే ! బోయవాఁడు నిన్ను బట్టుకొని, యెడమకాలితోఁ ద్రొక్కి బలవంతముగా పింఛమునంతయు నూడ్చికొనును. అప్పుడు బల్కకుందువు.

# శృంగార సముల్లాసము

*సానుకంపాస్సానురాగాశ్చతురాః శీలశీతలాః*
*హరన్తి హృదయం హన్త ! కాన్తాయాః స్వాన్తవృత్తయః.* 1

తా :- సానుకంపములు; సానురాగములు; చతురములు; శీలశీతములు, కాంతయొక్క స్వాంతవృత్తులు నా హృదయమును హరించుచున్నవి.

*యథా యథా తామరసేక్షణా మయా*
*పునస్సరాగం నితరాం నిషేవితా.*
*తథా తథా తత్త్వకథేవ సర్వతో*
*వికృష్య మామేకరసం చకార సా.* 2

తా :- ఆ తామరసేక్షణ యెంతెంతగా, సప్రేమముగ నాచే ననుభవింపబడుచున్నదో, అంతంతగా తత్త్వకథ వలె, నన్ను సర్వమునుండి యాకర్షించి, యేకరస మొనర్చుచున్నది.

వి :- వేదాంతవిచారము, సమస్త విషయములనుండి మనస్సును మరలించి యానందరూప మైన యొకటే రసమందు నిమగ్న మొనర్చును. ఆమె శృంగారానుభూతి యట్లున్న దన్న మాట ! శృంగారమును తత్త్వచింతతోఁ బోల్చినారు.

*దన్తాంశుకాన్తమరవిన్దరమాపహారి*
*సాన్ద్రామృతం వదనమేణవిలోచనాయాః.*
*వేధా విధాయ పునరుక్తమివేన్దుబిమ్బం*
*దూరీకరోతి న కథం విదుషాం వరేణ్యః.* 3

తా :- దంతకాంతు లను కిరణములచేత గూడినది ; అరవిదంకాంతిలక్ష్మి నపహరించునది. సాంద్రామృత మైనది ; అట్టి హరిణలోచనయొక్క ముఖమును

నిర్మించి బ్రహ్మదేవుఁడు మరల దానికి పునరుక్త మైన హిమాంశుని సృష్టించినాడు; తనకే విసుగు బుట్టి దూర మాకాశమునకు విసిరివేసినాడు.

*విలసత్యాననం తస్యా నాసాగ్రస్థితమౌక్తికమ్*
*అలక్షితబుధాశ్లేషం రాకేన్దోరివ మండలమ్.* 4

తా :- ఆమె ముఖమండలము ముక్కు చివర నున్న ముత్తెము గలదై బాగ గురుతింపదగిన బుధుని సంబంధము గల రాకాచంద్రమండలము వలెఁ బ్రకాశించుచున్నది.

*శ్యామలేనాఙ్కితం బాలే ! భాలే కేనాపి లక్ష్మణా*
*ముఖం తవాంతరాసుప్తభృంగపుల్లాంబుజాయతే* 5

తా :- బాలా ! నల్ల నైన గుర్తుతో ఫాలమున నంకిత మగు నీ ముఖము నడుమ నిద్రపోయిన తుమ్మెద గల బాగుగా వికసించిన పద్మము వలె నున్నది.

*అద్వితీయం రుచాత్మానం మత్వా కిం చంద్ర హృష్యసి.*
*భూమండలమిదం మూఢ ! కేన వా వినిభావితమ్.* 6

తా :- చంద్రుఁడా ! నీ కాంతితో సమాన మైన కాంతి గల వస్తువు లేదని గర్వింపకుము. భూమండల మంతయుఁ దిరిగి చూచినవాఁ డెవ్వఁడు ?

*నీలాంచలేన సంవృతమాననమాభాతి హరిణనయనాయాః.*
*ప్రతిబిమ్బిత ఇవ యమునాగభీరనీరాంతరేణాంకః.* 7

తా :- నల్లని పైట కొంగుతోఁ గప్పబడిన హరిణనయన ముఖము యమునయొక్క గంభీరమగు నీటిలో ప్రతిబింబించిన చంద్రుని వలెఁ బ్రకాశించు చున్నది.

*స్తనాభోగే పతన్ భాతి కపోలాత్కుటిలోఽలకః*
*శశాంకబిమ్బతో మేరౌ లంబమాన ఇవోరగః.* 8

తా :- కపోలములనుండి యెదపై జారుచున్న కుటిలాలకములు శశాంక బింబమునుండి మేరుశిఖరముపైకి వచ్చుచున్న సర్పముల వలె నున్నవి.

అంకాయమానమలికే మృగనాభిపఙ్కం
పఙ్కేరుహాక్షి ! వదనం తవ
ఉల్లాసపల్లవితకోమలపక్షమూలం
చఞ్చూపుటం చటులయన్తి చిరం చకోరాః. 9

తా :- పంకేరుహాక్షీ ! నుదుటియందు మృగనాభిపంక మలదికొన్నావు. అది చంద్రునియం దంకము వలె నున్నది. దానిని జూచి నీ ముఖము చంద్రుడను భ్రాంతితో చకోరములు రెక్క లాడించుచూ చంచూపుటములు దాచుచున్నవి.

శిశిరేణ యథా సరోరుహం దివసేనామృతరశ్మిమండలమ్
న మనాగపి తన్వి శోభతే తవ రోషేణ తథేదమాననమ్. 10

తా :- తన్వీ ! శిశిరముతో సరోరుహము శోభింప నట్లు, దివసముతోఁ జంద్రమండలము శోభింప నట్లు, కోపముతో నీ ముఖము శోభించుట లేదు.

శతకోటికఠినచిత్తః సోహం తస్యాః సుధైకమయమూర్తేః
యేనాకారిషి మిత్రం న వికలహృదయో విధిర్వాచ్యః. 11

తా :- నా హృదయము వజ్రాయుధ మంతటి కఠినము. ఆమె సుధైకమయ ; మా యిరువురకు స్నేహ మొదగూర్చిన విధి ననవలెను !

జ్ఞో మత్ప్రతికూలాన్మే మహద్భయముపస్థితమ్.
బాలే వారయ పాన్థస్య వాసదానవిధానతః. 12

తా :- బాలా ! రాజు నాకు ప్రతికూలుఁడైనాడు. నా హృదయమున దిక్కులేనంత భయము; నేను పాంథుఁడను; నాకు వాసదాన మొసఁగి రక్షింపుము.

*మలయానిలమనలీయతి మణిభవనే కాననీయతి క్షణతః*
*విరహేణ వికలహృదయా నిర్జలమీనాయతే మహిలా.* 13

తా :- మలయానిలము అగ్నియగుచున్నది; మణిభవనము కానన మగుచున్నది; విరహవికలహృదయ యైన యీ మహిళ నిర్జలమీన మగుచున్నది.*

*కాలాగురుద్రవం సా హాలాహలవద్విజానతీ నితరామ్.*
*అపి నీలోత్పలమాలాం బాలా వ్యాలావలిం కిలామనుతే.* 14

తా :- కాలాగురుద్రవమును ఆ బాల హాలాహల మనుకొనుచున్నది; నీలోత్పలమాలను వ్యాలావలిగా భావించుచున్నది.

*తయా తిలోత్తమీయన్త్యా మృగశాబకచక్షుషా.*
*మమేయం మానుషో లోకో నాకలోక ఇవాభవత్.* 15

తా :- ఆ మృగశాబకనేత్రి తాను తిలోత్తమ వలె నాచరించుచున్నది; దానిచే నా కీలోకము నాకలోక మగుచున్నది.

*శోణాధరాంశుసంభిన్నా స్తన్వి తే వదనాంబుజే*
*కేసరా ఇవ కాశన్తే కాన్తదన్తాలికాంతయః.* 16

తా :- తన్వీ! నీ వదనాంబుజమందు శోణాధరాంశుసంభిన్నము లైన దంతపంక్తియొక్క కాంతులు కేసరముల వలె భాసించుచున్నవి.

---

* ''అనలీయతి'' = అగ్నినివలె ఆచరించుచున్నది. అనగా అగ్నివంటిదానినిగా భావించుచున్నది. ''అనలమివ ఆచరతి'' అను అర్థమున ''ఉపమానాదాచారే'' అను సూత్రముచే 'క్యచ్' ప్రత్యయము. ''కాననీయతి'' = కాననమునందున్నట్లు ఆచరించుచున్నది. ''కాననే ఇవ ఆచరతి'' అను అర్థమున ''అధికరణాచ్చ'' అను వార్తికముచే 'క్యచ్' ప్రత్యయము. ''నిర్జలమీనాయతే'' = నిర్జలప్రదేశమునందలి మీనమువలె ఆచరించుచున్నది. ''కర్తుఃక్యఙ్ సలోపశ్చ'' అను సూత్రముచే, ''నిర్జలమీనః ఇవ ఆచరతి'' అను అర్థమున 'క్యఙ్' ప్రత్యయము.

*క్షమాపణైకపదయోః పదయోః పతతి ప్రియే*
*శేముః సరోజవదనానయనారుణకాన్తయః.* 17

తా :- క్షమాపణైకపదము లైన పదములందుఁ బ్రియుఁడు పడినంతనే సరోజవదనయొక్క నయనారుణకాంతు లుపశమించినవి.

*నిర్వాసయంతీం ధృతిమంగనానాం శోభాం హరేరేణదృశో ధయన్త్యాః.*
*చిరాపరాధస్మృతిమాంసలోఽపి రోషః క్షణప్రాఘుణికో బభూవ.* 18

తా :- ఒక గోపిక శ్రీకృష్ణునిపై కినుక వహించి కూర్చున్నది. ఆతడు చేసిన పాత అపరాధముల నన్నింటిని మననము చేసికొనుచున్నది. ఇంతలో ఆతడు రానే వచ్చినాడు. స్త్రీల ధైర్యమును దూరముగ తొలగజేయునది ఆతని సౌందర్యము. ఆ సౌందర్యము నీమె తదేకదృష్టితో చూచి ఆస్వాదింప మొదలిడినది. ఇక నేమున్నది ! ఆ కోప మంతా క్షణకాలపు అతిథి యైనది.

*విధివంచితయా మయా న యాతం*
*సఖి ! సంకేతనికేతనం ప్రియస్య.*
*అధునా బత కిం విధాతుకామో*
*మయి కామో నృపతిః పునర్న జానే.* 19

తా :- సఖీ ! విధివంచితనై ప్రియుని సంకేతస్థానమునకుఁ బోలేక పోయితిని. ఇంక నిప్పుడు నృపతి యైన కాముఁడేమి సేయునో తెలియలేను!

వి :- "నృపతిః" = రాజు, సమస్త మానవుల చిత్తవృత్తులను వశపరచికొని నడిపించును గనుక మన్మథుఁడును నృపతియే !

*సువిమలమౌక్తికతారే ధవళాంశుకచంద్రికాచమత్కారే.*
*వదనపరిపూర్ణచంద్రే సుందరి ! రాకాఽసి నాత్ర సందేహః* 20

తా :- విమలము లైన ముత్యము లను నక్షత్రములు గలిగి నట్టియు, ధవళాంశుక మను వెన్నెల గల్గి నట్టియు, మొగ మనెడు పూర్ణచంద్రుఁడు గలిగి నట్టియు, నీవు, సుందరీ ! పున్నమవే ! సందేహము లేదు.

రూపజలా చలనయనా నాభ్యావర్తా కచావళిభుజఙ్గా.
మజ్జన్తి యత్ర సన్తః సేయం తరుణీ తరంగిణీ విషమా. 21

తా :- రూప మనెడు జలములు గలది, చంచలము లైన నేత్రములు గలది, నాభి యనెడి సుడి గలది, కచావళి యను భుజంగములు గలది; ఈ తరుణి, విషమతరంగిణి వంటిది.

నిపతద్బాష్పసంరోధముక్తచాఞ్చల్యతారకమ్.
కదా నయననీలాబ్జమాలోకేయ మృగీదృశః. 22

తా :- రాలుచున్న కన్నీటి నడ్డగించుటతో ముక్తచాంచల్యములైన తారకలు గల ఆ హరిణాక్షి నయననీలాబ్జము నెపుడు జూతునో !

యది లక్ష్మణ సా మృగేక్షణా న మదీక్షాసరణిం సమేష్యతి.
అమునా జడజీవితేన మే జగతా వా విఫలేన కిం ఫలమ్. 23

తా :- లక్ష్మణా ! ఆ సీతాదేవి నా వీక్షామార్గమునందుఁ బడనిచో యీ జడజీవితముతో నేమి ప్రయోజనము ? ఈ జగత్తుతో నేమి ప్రయోజనము ?

భవనం కరుణావతీ విశన్తీ గమనాజ్ఞాలవలాభలాలసేషు
తరుణేషు విలోచనాబ్జమాలామథ బాలా పథి పాతయాంబభూవ. 24

తా :- ఆమె యింటిలోనికిఁ బోవుచున్నది. వెంట బడిన యువకులు గమనాజ్ఞాలవలాభము నాశించిరి; ఆమె వారియందు విలోచనాబ్జమాలను వేసి ''పోయిరమ్మ''న్నది.

ఉషసి ప్రతిపక్షకామినీసదనాదంతికమంచతి ప్రియే.
సుదృశో నయనాబ్జకోణయోరుదియాయ త్వరయాఽరుణద్యుతిః. 25

తా :- తెల్లవారినది; సవతి యింటినుండి ప్రియుడు వచ్చుచున్నాఁడు. వానిని జూచిన యామెయొక్క నయనాంతములందు వెంటనే యరుణిమఁ దోచినది.

*ప్రాణాపహరణేనాసి తుల్యో హాలాహలేన మే*
*శశాంక కేన ముగ్ధేన సుధాంశురితి భాషితః* 26

తా :- ఓ, చంద్రుఁడా ! నీవు నా ప్రాణములను దీసివేయుచున్నావు. అందుచే హాలాహలసమానుఁడవు. ఎవఁడో తెలియనివాఁడు నిన్ను సుధాంశుఁడని యన్నాడు.

*యదవధి దయితో విలోచనాభ్యాం*
*సహచరి దైవవశేన దూరతోఽభూత్.*
*తదవధి శిథిలీకృతో మదీయై*
*రథ కరణైః ప్రణయో నిజక్రియాసు.* 27

తా :- చెలీ! విధికృతముగ నా ప్రియుఁడు కన్నులకు దూర మైనంతనే, నా యింద్రియములు తమ పనులందు పట్టు వీడినవి.

*నిఖిలాం రజనీం ప్రియేణ దూరాదుపయాతేన విబోధితా కథాభిః.*
*అధికం న హి పారయామి వక్తుం:సఖి మా జల్ప తవాయసీ రసజ్ఞా.* 28

తా :- ఓసీ ! చాలాదూరము నుండి వచ్చిన నా ప్రియుఁడు, ఏవేవో ప్రసంగములతో రాత్రియంతయు మేల్కొనునట్లుఁజేసినాఁడు. ఇఁకనే నెక్కువ జెప్పలేను. నీవు మాటాడకుము. నీది యినుప నాలుక.

*లోలాలకావళిచలన్నయనారవింద*
*లీలావశంవదితలోకవిలోచనాయాః.*
*సాయాహ్ని ప్రణయినో భవనం వ్రజన్త్యా*
*శ్చేతో న కస్య హరతే గతి రంగనాయాః.* 29

తా :- చలించుచున్న అలకలు గలిగిన యా ముఖము ! చంచలము లైన నయనారవిందములు ! లోకుల చూపు లన్నియు నామె వైపుననే ! ప్రియుని యింటికి బోవుచున్న యామె గమనము ఎవని మానసము హరింపదు ?

హరిణీప్రేక్షణా యత్ర గృహిణీ న విలోక్యతే
సేవితం సర్వసంపద్భిరపి తద్భవనం వనమ్.

తా :- ఆడుజింకయొక్క కన్నులతో సమాన మైనకన్నులు గల గృహిణి యే యింటియందు లేదో ! ఆ యిల్లు సర్వసంపద లున్నను వనమే.

చలద్భృంగమివామ్భోజమధీరనయనం ముఖమ్.
తదీయం యది దృశ్యేత కామః క్రుద్ధోస్తు కిం తతః. 31

తా :- అధీరనయన మైన యా ముఖము చలద్భృంగ మైన యంభోజము. అది గన్పించినచో కామునకు కోపము వచ్చినను నన్నేమి సేయును ?

యథా లతాయాః స్తబకానతాయాః స్తనావనమ్రే నితరాం సమాసి.
తథా లతా పల్లవినీ సగర్వే శోణాధరాయాః సదృశీ తవాఽపి. 32

తా :- స్తనావనమ్రా ! స్తబకావనమ్ర మైన లతతో నీ ట్లు సమానురాలవో అట్లే పల్లవించిన యా లత యెఱ్ఱని పెదవి గల నీకు సమాన మైనది.

ఇదం లతాభిః స్తబకానతాభిః మనోహరం హన్త వనాన్తరాళమ్
సదైవ సేవ్యం స్తనభారవత్యో న చేద్యువత్యో హృదయం హరేయుః. 33

తా :- స్తనభారవతు లైన యువతులు మనస్సును హరింపకున్నచో స్తబకానతము లైన లతలతోడి మనోహర మైన వనాంతరాళము సదా సేవ్యము.

సా మదాగమనబృంహితతోషా జాగరేణ గమితాఖిలదోషా.
బోధితాపి బుబుధే మధుపైర్న ప్రాతరాననజసౌరభలుబ్ధైః. 34

తా :- నేను వత్తు నన్న సంతోషముతో యామె రాత్రి యంతయుఁ గాచినది. కడపటి యామమున యామె నిద్రవోయినది. తెల్లవారి తన్ముఖ సువాసనలచే నాకర్షింపఁబడి మధుపము చుట్టుఁ దిరుగుచు ఝుంకరించుచున్నది. కాని యామె నిద్ర లేచుటలేదు,

*అవిచింత్యాశక్తివిభవేన సున్దరి! ప్రథితస్య శంబరరిపోః ప్రభావతః.*
*విధుభావమంచతితమాం తవాననం నయనే సరోజదళ నిర్విశేషతామ్.* 35

తా :- సుందరీ ! మన్మథుని శక్తి యవిచింత్య మైనది; ప్రాకృతిక నియమములు దాని కడ్డురావు. నీ ముఖము చంద్రభావము వహించినది. నయనములు సరోజదళ నిర్విశేషము లైనవి.

*మీనవతీ నయనాభ్యాం కరచరణాభ్యాం ప్రఫుల్ల కమలవతీ*
*శైవాలినీ చ కేశైః సురసేయం సున్దరీ సరసీ.* 36

తా :- ఈ సుందరి నయనములతో మీనవతి. కరచరణములతో ప్రఫుల్ల కమలవతి. కేశములతో శైవాలిని. సురస! ఇది యొక సరసి !

వి :- మీనవతి యనగా చేపలు గలది యని యర్థము; చేపల వంటి కన్ను లావిడ కున్న వన్న మాట ! ఆమె కరచరణములు వికసించిన పద్మములతో సమానము లైనవి.

''సురసా'' = రస మనగా నీరును శృంగార రసమును.

*పాంథ ! మందమతే కిం వా సన్తాపమనువిన్దసి*
*పయోధరం సమాశాస్స్వ యేన శాన్తి మవాప్నుయాః.* 37

తా :- ఓయి ! పాంథుఁడా! నీవు మందమతివి. ఎందుకు తపించుచున్నావు ? పయోధరమును పొంది శాంతి నెట్లు బొందలేవైతివి ? *

వి :- ''పయోధరం'' = మేఘము, స్త్రీలయెద.

*సంపద్యతాం తామతిమాత్రతన్వీం శోభాభిరాభాసిత సర్వలోకామ్.*
*సౌదామినీ వా సితయామినీ వేత్యేవం జనానాం హృది సంశయోఽభూత్.* 38

* పయోధరమునకై ఎదురుచూడుము. శాంతిని పొందగలవు.

తా :- అతిమాత్రతన్వి యైన యా సుందరి తన కాంతులచే దిక్కుల వెలిగించుచున్నది; ఆమెను జూచి మెఱపనుకొన్నారు; పున్నమ యనుకొన్నారు.

సపల్లవా కిం ను విభాతి వల్లరీ సపుల్లపద్మా కిమియం ను పద్మినీ.
సముల్లసత్పాణిపదాం స్మితాననామి తీక్షమాణైః సమలంభి సంశయః. 39

తా :- ఆమె పాణిపల్లవ మెఱ్ఱగా నున్నది. ముఖముపై చిరునవ్వు; ఆమెను గాంచిన జనులు సపల్లవ మైన వల్లరి యనుకొన్నారు. పుల్లపద్మ మైన పద్మిని యనుకొన్నారు.

నేత్రాభిరామం రామాయా వదనం వీక్ష్యతత్క్షణమ్
సరోజం చంద్రబిమ్బం వేత్యఖిలాః సమశేరత. 40

తా:- నేత్రాభిరామ మైన యామె ముఖమును జూచి సరోజమా! లేక చంద్రబింబమా! యని యందఱకును సంశయము.

కనకద్రవకాన్తికాన్తయా మిలితం రామముదీక్ష్య కాన్తయా.
చపలాయుతవారిదభ్రమాన్ననృతే చాతకపోతకైర్వనే. 41

తా :- సీతాదేవి శరీరకాంతి కనకద్రవకాంతి ; రాముడు నీలమేఘ శ్యాముఁడు ; జానకితో గూడిన రాముఁడు మెఱపుతో గూడిన మేఘము వలె నున్నాఁడు. అతనిని జూచి చాతకపోతకములు వారిదభ్రమతో నర్తించినవి :

వనితేతి వదన్త్యేతాం లోకాస్సర్వే వదన్తు తే.
యూనాం పరిణతా సేయం తపస్యేతి మతం మమ. 42

తా :- ఈమె నందరును వనిత యని పిలుచుచున్నారు. పిలుచుకొననిమ్ము; నాకేమి ? యువకుల పరిణిత మైన తప స్సని నా యభిప్రాయము.

స్మయమానాననాం తత్ర తాం విలోక్య విలాసినీమ్.
చకోరాశ్చంచరీకాశ్చ ముదం పరతరాం యయుః. 43

తా :- చిరునవ్వుతోడ గూడిన యామె ముఖమును జూచి, చకోరములు, చంచరీకములు బొందిన యానందమునకు మేరలేదు.

వి :- ఆమె నవ్వు వెన్నెల వలె నున్నది. అందుచే ఆమె ముఖమందు చకోరములకు చంద్రభ్రాంతి ; పద్మములకు కమలభ్రాంతి.

*వదనకమలేన బాలే ! స్మితసుషమాలేశమాదధాసి యదా.*
*జగదిహ తదైవ జానే దశార్ధబాణేన విజితమితి.* 44

తా :- బాలా ! నీ వదనకమలమందు చిరునవ్వుయొక్క కాంతిలేశ మెప్పు డాభాసించెనో, అపుడే పంచబాణుఁడు లోకమును జయించె ననుకొన్నాను.

*కలిందజానీరభరేఽర్ధమగ్నా బకాః ప్రకామం కృతభూరిశబ్దాః*
*ధ్వాన్తేన వైరాద్వినిగీర్యమాణాః క్రోశన్తి మన్యే శశినః కిశోరాః.* 45

తా :- యమునలో కొంగ లున్నవి. అవి నీటిలో సర్ధము మునిగి యఱచుకొనుచు గడ్డకు వచ్చుచున్నవి. వానిని జూచినపుడు చీకటితో బోరి గడ్డకు వచ్చుచున్న బాలచంద్రుల వలె నున్నవి. *

*పరస్పరాసంగముఖాన్నతభ్రువః*
*పయోధరౌ పీనతరౌ బభూవతుః.*
*తయోరమృష్యన్నయమున్నతిం పరా*
*మవైమి మధ్యస్తనిమానమేతి.* 46

తా :- పరస్పరము చేరి స్త్రీ యెద భాగతరమైనది. దానిని సహింపలేక మధ్యము కృశింపఁదొడగినది.

వి :- ఇరువురు శత్రువులు తమలోతాము సంధిజేసుకొని యొక్కటై వచ్చినప్పుడు ఒకరాజు సహింపలేఁడుగదా !

---

* నల్లని యమునాజలములో సగము మునిగి కొంగలు ధ్వని చేయుచున్నవి. వైరముచే అంధకారము బాలచంద్రులను మ్రింగివేయుచుండగా అవి అరచుచున్న వని తలచెదను.

జనమోహకరం తవాలి మన్యే చికురారమిదం ఘనాన్ధకారమ్.
వదనేన్దురుచామిహ ప్రచారాదివ తన్వంగి నితాన్తకాన్తిమన్తమ్. 47

తా :- తన్వంగీ! నీ చికురము జనుల మోహింపజేయు ఘనాంధకారము. వదనేందురుచులు బ్రసరించినవి. అది యతీవకాంతివంతమైనది. [1]

దివానిశం వారిణి కంఠదఘ్నే
దివాకరారాధనమాచరన్తీ.
వక్షోజతాయై కిము పక్ష్మలాక్ష్యా
స్తపశ్చరత్యమ్బుజ వజ్రిరేషా. 48

తా :- ఈ పద్మములు రాత్రింబవళ్ళు కుత్తుకబంటి నీటిలో నిలిచి దివాకరుని గూర్చి తప మొనర్చుచున్నవి. వీనికి ఈ పక్ష్మలాక్షియెదఁ బోయెడు నాస యున్నదా యేమి?

వియోగవహ్నికుండేఽస్మిన్ హృదయే తే వియోగిని!
ప్రియసంగసుఖాయేవ ముక్తాహారస్తపస్యతి. 49

తా :- ఓసీ! వియోగినీ! వియోగవహ్నికుండ మైన నీ హృదయమందు ముక్తాహారము ప్రియసంగసుఖమునకై తపస్సు పట్టినది.

నిధిం లావణ్యానాం తవ ఖలు ముఖం నిర్మితవతో
మహామోహం మన్యే సరసిరుహసూనోరుపచితమ్.
ఉపేక్ష్య త్వాం యస్మాద్విధుమయమకస్మాదిహ కృతీ
కలాహీనం దీనం వికల ఇవ రాజాన మకరోత్. 50

తా :- లావణ్యనిధి యైన నీ ముఖమును సృష్టించిన తరువాత బ్రహ్మదేవుని బుద్ధి అవకతవక లైన దని యనుకొందును. అందుకే వాఁడు చంద్రుని వికలుఁ డైన రాజును వలె కలాహీనునిగా నొనర్చినాఁడు. [2]

---

[1] వదనేందురుచులు ఈ వైపు ప్రసరింపకుండుటచే ఈ అంధకారము నితాంత కాంతిమంతమై యున్నది.

[2] కావుననే ఇతడు వికలుడు వలె (వికలఇవ) నీ ముఖ ముండగా దానిని ఉపేక్షించి కలాహీను డైన చంద్రుని రాజును చేసినాడు.

స్తనాన్తర్గతమాణిక్యవపుర్బహిరుపాగతమ్.
మనోఽనురాగం తే తన్వి మన్యే వల్లభమీక్షితుమ్. 51

తా :- ఓ, తన్వీ! నీ మనోఽనురాగము వల్లభుని వీక్షించుటకువలె స్తనాంతర్గతమాణిక్యశరీరమును ధరించి గడ్డకు వచ్చినది.

జగదంతరమమృతమయైరంశుభిరాపూరయన్నితరామ్.
ఉదయతి వదనవ్యాజాత్ కిము రాజా హరిణశాబనయనాయాః. 52

తా :- జగత్తును సుధామయకిరణములచేత సించుటకు చంద్రుఁడు దీని ముఖవ్యాజమున వచ్చిన ట్లున్నది.

తిమిరశారదచందిరచంద్రికాః కమల విద్రుమచమ్పకకోరకాః.
యది మిలంతి కదాపి తదాననం ఖలు తదా కలయా తులయామహే. 53

తా :- చీకటి, శారదచంద్ర - చంద్రికలు, కమలము, పగడము, సంపెగమొగ్గ, యివి యన్నియు నొకచోటఁ జేరి యున్నచో నీ ముఖమునకు సమాన మగును.

వి :- తిమిరము కేశపాశమును బోలును; శరదిందుకాంతి నవ్వు; వారిజము ముఖమండలము; పగడము పెదవి; సంపెగమొగ్గ నాసిక.

ప్రియే! విషాదం జహిహీతి వాచం ప్రియే సరాగం వదతి ప్రియాయాః
వారాముదారా విజగాల ధారా విలోచనాభ్యాం మనసశ్చ మానమ్. 54

తా:- "ప్రియా! విషాదమును వదలి ...టుము." - ఈ రీతి వల్లభుఁడు వల్కుచున్నాఁడు. ఆ మాటలతో నాయికకు కనులనుంచి నీరు గారెను; మనస్సు నుండి మానము మాయ మైనది.

రాజ్యాభిషేకమాజ్ఞాయ శంబరాసురవైరిణః.
సుధాభిర్జగతీమధ్యం లింపతీవ సుధాకరః. 55

తా :- మదనునకు రాజ్యాభిషేక మైన దని సంతోషించిన చంద్రుడు సుధలతో జగత్తును బూయుటవలె !!

ఆననం మృగశావాక్ష్యా వీక్ష్య లోలాలకావృతమ్.
భ్రమద్భ్రమర సంభారం స్మరామి సరసీరుహమ్. 56

తా :- చలించుచున్న ముంగురులు గల దీని మొగమునుఁ జూచి భ్రమద్భ్రమరసంభార మైన సరసీరుహము జ్ఞాపకమునకు వచ్చుచున్నది.

యా స్త్రీ గురుజనై స్సాకం స్మయమానాననాంబుజా.
తిర్యగ్గ్రీవం యదద్రాక్షీత్ తన్నిష్పత్రాఽకరో*జ్జగత్. 57

తా :- గురుజనులతో పాటు యింటికిఁ బోవుచున్నది. మెడ మలపి స్మయమానముఖాంబుజముగా చూచిన యా చూపు జగత్తును నిష్పత్ర మొనర్చినది.

విబోధయన్ కరస్పర్శైః పద్మినీం ముద్రితాననామ్.
పరిపూర్ణోఽనురాగేణ ప్రాత ర్జయతి భాస్కరః. 58

తా :- ముద్రితానన యైన పద్మినిని కరస్పర్శములచేత, పరిపూర్ణానురాగముచే విబోధ మొనరించుచు ప్రభాతమున భాస్కరుఁడు వెల్గుచున్నాడు.

---

*ప్రయోగించిన బాణము వేరుగ పోయి లక్ష్యమును వేధించుటకై పొన్ను దగ్గర పక్షిరెక్కలు కట్టుదురు. బాణము శరీరములో ఈ ప్రక్కనుండి ఆప్రక్కవరకు రంధ్రము చేసికొని దూసికొని పోయినచో ఆ రెక్కలు రాలిపోవును. లక్ష్యమును ఆ విధముగ వేధించుట నిష్పత్రాకరణము. బాణము శరీరమునకు లగ్నమై ఉండిపోయినచో పత్రములు ఊడవు. అట్లు కొట్టుట సపత్రాకరణము. ''సపత్రనిష్పత్రాదతివ్యథనే'' అను సూత్రముచే 'డాచ్' ప్రత్యయము వచ్చి 'సపత్త్రాకరోతి' 'నిష్పత్త్రాకరోతి' అను రూపములు సిద్ధించును.

అనమ్యా వల్గువచనైః వినివారి తేఽపి
రోషాత్ప్రయాతుముదితే మయి దూరదేశమ్.
బాలా కరాబ్జఖిలి నివేశవశంవదేన
క్రీడాబిడాల శిశునాఽప రురోధ మార్గమ్. 59

తా :- ఆమె మధురవచనములతో బ్రతిమాలి యెంతయో యడ్డగించినది! నా కోపము చల్లారలేదు. పోవుట కుద్యమించితిని. అపుడావిడ చేతిసైగతో పిల్లిని నా దారికడ్డము వచ్చునట్లు జేసినది.

అభూద ప్రత్యూహః కుసుమశరకోదణ్డ మహిమా
విలీనో లోకానాం సహ నయనతాపోఽపి తిమిరైః.
తవాస్మిన్ పీయూషం కిరతి పరిత స్తన్వి ! వదనే
కుతో హేతోః శ్వేతో విధురయముదేతి ప్రతిదినమ్. 60

తా :- కుసుమశరుని కోదండమహిమ నిరాఘాటముగ జెల్లుచున్నది. చీకటులచేత లోకమునకేర్పడిన నయనతాపము మాయ మైనది. నీ మొగము పీయూష వర్షము గురియుచునే యున్నది. ఇంక నేల వృథాగా యీ చంద్రుడు ప్రతిదిన ముదయించుట !!

వినైవ శస్త్రం హృదయాని యూనాం
వివేకభాజామపి దారయన్త్యః.
అనల్పమాయామయవల్గులీలా
జయంతి నీలాబ్జదళాయతాక్ష్యః. 61

తా :- శస్త్రములేకనే యువకుల మనస్సులను భేదించుచున్నారు. వివేకుల యొక్క మనస్సులనుగూడ గలచుచున్నారు. మనోహరములైన వీరి లీలలు, అనల్పమాయామయములు; అట్టి నీలాబ్జ దళాయతాక్షులు వెల్గొందుచున్నారు.

మృణాల మందానిల చందనానాముశీర శైవాలకుశేశయానామ్.
వియోగదూరీకృతచేతనానాం వినైవ శైత్యం భవతి ప్రతీతిః. 62

**తా :**— ఒకతె వియోగముతో బుద్ధి వొలగినదై నడి. దానికి తామరతూండ్లు; మంద్రానిలములు, చందనములు, వట్టివేళ్ళు, నాచు, పద్మములు, వీని ప్రతీతి చల్లదనము లేకుండగనే గలుగుచున్నది.

*యదవధి విలాసభవనం యౌవనముదియాయ చంద్రవదనాయాః.*
*దహనం వినైవ తదవధి యూనాం హృదయాని దహ్యన్తే* **63**

**తా :**- ఈ చంద్రవదనకు విలాసభవన మైన యౌవనోదయమైనది మొదలు, యువకుల హృదయములు అగ్గి లేకనే కాలుచున్నవి.

*న మిశ్రయతి లోచనే సహసితం న సంభాషతే*
*కథాసు తవ కించ సా విరచయత్యరాళాం భ్రువమ్.*
*విపక్షసుదృశః కథామితి నివేదయంత్యా పురః*
*ప్రియస్య శిథిలీకృతః స్వవిషయేఽనురాగగ్రహః.* **64**

**తా :**- "కనులతో కన్నులు గలుపదు; చిరునవ్వుతో భాషింపదు; నీ కథలు చెప్పినపుడామె కుటిలములైన కన్నుబొమ్మలను గదల్చును"— సవతిపై నొకతె యీ మాటలు ప్రియునితోఁ జెప్పుచుండెను. దానిని వినుచున్న వల్లభునకు కొండెములు చెప్పుదాని యందే యనురాగము తగ్గిపోయినది.

*బడబానలకాలకూటవన్ మకరవ్యాళగణైస్సహైధితః.*
*రజనీరమణో భవేన్నృణాం న కథం ప్రాణవియోగకారణమ్.* **65**

**తా :**- ఈ చంద్రుఁడు బడబానల కాల కూటములతోఁ బుట్టెను. మకర వ్యాళములతోఁ బాటు పెరిగెను. ఇఁక వీఁడు జీవుల నెందుకుఁ జంపడు?

*లక్ష్యేత పుణ్యైర్గృహిణో మనోజ్ఞా*
*తయా సుపుత్రాః పరితః పవిత్రాః.*
*స్ఫీతం యశస్తైః సముదేతి నిత్యం*
*తేనాస్య నిత్యః ఖలు నాకలోకః.*

తా :- పూర్వ పుణ్యముతో మంచి భార్య లభించును. ఆ పుణ్యముతోనే ఆమె యందు సుపుత్రులు జన్మింతురు; వారితో వంశమునకుఁ గీర్తి యేర్పడును; తండ్రికి నాక లోక వాసము గల్గును.

*ప్రభురపి యాచితుకామో భజతే వామోరు ! లాఘవం సహసా.*
*యదహం త్వయాధరార్థీ సపది విముఖ్యా నిరాశతాం నీతః. 67*

తా:- ఓసీ ! వామోరూ ! ప్రభు వైనను సరే ! యాచించెనా- వాని గౌరవ మప్పుడే వీగిపోవును. నేను నీ యధరము గోరితిని. నీవు మొగము ద్రిప్పితివి. నిరాశ నన్నావరించెను.

*జలకుంభముమ్భితరసం సపది సరస్యాః సమానయంత్యా స్తే.*
*తటకుంజగూఢసురతం భగవానేకో మనోభవో వేద. 68*

తా;- సరస్సు నుండి జలకుంభములు దెచ్చుచున్నావు. గట్టునందలి నికుంజములోని నీ గూఢసురతము భగవంతుఁడైన మనోభవుఁ డెక్కడో యెఱుగ వలెను !

*త్వామివ పథిక ! ప్రియో మే విటపిస్తోమేషు గమయతి క్లేశాన్.*
*కిమితోఽన్యత్కుశలం మే సంప్రతి యత్పాంథ ! జీవామి 69*

తా :- ఓయీ ! పథికుఁడా ! నీ వలెనే నా భర్తయు, విదేశములందు చెట్లనడుమ కష్టము లనుభవించుచున్నాఁడు. ఇంత కన్నను నా కుశల మే మున్నది ? నే నింకను జీవించి యున్నాను.

*తులామనాలోక్య నిజామఖర్వాం గౌరాంగి గర్వం న కదాపి కుర్యాః*
*లసంతి నానాఫలభారవత్యో లతాః కియన్త్యో గహనాన్తరేషు. 70*

తా గౌరాంగీ ! నీ సాటి లేదని గర్వము వహింపకుము. ఫల భారముతో వంగిన తీగె లెన్నో యడవులలో నున్నవి.

*ఆసాయం సలిలాంతః సవితారముపాస్య సాదరం తపసా.*
*అధునాబ్జేన మనాక్ తవ మానిని తులనా ముఖస్యాఽపి.* 71

తా :- ఓసీ! ప్రొద్దుటనుండి సాయంకాలముపరకు పద్మము నీ ముఖ సామ్యముసకై సవితను గూర్చి తప మొనర్చినది; ఒనర్చి, యేదో నీ ముఖ సామ్యమును గొంత సాధించికొన్నది.

*అయిః మందస్మిత మధురం వదనం తన్వంగి యది మనాక్ కురుషే.*
*అధునైవ కలయ శమితం రాకారమణస్య హంతః సామ్రాజ్యమ్.* 72

తా :- తన్వంగీ! నీ మొగముపై రవ్వంత చిరునవ్వు దోచినదే చాలును. పున్నమనాటి చంద్రుని సామ్రాజ్య మస్తమించినదే యగును.

*మధురతరం స్మయమానః స్వస్మిన్నేవాలపఞ్ఛనైః కిమపి.*
*కోకనదయంస్త్రిలోకీ మాలమ్బనశూన్యమీక్షతే క్షీబః.* 73

తా :- ఈ త్రాగినవాడు మాటికిని బిగ్గరగా నవ్వును. తనలోఁ దానేమో గొణిగికొనును. ఈ ప్రపంచము నంతయు కోకనదము వలె నెఱ్ఱగా జూచును. శూన్యముల వైపు వీక్షించును.

*మధురసాన్మధురం హి తవాధరం తరుణిః మద్వదనే వినివేశయ.*
*మమ గృహాణ కరేణ కరామ్బుజం పపపతామి హహా భభ భూతలే.* 74

తా :- తరుణీ! మధురసమునకన్న మధుర మైన నీ యధరమును నా వదనమున వినివేశింపుము. నీ కరముతో నా కరాబ్జమును గైకొమ్ము! భూమిపై బడిపోదును!

*శతేనోపాయానాం కథమపి గతః సౌధశిఖరం*
*సుధాఫేనస్వచ్ఛే రహసి శయితాం పుష్పశయనే.*
*విబోధ్య క్షామాఙ్గీం చకితనయనాం స్మేరవదనాం*
*సనిఃశ్వాసం శ్లిష్యత్యహహః సుకృతీ రాజరమణీమ్.* 75

తా :- శతోపాయములతో, సౌధ శిఖరమును జేరెను. ఆ రాజ రమణి సుధాఫేనస్వచ్ఛ మైన శయనమందు నిద్రించుచున్నది. ఆమెను నిద్ర లేపి నాఁడు; తొలుత భయముతో నామె కన్నులు చకితము లైనవి; తరువాత సంతోషముతో నవ్వినది; ఊర్పులతో పాటు ఆమెను ఆ పుణ్యవంతుఁడు కౌగిలించుకొనుచున్నాఁడు.*

*ప్రాదుర్భవతి పయోధే కజ్జలమలినం బభూవ నభః.*
*రక్తం చ పథికహృదయం కపోలపాలీ మృగదృశః పాణ్డుః.* 76

తా :- ఆకసమందు మబ్బు దోచినది. నభము కజ్జలమలిన మైనది. పథికుల హృదయములు రక్తము లైనవి. మృగీదృశల కపోలములు తెల్లవారినవి.

* రసాభాసమున క్షుధాహారణము.

# కరుణ సముల్లాసము

*పాపం హన్త! మయా హతేన విహితం సీతాపి యద్యాపితా*
*సా మామిన్దుముఖీ వినా బత వనే కిం జీవితం ధాస్యతి.*
*ఆలోకేయ కథం ముఖం సుకృతినాం కిం తే వదిష్యన్తి మాం*
*రాజ్యం యాతు రసాతలం పునరిదం న ప్రాణితుం కామయే.* 1

తా :- ఆహా ! ! నాచేత నెంత పాప మొనర్పబడినది ! సీతాదేవిని వదలితిని ! ఆమె నేను లేక వనములలో నెట్లుబ్రదుకును ? ఇంత దుర్మార్గుడ నైన నేను పెద్దలముఖముల నెట్లు జూతును ? వారు నన్నేమనందురు ? రాజ్యము పాతాళమువరకు గ్రుంగుగాక ! నేను జీవింపగోరుటలేదు !

# శాంత సముల్లాసము

జగజ్జాలం జ్యోత్స్నామయనవసుధాభిర్జటిలయ
జ్జనానాం సంతాపం త్రివిధమపి సద్యః ప్రశమయన్.
శ్రితో వృన్దారణ్యం నతనిఖిలబృన్దారకవృతో
మమ స్వాన్తధ్వాన్తం తిరయతు నవీనో జలధరః. 1

తా :- వృన్దారణ్యములలో యొక నవీనజలధర ముదయించినది. దాని చుట్టును బృందారకులు గుమిగూడినారు. అది జగజ్జాలము నంతయు జ్యోత్స్నా మయము లైన నవసుధలతో నింపుచున్నది. జనుల యొక్క త్రివిధతాపములను తక్షణమే మాన్పుచున్నది. ఆ నవీనజలధరము నా యంతర్ధ్వాంతమును మాన్పు గాక !!

గ్రీష్మచణ్డకరమణ్డలభీష్మజ్వాలసంసరణతాపితమూర్తేః
ప్రావృషేణ్య ఇవ వారిధరో మే వేదనాం హరతు వృష్ణివరేణ్యః. 2

తా :- నేను గ్రీష్మ చండకర మండలము యొక్క భీష్మ జ్వాలా సంసరణ తాపిత మూర్తిని. వర్షాకాల జలధరము వలె నా వేదనను వృష్ణి వరేణ్యుఁడు హరించుగాక ! !

అపారే సంసారే విషమ విషయారణ్యసరణౌ
మమ భ్రామంభ్రామం విగలిత విరామం జడమతేః.
పరిశ్రాన్తస్యాయం తరణితనయాతీరనిలయః
సమన్తాత్సంతాపం హరినవతమాల స్తిరయతు. 3

తా :- అపార మైన యీ సంసారమున విషమ విషయారణ్య మార్గము ములలో బుద్ధి మటిచి విసుగు లేకఁ దిరిగితిని. తిరిగి తిరిగి యలసిపోయినాను. యమునా తీర నిలయ మైనఁ కృష్ణనవనీత నవతమాలము నా సంతాపమును హరించుంగాక !!

ఆలిఙ్గితో జలధికన్యకయా సలీలం
లగ్నః ప్రియంగులతయేవ తరుస్తమాలః,
దేహావసానసమయే హృదయే మదీయే
దేవశ్చకాస్తు భగవానరవిన్దనాభః. 4

తా :- లక్ష్మీదేవి చేత సలీలముగ గౌగిలింపబడి, ప్రియంగులతా పరివేష్టిత మైన తమాల వృక్షము వలె నున్న స్వామి దేహావసాన సమయమున నా హృదయమున భాసించు గాక !!

నయనానన్దసందోహతున్దిలీకరణక్షమా.
తిరయత్వాశు సంతాపం కాపి కాదమ్బినీ మమ. 5

తా :- నయనానంద సందోహ తున్దిలీకరణక్షమ మైన అట్టి దిట్టి దని చెప్పరాని, కాదంబిని వేగముగ నా సంతాపమును హరించు గాక !!

గణికాజామిళముఖ్యానవతా భవతా బతాహమపి
సీదన్ భవమరుగర్తే కరుణామూర్తే ! న సర్వథోపేక్ష్యః. 6

తా :- స్వామీ ! నీవు కరుణామూర్తివి. గణికాజామిళ ముఖ్యులను గాచితివి. నేను సంసార మను మరుగర్తమునఁ జిక్కి బాధ పడుచున్నాను. నన్ను నీ వుపేక్షింపరాదు.

మలయానిలకాలకూటయోరమణీకుంతలభోగి భోగయోః.
శ్వపచాత్మభువో నిరంతరా మమ భూయాత్పరమాత్మని స్థితిః. 7

తా :- మలయానిలమందును, హాలాహలమందును, రమణీకుంతలములందును, భోగిభోగమునందును, శ్వపచ మన్మథులయందును, నాకొక్కటే పరమాత్మబుద్ధి యేర్పడుగాక !!

నిఖిలం జగదేవ నశ్వరం పునరస్మిన్నితరాం కళేవరమ్.
అథ తస్య కృతే కియానయం క్రియతే హన్త జనైః పరిశ్రమః. 8

తా :- ఈ జగత్తే నశ్వరము. ఇక శరీరము నశ్వరము గాదా! దీని కొఱకు మానవులెంతగాఁ బ్రయాసపడుచున్నారో!!

*అనుపదమఖిలాన్లోకాన్ మృత్యుముఖం ప్రవిశతో నిరీక్ష్యాఽపి.*
*హా! హన్త! కిమితి చిత్తం విరమతి నాద్యాపి విషయేభ్యః.* 9

తా :–అయ్యో! ప్రతినిమేషమందును మృత్యుముఖమున బ్రవేశించువారినిఁ జూచుచునే యున్నాము. కాని యీ మనస్సు విషయములనుండి మరలుటయేలేదు.

*సపది విలయమేతు రాజలక్ష్మీరుపరి పతన్త్వథవా కృపాణధారాః.*
*అపహరతుతరాం శిరః కృతాన్తో మమ తు మతిర్న మనాగపైతు ధర్మాత్* 10

తా :- రాజ్యము నశించుగాక! తలపై కత్తులాడుగాక! నా శిరస్సును, యముడు హరించుగాక! అయినను నా మనస్సు ధర్మమునుండి తొలగకుండు గాక!

*అపి బహలదహనజాలం మూర్ధ్ని రిపుర్మే నిరంతరం ధమతు.*
*పాతయతు వాసిధారా అహమణుమాత్రం న కించిదపి భాషే.* 11

తా :- శత్రువులు నా తలపై నిరంతరము నిప్పులు మండింతురు గాక! ఖడ్గపాత మొనర్తురు గాక! నేనేమియుఁ బలుకను.

సంపూర్ణము.



# భామినీ విలాసము

## శ్లోకానుక్రమణిక

